తెలుఁగు ఫైలాలజీ TELUGU PHILOLOGY ఆంధ్రశబ్దతత్త్వము. కీ. శే. శ్రీ ప్రొఫెసరు, శేషగిరిశాస్త్రిగారిచే రచియింపఁబడినది. ఇప్పుడే పునర్ముద్రితము. ఇందు ఆంధ్రవ్యాకరణము సంపూర్ణముగా చర్చింపఁబడియున్నది. అరవ, కన్నడ, మలయాళభాషలతోడి పోలికలు చూపఁబడియున్నవి. ఫైలాలజీవిద్యార్థులకు చాల ఉపయోగకరము 2 భాగములు 3 0

అర్ధానుస్వారతత్త్వము. వీరిదే. 0 8

చరిత్రరచన. ప్రథమభాగము. చరిత్రరచన యనగా నేమి? సాధనసామగ్రి ఎట్టిది? అనువిషయములను చర్చించి శాతవాహన, పల్లవ, చాళుక్య, చోళుల ప్రారంభచరిత్రములను ఈభాగమున సులువైనశైలిలో ఎల్లవారికిని ఉపయోగపడునట్లు శ్రీ నేలటూరు వెంకటరమణయ్యగారు రచియించియున్నారు. 2 0

అక్కన్న మాదన్నలచరిత్రము. కర్త: వే. వేం. శాస్త్రి (M. A.) గోలకొండ కుతుబుషాహి సుల్తానులలో కడపటివాఁడైన తానీషాయొక్కయు, రామదాసు (గోపన్న)యొక్క మామలైన ఈ యాంధ్రమంత్రులయొక్క విషాదచరిత్రము సులువైన నవలవలె రచియింపఁబడియున్నది. 2 0

శ్రీకృష్ణరాయవిజయనాటకము. కర్త: వే. వేం. శాస్త్రి (M. A.) 0 8

వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము—25 ప్రకరణములు. సులువైనశైలి. శాస్త్రులవారి హాస్యము, విమర్శలు, విద్యావినోదములు, సుఖదుఃఖములు, సమకాలికపండితవిమర్శలు మొదలైన యనేకవిశేషములు గలవు. శ్రీ డాక్టరు. సర్. కట్టమంచి రామలింగారెడ్డిగారి 'గురుపూజ' యను నుపన్యాసముతో నలంకృతము. 2 0

A HAND-BOOK OF CLASSICAL SAMSKRIT LITERATURE for college students. (Sri U. Venkatakrishna Rao, M. A.) With Questions. 2 0



Sri Sastry Garu in 1927

# వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్ర సంగ్రహము

శ్రీ డాక్టర్: సర్. కట్టమంచి రామలింగారెడ్డి మహాశయ
విరచిత గురుపూజా సుమాలంకృతము.

(ద్వితీయ ముద్రణము)

కర్త
**వేదము వేంకటరాయశాస్త్రి, ఎమ్. ఏ.**

**వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,**
**4. మల్లికేశ్వరస్వామిగుడిసందు**
లింగిసెట్టివీథి, మదరాసు.
1949

రు 2-0-0.

శ్రీ

తాతగారిజీవితము

సమగ్రముగా నాంధ్రభాషాసేవకే

సమర్పింపఁబడినది.

శ్రీవారి ఈజీవితచరిత్రగ్రంథము

శ్రీ వేంకటగిరిమహారాజా

శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రులవారికిని,

ఆదినుండియు వారినిపోషించుచుండిన రెడ్డివర్యులకును,

వారికి ఆప్తమిత్రులును శిష్యులును నై,

'ప్రతివర్షపర్యాప్త ధాన్యదాతలై యుండిన

శ్రీ గునుపాటి ఏనాది రెడ్డిగారికిని,

వీరే కార్యదర్శిగా పదివేలరూప్యములను చందా వేయించి

ఋణనివృత్తి గావించి తాతగారికి తుదిదినములలో

హృదయశాంతిం గూర్చిన, మా నెల్లూరి మండలీయ

రెడ్డిసంఘమునకును,

ఇట్లే మిత్రభావముతోను శిష్యభావముతోను

తాతగారిని నిరంతరము ఆదరించుచు

శతాధిక గ్రంథములను వారిచే రచియింపించి

ఆంధ్రభాషోద్ధరణముం గావించినమహాశయులకెల్లరకును

స్వీయముగానే అంకితము.

ఈమహనీయుల నామధేయములు

ఆంధ్రవాఙ్మయమున చిరస్థాయిగా స్వర్ణాక్షరముల

వెలుంగుగాక.

# విజ్ఞాపనము

ఈజీవితచరిత్రను రచియించునుద్దేశము నాకు చిరకాలమునుండియు కలదు. శ్రీ తాతగారు జీవించియుండినపుడు నే నొకపరి బాస్వెల్ మహాశయవిరచిత డాక్టర్ జాన్సన్ పండిత జీవితచరితమును చదివితిని. నాటినుండియు శ్రీ తాతగారి భాషాసేవపై నాదృష్టి మరలెను. తమ జీవితచరితమునందలి విషయములను వారు నాకును తమ శిష్యబృందమునకు చెప్పునప్పుడు గ్రహించి గ్రంథస్థములంజేయుచు వచ్చితిని. వారు చనిపోవుటకు కొన్ని నెలలుముందు, ఒకపరి, చిరకాలముగా తమకడ పడియుండినజాబుల నన్నిటిని, కొన్నిటిని చింపియు, కొన్నిటిని చింపకయు పాఱవేసిరి. వెంటనే వానినెల్ల నేను సేకరించుకొంటిని. శ్రీవారు పరమపదించినవెనుక వారిగ్రంథములను పఠించియు, తమ్ముగూర్చి వారు ఎచ్చటెచ్చట నేమేమి చెప్పుకొనియుండిరో వానినెల్ల సేకరించియు, వారికి వచ్చినజాబులను ఆధారముగా నుంచుకొనియు కాలానుక్రమణిక నేర్పఱచుకొని జీవితచరిత్రను అప్పుడప్పుడు వ్రాయుచు ధ్యానించుచు నుంటిని. నెల్లూరిలో నా మిత్రులును, తాతగారిశిష్యులును కొందఱు, నిరంతరము తమ గురువర్యులనే ధ్యానించుచుండువారు, ఈవిషయమై శ్రద్ధ వహింపసాగిరి. అప్పుడప్పుడు సంభాషణలనడుమ తాతగారిచరిత్రనే ఒకరికొకరము చెప్పుకొనుచు మా యభిప్రాయములను ద్రఢీకరించుకొనుచు వచ్చితిమి. పత్రికలలో నెవరో యొకరు

వారింగూర్చి వ్యాసములు వ్రాయుచునేయుండిరి. వీనిలో మా మిత్రులు శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి 'సుమనస్కృతి' ప్రశంసనీయకావ్యము. నేనును కోరినవారికెల్ల విషయసహాయము చేయుచునేయుంటిని. భారతిలో 1936 సం., శ్రీ తాతగారిచరిత్రను తొలిమారు సమగ్రవ్యాసముగారచించి ప్రకటించితిని. కొంచె మించుమించుగా నాకాలముననే శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారు, మేము ప్రకటించిన సాహిత్యదర్పణమున కుపోద్ఘాతముగా, నొకటి రచించిరి. ఆవెనుక శ్రీ గుఱ్ఱము సుబ్బరామయ్యగారు 'శాస్త్రి సంస్కృతి'ని ప్రకటించిరి. ఇటీవలనే శ్రీ సంగోలు వేంకటరంగయ్యపంతులుగారు త్రిలిఙ్గపత్రికలో కొన్నివ్యాసములు వ్రాసి వానినెల్ల నొక్కటిగా సంపుటీకరించినారు. నేను, గురుపాదధ్యానముగాను, సామాన్యవిద్యార్థులకు పఠనపాఠన యోగ్యముగానుండు నట్లును, సమకాలికాంధ్రభాషాస్థితిని వర్ణించుచు సంగ్రహముగా నొకచరిత్రను వ్రాయసంకల్పించి, అనవసరములని నామదికిం దోచినవానిని వదలి ఈచిన్నిగ్రంథమును వెలువరించుచున్నాఁడను. మేమెల్ల నొకవిషయమును గుఱించియే ఇట్లు వ్రాయుట గురుభక్తి పారవశ్యముచేతను, ఈవిధముగానే పలువురు వ్రాయవలయు ననుతలంపుచేతను.యుద్ధమువలని బాధలెల్ల నీగి, మనకు జయకాలమువచ్చి, ముద్రణ పరికరములెల్ల వెలలుతగ్గి అనుకూలించి, సమగ్రమైనచరిత్రను ప్రకటించు నవకాశము త్వరలో కలుగునుగాక.

నే సీచరిత్రను ముద్రించి, మావారైన శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారికి చూపి 'ఎవరైనను పెద్దలు నాయీ ప్రయత్నము నాంధ్రపండితాళికి ఎఱుకపఱుచుట మంచిది' అని విన్నవింపఁగా వారు వెంటనే 'శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారు శాస్త్రిగారి శిష్యులలో నగ్రగణ్యులు. పైగా నపారమైన గురుభక్తిగలవారును. వారే ఇందులకుతగినవారు.' అని సెలవిచ్చి, వారు వచ్చినంతనే నాకు వారిదర్శనము తామే చేయించి నాప్రయత్నముం గూర్చి వారికడ ప్రశంసించిరి. శ్రీ రెడ్డిగారు తమకు సహజాలంకారమైన ఆదరాభిమానములతో 'మాగురువుగారి గ్రంథమునకు కాదనగలనా' అని తక్షణమే నాపుస్తకమునకు ప్రశంసావాక్యముల వ్రాయుట కంగీకరించిరి.

శ్రీ రెడ్డిగారు తాతగారి శిష్యులలో మొదటిశ్రేణిలోనివారు. తాము కళాశాలలో నాంధ్రవిద్యార్థులు; తాతగారు సంస్కృతోపాధ్యాయులు. ఐనను తాతగారిగుణములచే నాకృష్టులై అత్యంతమిత్రులును ప్రియశిష్యులును నైరి. విద్యార్థిదశయందే రెడ్డిగారియందు భావిప్రతిభాస్ఫోరకములైన చిహ్నములు శ్రీ తాతగారు కనిపట్టుచువచ్చిరి. వీరి 'ముసలమ్మ మరణము'నకు పరీక్షకులలో తాతగా రొకరు. వీరిరచనాపరిపాటి ఇతరరచనల నధఃకరించి మిన్నగానుండుటంగని వీరికే బహుమాన మిప్పించిరి. శ్రీ రెడ్డిగారు ఆధునికాంధ్రవచన రచనావిధాతలలో నొకరు. వీరి కీర్తి నన్నయ చిన్నయల

నారాధించుటచే వచ్చినది. ఆంధ్రభారతపఠనాసక్తి వీరికి హెచ్చు; అదియే వీరి కభిమానగ్రంథము. తెనుఁగువచనగ్రంథములలో చిన్నయ తర్వాత శ్రీ తాతగారి కథాసరిత్సాగరము వీరికి కడుం బ్రియము. మైసూరులో నుండుకాలమున కథాసరిత్సాగరము, అన్నిభాగములను, రెండుప్రతులు, ఒకటి ఇంటను, రెండవది కళాశాలలోను ఉంచుకొనియుండువారు. విరామసమయములలో వీనిని చదువుచుండువారు.

ఇట్టి, మా రెడ్డిగారు తమకు అనారోగ్యమైనను, కార్యాధిక్యముచే నవకాశము లేకున్నను, శ్రీ తాతగారియందలి భక్తిచేతను, నాయందలి వాత్సల్యముచేతను, 'గురుపూజ' యని పేరిడి, నాగ్రంథమును ప్రశంసించుటలో క్రొత్తయేమి! శ్రీ రెడ్డిగారికి నేను నిరంతరము కృతజ్ఞుఁడనే.

అల్పజ్ఞుఁడనైన నామాటలకు, బాలభాషితమునకుం బోలె, సంతసించుచు నన్నీరచనకు పురికొల్పుచుండిన మా నెల్లూరి మిత్రులకెల్లరకును వందనములు.

25–12–'43
మదరాసు.

వే. వేం.

# గురుపూజ

గురుప్రాయులైన శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారికిని శిష్యుఁడనైన నాకునుగల పరిచయవిశేషములఁ గొన్నింటిని నివేదించి నాయొక్క ఋణభారమును కొంతఁ దీర్చికోనెంచినాఁడను. నేను క్రైస్తవ కళాశాలలో 1897 వ సం॥ మొదలు 1902 వ సం॥ వఱకు విద్యార్థిగా నైదేఁడు లుంటిని. నేను తెనుఁగు తరగతికిఁ జేరినవాఁడనయినను చేరిననాటినుండియు వీరి దర్శనగౌరవమును సల్లాపభాగ్యమును నాకు లభించినవి. ఆకాలమున నాకాలేజిలో 'ఆంధ్రభాషాభిరంజని' యనుపేర తెనుఁగుసమాజ మొక్కటి యుండెడిది. దాన నేనొక సభ్యుఁడను. ఏటేట రెండు మూఁడు పర్యాయములు వచ్చి ఆసమాజమును ఆదరించు గొప్పవారిలో శ్రీ శాస్త్రులవా రొకరు. వీరివచనము మృదుమధురము, హాస్యరసశోభితము. ఎట్టి గాఢమైన విషయమైననుసరే, సరళముగను సరసముగను వివరించువిధానము వీరికలవడినట్లు పెఱ అగ్రాసనాధిపతులలో గానంబడదు. వీరి ప్రసన్నత సర్వసభికాకర్షకము. మేము చిన్నవారము, అల్పజ్ఞులము. అయినను మమ్ము మందలించునప్పుడు సయితము, మిక్కిలి మర్యాదతో, మేము పొరఁబాటుపాలైనట్లు పల్కుదురగాని తప్పులలోఁబడినట్లు కఠినముగా పలుకరు. నాకవిత్వతత్త్వవిచారమునకు బీజమైన కళాపూర్ణోదయ విమర్శనవ్యాసమును నేను వీరియధ్యక్షతక్రిందఁ జదువఁగాఁ గొంతవఱకు అత్యుక్తిదోషమందున్నదని మెత్తనిరీతిని పరిశీలించి నాకు

ధైర్యముకలిగించిరి. మనసునిటువిరుగునట్లు మాటలాడుట వీరి పద్ధతి గాదు-అనఁగా నితరపండితులపై దాడివెడలునప్పుడు తప్ప! వీరికిని మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకట రత్నము పంతులుగారికిని నడచిన వాగ్యుద్ధము ఆనాటి ఆచార మునకు సరిపోయినదిగాని నేఁడు మనకు స్మరణయోగ్యము కాదు. వ్యాకరణాది మీమాంసలే నాటి విమర్శకవిచార ములు. ఆచర్చలలో సరళము లరుదు; పరుషములే మెండు; భాష ప్రధానము, భావము కాదు. పరుషవాక్యములను తీసి వేసినయెడల శాస్త్రులవారి విమర్శనము మనకెల్ల భాషాజ్ఞాన మును విస్తరించిన వరప్రసాదము.

వీరికిని శ్రీ సమర్థి రంగయ్యసెట్టిగారికిని పరస్పరహితభావ మెక్కువ. సెట్టిగారు ఉపభాషావిద్యలకు విచారణకర్తలు; ఒక విధముగ శాస్త్రులవారికి యజమానులు. వారును మృదుహిత సరసవాక్ప్రౌఢిగల్పులు. విద్యార్థులను సంబోధించునప్పుడు 'న' కార ప్రయోగ మెన్నఁడును చేసినవారుకారు 'మీరు', 'దయ చేయండి', 'తమవిషయ మెఱుఁగుదును' ఇత్యాదిరీతుల మమ్ము మన్నించువారు. అట్టి తరుణముల మామనస్సులందు స్వచ్ఛంద ముగ జనించు వినయము, సిగ్గు, పూజ్యభావము, ఇట్టిట్టివని చెప్పఁగాదు. శ్రీ సెట్టిగారును శాస్త్రులవారును విద్యార్థులను మంచిమార్గములకు ప్రేరేపించు సహజశక్తిగలవారు. ఆచా ర్యుల కుండవలసిన యుత్తమగుణములలో నిదియొకటి. ఈ కళ యందు వీరిరువురును అసామాన్యులు.

శ్రీ శాస్త్రులవారికి సరస్వతీప్రసన్నమేగాని లక్ష్మీకటాక్షము సంప్రాప్తించలేదు. ఆముక్తమాల్యదకు ఉత్కృష్ట వ్యాఖ్యను, సంజీవనీనామకమును, రచించి ముద్రణకార్యము నకై ధనసాహాయ్యముంగూర్చి నన్ను హెచ్చరించిరి. అందులకై నేను అడిగియు అడుగకమున్నే, శ్రీ అల్లాడి కృష్ణ స్వామయ్యగారు వేయిరూప్యములను, నిండుహృదయముతో సంతోషముగ నిచ్చిరి. ఇచ్చినదానికంటె ఇచ్చినరీతి గణ్యతరము. ఇది శ్రీ అల్లాడి కృష్ణస్వామియొక్క సహజౌదార్యలక్షణము. వ్యాఖ్యానమెట్లో ముద్రితమైనది. శ్రీ శాస్త్రులవారు, నాయందలి వాత్సల్యాతిశయముచే, ఏతద్వ్యాఖ్యానరంగాధిరోహణమహోత్సవమును అగ్రపీఠమునుండి నడుపవలసినదిగా నన్నుం గోరిరి. నాకా అర్హతలేదు. సంస్కృతాంధ్రముల పారంగతులైన శాస్త్రులవారి పరిపక్వామోఘవ్యాఖ్యానమెక్కడ! తెలిసియుఁ దెలియకపల్కు నేనెక్కడ! ఐనను గురువులయాజ్ఞ. అనుల్లంఘ్యము. ఒప్పుకొంటిని. సభ మద్రాసులో జరిగెను. విద్యాశేఖర ఉమాకాన్తముగారు మొదలగు విద్వద్వరేణ్యులు వచ్చిరి. "కనకపుసింహాసనమున" నేను గూర్చుంటిని. అందఱి యెదుట, జంకుపాటుతో, ఆగ్రంథమును గుఱించియు, వ్యాఖ్యానమును బట్టియు, శ్రీ శాస్త్రులవారి జీవితమును, వారి భాషాదోహదాది కౌశల్యమును గూర్చియు వచించుచు, ఏమాత్రము బ్రాహ్మణేతర కవులకు మనభాషా చరిత్రలో తక్కువపాటు ఉద్దేశ్యపూర్వకముగనో లేక నిరు

ద్దేశ్యముగనో సంభవించినదో అది విచారణీయమని సాహ
సించి నివేదించితిని. ఆముక్తమాల్యదయొక్క కర్తృత్వము
అల్లసాని పెద్దన్నకు కొందఱిచే అర్పింపఁబడియుండుట
న్యాయము కాదనియు, అది కృష్ణదేవరాయకృతమ యనియు,
సిద్ధాంతీకరించిన వారగుట శ్రీ శాస్త్రులవారికి నేను బహిరంగ
పఱచిన మీమాంస ఆశ్చర్యమును కలిగింపలేదు; అసహ్యము
కాలేదు. కాని కొందఱు పండితులు కోపపడిరి. సహజమేకద.
నూతనాభిప్రాయములు అలవాటునకు వచ్చుటకు కాలముపట్టును
గదా. ఈమధ్యలో నవి కొన్నియెడల కొందఱిలో మనస్తాపము
కలిగింపకయుండునా? కాని శ్రీ శాస్త్రులవారియొక్క మనో
వైశాల్యము కొలఁదికి మించినది. ఏవిషయమైనను సరే, క్రొత్త
దిగా నుండనీ, ఆగమాచారములకు విరుద్ధముకానీ, వేగిర
పడక, ఆగ్రహింపక, శాంతముగ ఆమూలాగ్రముగ పరిశీలించి,
సత్యశోధనపరాయణత్వమును ప్రకటించువారిలో వీరు అగ్ర
గణ్యులు. కావుననే వీరియభిప్రాయములు సమరసములు
సహృదయసమ్మతములునై యున్నవి.

శ్రీశాస్త్రులవారి యంతిమదశలో నెల్లూరు వారియింటికిఁ
బోయి కృతప్రణాముఁడనై కొంతసేపు సంభాషించితిని. శ్రీ
రేబాల లక్ష్మీనరసారెడ్డిగారిచేఁ బ్రసాదింపఁబడిన పౌరసౌధ
మున అలంకారములమీఁద వారు అద్భుతమైనరీతిని ప్రసంగిం
పఁగా ఆనందపారవశ్యముం జెంది కొన్నిమాటలతో, అనఁగా

అసంగత్యలంకారములకు దృష్టాంతములైన మాటలతో, సభోపసంహారముం గావించితిని.

ఆంధ్రభాషకు నూతనజీవనమును, నవీనకళను, నవ్యమును దినదిన ప్రవర్ధమానమును నయిన పరిణామమును ప్రసాదించిన పండితులును కవులును నాటకకర్తలును వచనరచనా ధురీణులును వ్యాఖ్యాతలును అయినవారిలో శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు ప్రథములు - అద్వితీయులు. వీరు పేరుచెప్పి, ఇంకెవరిపేరు చెప్పనగును ?

కావుననే వీరికి 'కళాప్రపూర్ణ' బిరుదమును ఆంధ్రవిశ్వవిద్యాలయముచే 1927-వ, సంవత్సరమున నిప్పించి ధన్యుండనైతిని. "నన్ను బి. ఏ. చేయువా ?" అని నేను వైస్‌ఛాన్సలర్ అయినప్పుడు హేళనముగ నన్నడిగిరి. "అయ్యా, బి. ఏ., లను పుంఖానుపుంఖములుగ మీరలు చేసినారు గదా. ఈపిచ్చి మీ కెందుకు ?" అని నేను ప్రతిహేళనమొనర్చితిని. మనసులో మొదటినుండియు ఒక్క తలంపు నాకుండెడిది, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు స్థాపనకువచ్చిన పిమ్మట జరుగు మొదటి బిరుదప్రదాన మహోత్సవములో శ్రీ శాస్త్రులవారికి 'కళాప్రపూర్ణ' నామకమైన డాక్టొరేటు బిరుదమును కానుకగా సమర్పింపవలెనని. భగవంతుని కృపచే ఆయభిలాష నెఱవేఱెను. ఈక్రింది ప్రశంసావాక్యములతో ఆ యుత్తమగౌరవ - బిరుదమును 1927 సం॥ డిసంబరు 5 తేదిలో నడచిన కాన్వొకేషనులో సమర్పించి మన యూనివర్సిటీ కృతకృత్యతా మహిమ వహించెను.

''ఛాన్సెలర్ మహాశయా,

ఉభయభాషాపారీణులైన శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారికి 'కళాప్రపూర్ణ' అను గౌరవబిరుదమును ఆంధ్ర విశ్వకళాపరిషత్ పక్షమున తాము సమర్పింపవలయు నని నావిన్నపము.

శ్రీ శాస్త్రులవారు చెన్నపురి క్రైస్తవకళాశాలలోఁ జిరకాలము ప్రధానసంస్కృతపండితులుగనుండి పెక్కండ్రు విద్యార్థులకు జ్ఞానబోధచేసి కృతకృత్యులైన మహాను భావులు; మఱియు బహుగ్రంథముల రచించి భాషాభివృద్ధికి మిక్కిలి తోడ్పడినవారు. వీరు రచించిన ప్రతాపరుద్రీయాది స్వతంత్రగ్రంథములు వీరికవితాపరిపాటికిని, విమర్శనగ్రంథములు వీరి సునిశిత మతివిశేషమునకును, శృంగార నైషధాది వ్యాఖ్యానములును, కథాసరిత్సాగరాది భాషాంతరీకరణములును వీరి రసజ్ఞతకును, సర్వంకషమైన పాండిత్యమునకును, తార్కాణములు. వార్ధకదశయందును మనఃక్లేశ దేహక్లేశములకు వెఱదీయక, ఆముక్తమాల్యదకు సమగ్రమగు మహావ్యాఖ్యానమును వీరు మొన్ననే రచించి ప్రచురించుట తలపోయఁగా, భాషాకృషి వీరికిఁ గర్తవ్యము గానేగాక స్వభావముగఁగూడఁ బరిణమించినట్లు స్పష్టమగుచున్నది.

ఆంధ్రభాషోజ్జీవనమే నిజజీవిత పరమార్థముగఁ జేసికొని నిత్యప్రకాశమానమైన కీర్తిచే విరాజిల్లునీ శ్రీ వేదము

వేంకటరాయశాస్త్రిగారికిఁ దాము 'కళాప్రపూర్ణ' నామక ఉత్తమ బిరుదమును బ్రసాదింతురని నాప్రార్థన.''

శాస్త్రులవారి జీవితము మఱువఁదగినదికాదు. ఆబాల గోపాలము ఎల్లవారును మనసున స్థిరముగ నుంచుకొనవలసినది. మహనీయుల జీవితములట్లు సన్మార్గబోధకములును పురోవృద్ధి కారణములునైన శక్తులు వేఱొక్కొయులేవు. ఈ మహనీయుని ఆశ్చర్యజనకమైన జీవితచరిత్రను అతని మనుమఁడును తన్నామాంకితుఁడునైన యువకుఁడు రచించియుండుట నాకుఁ జెప్పరాని యంత ముదమును మెప్పును గలిగించుచున్నది. ఆంధ్రవాఙ్మయమున ఆంగ్లసారస్వతమునందుంబోలె జీవితచరితాది రచనలు కావలసినంత తఱుచుఁగా లేవు. అట్టిలోపమును పూరించు గణ్యములైన ప్రయత్నములలో నిదియొకటి. శ్రీ శాస్త్రులవారి జీవితమునందలి ఆయాదశావిశేషములను వారి కడన వినియుండినందువలనను వారిగ్రంథములను పఠించుట చేతను శ్రీవారి స్వకీయ భాండాగారమునందలి వ్రాఁతల సాయముచేతను ఈరచనవీరికి సాధ్యమైనది. ఇతరు లింత సమగ్రమును సత్యమును అయిన చరిత్రను వ్రాసియుండఁ జాలరు. శైలియు మంచిది; నిర్దుష్టము; స్పష్టము. ఈయువకుఁడును తాతయట్ల గొప్పకీర్తిని గడించునుగాక. శాస్త్రులవారి పేరువలె 'వేదము' వారి ఎల్లరపేర్లను మనభాష ఎంతకాలముండునో అంతవఱకు దేదీప్యమానముగ నుండును గాక.

పద్మప్రభాస, చిత్తూరు.<br>
11-11-1943

కట్టమంచి రామలింగారెడ్డి.

# విషయసూచిక.

ప్రకరణము. పుట.

" దేశక్షేమమునకు భాషాక్షేమము పునాది "

ఆంధ్రసారస్వత సభోపన్యాసము.—1919.

# వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితము

## ఉపోద్ఘాతము

ఆంధ్రవాఙ్మయమునకు పందొమ్మిదవ శతాబ్ద్యుత్తరార్ధమున నూతనవికాసము కలిగినది. అట్లే దేశమందంతటను, ఒక్క భాషకే అననేల, పెక్కింటికి నూతనోజ్జీవము కలుగఁజొచ్చినది. మదరాసు విశ్వవిద్యాలయస్థాపనము, ఆంగ్లవిద్యాప్రాబల్యము, పత్రికాప్రచారము, పాశ్చాత్యనాగరికతాప్రాచుర్యము మున్నగు ననేకకారణములచే జనుల రుచులు వేషభాషలు మాఱఁజొచ్చినవి. అంతకుముందు దేశమందులేనివి, వాఙ్మయమునకు జీవనౌషధములు, ముద్రాయంత్రములు వెలయఁజొచ్చినవి. దేశమంతయు మేలుకొనందొడంగినది. అట్టి యాసంధికాలమున పలువురు పండితులును, వర్తకులును, సంస్కృతాంధ్రగ్రంథములను, కనఁబడినవానినెల్ల వీలున్న పరిష్కరించి, లేకున్న దొరకినది దొరకినట్లుగా ముద్రించి, అదేయదనుగ హెచ్చువెలలకు విక్రయించుచుండిరి. కవులును కొందఱు ఆంగ్లవిద్యాసంపర్కముచే నూతనమార్గములలో కవనములకుం దొడంగి, తత్పూర్వము ఆంధ్రమున లేనివానిని, నాటకాదులను ఆంగ్లగీర్వాణాదిభాషలనుండి యనువదించుచుండిరి.

ఇట్లు క్రొత్తయావేశముతో రచించు నీకవులు పెక్కుప్రమాదములకు లోనగుచుండిరి. సంస్కృతగ్రంథముల ననువదించువారు మూలమును చక్కగా అనుసరింపకయు

ఔచిత్యముం బాటింపకయు, పైగా గీర్వాణగ్రంథముల యాంగ్లానువాదముల నాధారముగాఁగొని అనువదించియు పలుపాట్లు పడుచుండిరి. అప్పటికి స్వతంత్రనాటకము లింకను వెలువడలేదు; వచనగ్రంథములు వ్రేళులపై లెక్కపెట్టఁదగినవిగా నుండినవి; కవనము ఇంకను ప్రాచీనమార్గమున పాడిన పాటయే పాడుటగా నుండినది. అట్టి యీకాలమున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారి యాగమనము ఆంధ్రవాఙ్మయమున నొక క్రొత్తయుగమును సూచించుచున్నది. గద్య పద్య నాటక విమర్శకాది విషయములలో వారుచూపిన మార్గములు పెక్కులు.

శ్రీ శాస్త్రులవారింగూర్చి నేటిరచయితలు పరిపరివిధముల వ్రాయుచున్నారు. శాస్త్రులవారు అసాధువాఙ్మయమును పూర్తిగా నిరసించినారు. అందులకు కసితీర్చుకొనుటగా వారిని కొందఱు నిరంతరము విమర్శించుచున్నారు. శాస్త్రులవారి గ్రంథములు విమర్శకు గుఱియైనట్లు ఆధునికులలో నెవరి గ్రంథములును కాలేదనుట అతిశయోక్తి కాదు. అదిపనిగా శ్రద్ధాళువులు వారి గ్రంథములం జదివి రసము గ్రహించి, తా మభివృద్ధినంది వారిని దైవమువలె కొనియాడువారును, అట్లే ఇతర కార్యములనుమానుకొని అదిపనిగా నిరంతరము వారిగ్రంథములను పరీక్షగావించి, ఏవైనను, అచ్చుపొరపాట్లుగాని, ఏమఱుపాట్లుగాని దొరకిన నిధి దొరకినట్లు సంతోషించుచు వారిని దూషించు వారును కనఁబడుచున్నారు. శాస్త్రులవారు ఆంధ్రవాణి కొనర్చిన సేవను గుఱించియు, వారుచూపిన నూతనమార్గ

ములంగూర్చియు, నేటి యాంధ్రవిద్యార్థిలోక మేమియు నెఱుంగదు. కొందఱకు పెద్దలకే, శాస్త్రులవారు గొప్పపండితులనుట తప్ప, వారేమి గ్రంథముల రచించినదియు తెలియదు. నేటి యాంధ్రవాఙ్మయమునందలి నూతన రచనావిధానముల కెన్నింటికో వారు మార్గదర్శకులై యుండ, తెలియని కొందఱు, ఇతరుల చూపిన మార్గములను వారనుకరించిరని సయితము వ్రాయసాగిరి. శాస్త్రులవారికి ప్రసన్నులుకాని కొందఱు నిరంతరము చేయు ప్రచారముచే, శాస్త్రులవారింగూర్చి దురభిప్రాయము లేర్పడుటకు సయితము అవకాశము కలుగుచున్నది. ఇట్టి సందర్భమున పలువురు శాస్త్రులవారి జీవిత విశేషముల నెఱుంగం దలంపుగొని యుండుటచే ఈ చిన్ని జీవితచరిత్రను కూర్చితిని. ఇయ్యది సమగ్రము కాదు. అట్టిది వ్రాయుట గొప్పపని, కాలము పట్టును; అందులకు చాలకృషియు అపేక్షితము. శాస్త్రులవారికి వారిమిత్రులును, సమకాలిక పండితవర్యులును రచించిన జాబులలోని విశేషవృత్తాంతముల నెల్ల ప్రకటింతునేని ఈ చరిత్ర బృహత్కథయంత పెరుగును, ముద్రించుటయు ఈ కాగితముల కాటకములో కష్టమగును. కావున నేను నిరంతము వారి శుశ్రూషలో వినుచుండిన విశేషములను, వారి ముద్రితాముద్రిత గ్రంథములయందే అటనట చెదరియున్న వారి వ్రాతలను "ఒక్కచోటనె యొడంగూర్ప నుత్సహించి" కేవలమొక జాపితాగా నీచరిత్రను వ్రాయుచున్నాఁడను.

---

## ౧-ప్రకరణము

## తండ్రిగారు.

నెల్లూరుజిల్లా కావలితాలూకాలో ననుకపల్లెకు సమీపమున సముద్రతీరమున మల్లయపాళెమను గ్రామము. వేదమువారు, పుదూరుద్రావిడబ్రాహ్మణులు, సోమపీథులు, సర్వాగ్రహారముగా:బడసి చిరకాలముగా ననుభవించుచుండిరి. వేదశాస్త్రములందు: బ్రఖ్యాతులగుటచే వీరికి వేదమువారని పౌరుషనామము. ఈ వంశమున వేంకటరాయ శాస్త్రులవారని, "వేదశాస్త్రములందు: బ్రఖ్యాతులు, అప్రతిగ్రాహకులుండిరి". వీరిసతి అనంతమ్మగారు. ఈదంపతులకు మువ్వురుకుమారులు జనించిరి–వేంకటేశ్వర శాస్త్రిగారు, వేంకటరమణశాస్త్రులవారు, విశ్వపతి శాస్త్రులవారు నని. మువ్వురును మంచి వైదుష్యము నార్జించిరి. వీరిలో వేంకటేశ్వరశాస్త్రిగారు అధ్వర్యులుగానుండి పెక్కుక్రతువులు జరిపించినవారు. యజ్ఞాదికములలో వారుచెప్పినదే ప్రమాణము. తండ్రిగారు, వేంకటరాయశాస్త్రిగారు, మధ్యప్రాయమునందే చనిపోయిరి. వారి పెద్దకుమారులు కుటుంబము నిర్వహింపసాగిరి, వేంకటరమణశాస్త్రులవారు పండ్రెండవయేటనే ౧౮౩౦ సం॥ ప్రాంతమున నిలువిడి కంచికి విద్యాభ్యాసార్థమై తరలిపోయిరి.

కంచిలో నివర్తి వేంకటరామశాస్త్రులవారు ఆకాలమున సుప్రసిద్ధపండితులు. నాటికి కంచి యింకను తనపూర్వవిద్యాగంధమును కోలుపోలేదు; విద్యావిషయములలో దక్షిణభారత

దేశమున ప్రధానస్థానము నందియుండెను. ఆంగ్లనాగరికత దేశమున నాటికి మొలకలెత్తలేదు; దేశ మింకను తన పూర్వనాగరికతా వైభవమును కోలుపోలేదు; మార్పు ప్రారంభము కాలేదు. ప్రాచీనకాలమున, ఎచ్చటెచ్చటి విద్యార్థులును, తక్షశిల, నలంద మొదలైన విశ్వవిద్యాలయములకు చేరునట్లు, నాడు విద్యార్థులు కంచికి చేరుచుండిరి. వేంకటరమణశాస్త్రులవారు నాటికి పండ్రెండేండ్లవారైయుండినను, గత్యంతరములేమిచే, కాలినడకను బయలుదేరి కొన్ని నెలలకు కంచికి పోయిచేరిరి.

వారు కంచి చేరునప్పటికి సాయంకాలమగుచుండెను. ఒకానొకచోట సంపన్నగృహస్థు నొకనిం గని, వేదములు వల్లించుచు వారి యింటికిం బోయి, నమస్కరించి వారిని నివర్తి వేంకటరామశాస్త్రిగారి యిల్లెచ్చటనున్నదని ప్రశ్నించిరి. ఆగృహస్థు వెంటనే ఆబాలుని చూచి, అతని సౌజన్యమునకును, వచఃశుద్ధికిని చాలసంతోషించి, శిష్టసాంప్రదాయమునకు చెందినవాండనియు, తన సహాధ్యాయికి మేనల్లుండనియు గ్రహించి "అబ్బాయీ, ఆ నివర్తిశాస్త్రులు నేనే, మీ మేనమామ గారున్నూ నేనున్నూ కూడా చదువుకొన్నాము. నీవు మా యింట్లో నేవుండి చదువుకో. నీకు అన్ని అనుకూలాలున్నూ నేను చేస్తాను." అని ఆదరించిరి.

వేంకటరమణశాస్త్రిగారు వెంటనే వారికి సాష్టాంగముగా నమస్కరించి తమవారు గురువుసంట భోజనము చేయకూడదని చెప్పిరనియు తాము మధుకరముచే భోజనముచేయుచు చదువు

కొనెదమనియు తమ దృఢసంకల్పమును తెలిపిరి. అంతట వారే వీరికి వారములు ఏర్పాటు చేయించి అన్నిశాస్త్రములును బోధించిరి.

వేంకటరమణశాస్త్రిగారు విద్యార్థులలో మేలుబంతి. ఉపాధ్యాయునకు చాల విధేయులు. తా ముద్యోగమునందు ప్రవేశించిన యనంతరము, చిరకాలమువఱకు, తమ జీవితము నుండి పదిరూప్యములు గురువునకు కానుకగా పంపుచుండిరి.

వేంకటరమణశాస్త్రిగారు ఎన్నడును తిరస్కారవాక్యమును సహించినవారుగారు. ఒకనాడు కంచిలో వారములు చేయుకొనుచుండుయింట వృద్ధయొకతె కోపముతో 'వారం బ్రాంహాలు వస్తారు. ఒకరైనా విస్తళ్లు తెచ్చుకోరు. వీళ్లకు విస్తళ్లు కుట్టి పెట్టలేకుండా చచ్చిపోతున్నాను' అని వేంకటరమణశాస్త్రిగారు వచ్చుచుండగా వారికి వినబడునట్లు పలికెను. ఆవాక్యము విని వెంటనే ఆయన ఆయింట ప్రవేశింపకయే ఎచటికో పోయెను. వేళకు భోజనమునకు రాలేదు. ఉపాధ్యాయుడును సహాధ్యాయులును ఊరంతయు వెదుకసాగిరి. ఆ వృద్ధ యేడ్చుచు భోజనమునూని వీధితిన్నెపై కూర్చుండెను. వెదుకగా వెదుకగా సాయంకాల మగుసరికి ఊరిబయట నొక మఱ్ఱిచెట్టుక్రింద ఆకులుకోసి కట్టలుకట్టి ఒకరు క్రింద పడవేయుచుండ నొక విద్యార్థి చూచి ఎవరో యని పరిశీలింప, వేంకటరమణశాస్త్రి! వెంటనే అందఱువిద్యార్థులును వచ్చిరి.ఉపాధ్యాయుడు ఆరోషమునకును పట్టుదలకును చాల ఆశ్చర్యపడెను. నాడు విద్యార్థు

లందఱును కూర్చుండి విస్తరాకులను కుట్టి ఆఱు నెలలకు వలసిన విస్తళ్లను ఆవృద్ధ యింట వైచిరి. ఆముసలామె నివ్వెఱబోయెను. అదిమొదలు వేంకటరమణశాస్త్రిగారిని అందరును చాలమర్యాదగా చూడసాగిరి. ఇట్టియుదంతములు ఎన్నేనియు గలవు.

వీరికి దయ్యములందుగాని శకునములు మొదలైనవాని యందుగాని ఎట్టినమ్మకమును లేదు. విద్యార్థిదశలో నేనొకప్పుడు వీరికిని వీరి తోడి విద్యార్థులకును దయ్యములవిషయమై వివాద మేర్పడినది. వీరు అట్టిపిచ్చినమ్మకమునకు తావీయలేదు. అంతట విద్యార్థులందఱును పందెములు వేసికొని ఒక అమావాస్యనాడు రాత్రి శ్మశానమునకు బయలుదేఱిరి. ఒక్కొకరును చేత తమ పేరువ్రాసిన తాటియాకు, ఒకచీల, ఆతాటియాకును శ్మశానము చెంత నొకచెట్టునకు కొట్టుటకు రాయి, వీనితో తరలిరి. అర్ధరాత్రి వేళ. అందఱును కలసిపోయి ప్రయాణమైరి గాని నాలు గడుగు లిడినవెనుక ఒకరొకరు వెనుకకు పోసాగిరి. తుదకు వేంకటరమణశాస్త్రిగారు మిగిలిరి. ధైర్యముగాపోయి వల్లకాటి చెట్టున ఆతాటియాకును చీలతో కొట్టి, ఇటునటు చూడక, వెనుకకు తిరుగఁగానే, ఎవఁడో వెనుకనుండి వీరి పైపంచెను లాగుకొనెను. ఇంకను బాల్యమేగావున ఎవఁడో బేతాళుఁడని తలంచి పైపంచె వదలివేసి త్వరగా నిల్లుచేరిరి. విద్యార్థులకు ఈవృత్తాంతమును చెప్పి 'వాస్తవముగా దయ్యమేమై యుండునా?' అని యనుమానించుచు ప్రొద్దున విద్యార్థులతో పోయి చూడఁగా, ఆ పైపంచెనులాగినది దయ్యమునుగాదు పిశాచమునుగాదు,

వారు తమ పైపంచెమీదనే ఆ తాటియాకునుంచి చీలకొట్టి యుండిరి. అదిమొదలు దయ్యములన్న నమ్మకము పూర్తిగానే వదలివేసిరి.

వేంకటరమణశాస్త్రిగారు విద్యాభ్యాసానంతరము తొలుత మదరాసులో సంస్కృతాంధ్ర ద్రావిడ పాఠశాలలో (నేటి ముత్యాలపేట హైస్కూలు యొక్క ప్రారంభరూపము) ప్రధాన పండితులుగాను, కాకినాడ స్కూలు సంస్కృతపండితులుగాను, నరసాపురం నార్మలు స్కూలు ప్రధానోపాధ్యాయులుగాను, పోడూరు స్కూలు హెడ్మాస్టరుగాను, పిమ్మట విశాఖపట్టణము నార్మలు స్కూలు పండితులుగాను, అనంతరము రాజమండ్రి కాలేజీ సంస్కృత ప్రధానపండితులుగా నుండి రు 25 లు. విరామ వేతనముం బొందిరి.

వేంకటరాయశాస్త్రులవారే తమతండ్రిగారింగూర్చి ఇట్లు వ్రాసియున్నారు.

* "నాయనగారు తాతగారివలెనే విద్వాంసులు, అప్రతిగ్రాహకులు, మహాకుటుంబి, నిజముపేదలు, వైయాకరణ పతంజలి యనియు, వేదవ్యాసులనియు ప్రఖ్యాతులు, మహారసజ్ఞులు, అద్భుత సాహిత్య †మండితులు, సౌజన్యపరమావధి, శిష్టులు, సత్యసంధులు, కరుణాపరాయణులు, యథాశక్తి త్యాగి, వారి సౌజన్యవిశేషములను ఎంత చెప్పినను తనివితీరదు.

---

* శ్రీ శాస్త్రులవారే తమ జీవితచరిత్రను, నాయొక్కయు ఇంకను తమశిష్యులయు ప్రోద్బలమున వ్రాయదలంచి కొన్నిపుటలు చిత్తువ్రాసి ఓపికచాలమిచే త్యజించిరి. అందలిభాగములను ఇందుదాహరించుచున్నాను.

† సాహిత్యముచే నలంకరింపఁబడినవారు.



Sri Lakshmamma, Sri Venkataramana Sastry Garu

"నాయనగారు శిష్టు కృష్ణమూర్తిగారికి గుంటూరు కాకినాడలలో పరిచితులు-కృష్ణమూర్తిగారికి చిన్నయసూరిగారితో కాళహస్తి, వేంకటగిరి సంస్థానములలో ఘర్షణ-కృష్ణమూర్తిగారు బాలవ్యాకరణమును హరికారికలనుపేర సంస్కృతమున అనువదించుట-వారి యసత్యవాదము- అట్లు చేయఁగూడదని మా నాయనగారు కృష్ణమూర్తిగారిని హెచ్చరించుట.

"పట్టసము పుష్కరాలలో అమ్మవారిసన్నిధిలో కొండమీఁద గుడిలో తపస్సు-ఆఱుమాసములు- అనంతభట్ల సుబ్రహ్మణ్య మనుపేరి శిష్యుఁడు, జువ్వలదిన్నెవాఁడు, తెచ్చియిచ్చు దోసెడు రేఁగుఁబండ్లు ఆహారము- వేఱు అన్నము లేదు- వారి శిష్యులు కాకినాడ పాఠశాలలో వారి యుద్యోగమును నిర్వహించి జీతము తెచ్చి మాయింట ఇచ్చుచుండిరి."

వేంకటరమణశాస్త్రులవారు గొప్ప వేదాంతులు, ఋషితుల్యులు-ఒకానొక పాఠశాలలో వారు పండితులుగా నుండు కాలమున ప్రిన్సిపాలుగా నుండిన దొర యొకఁడు విరామము బొందఁగా క్రొత్తఁగా నొకఁడు వచ్చెను. ఆసందర్భమున నందఱును ఆ క్రొత్త ప్రిన్సిపాలు దర్శనము చేసికొనిరిగాని వేంకటరమణశాస్త్రిగారు మాత్రము ఆతనిదర్శనము చేసికొనలేదు. ఒకనెల గడచినయనంతరము ఆదొరయే వారిని పిలిపించి 'నీవేల మాదర్శనమునకురాలే'దని వారిని అడిగించెను.అంతట శాస్త్రులవారు 'నాధర్మమును నేను ఆచరించుచున్నాను. తమదర్శనము చేయకూడదని లేదు. చేయవలెనని తోఁచలేదు.' అని బదులు

చెప్పిరి. 'మిమ్ము ఉద్యోగమునుండి నేను తొలగించిన నేమి చేసెదరు?' అని యాతఁడు మరల నడిగెను. వెంటనే శాస్త్రుల వారు తడువుకొనక 'జిహోవా' యని బదులుచెప్పిరి. దొరకు ఆశ్చర్యమును సంతోషమును కలిగినవి. వారు గొప్ప వేదాంతు లని గ్రహించి అదిమొదలు వారిని గౌరవించుచుండెను. వేంకటరమణశాస్త్రులవారు బైబిలు చర్చలను విశేషముగా వినుచుండు వారు. అందుచే 'జిహోవా' వారికి చిరపరిచితుఁడు.

వీరికి నలుగురు కుమార్తెలును నలుగురు కొమరులును జనించిరి. ప్రథమసంతానము కొమార్తె. ద్వితీయసంతానమే శ్రీవేంకటరాయశాస్త్రిగారు. తృతీయులు వేంకటసుబ్బయ్య గారు. వీరింగూర్చి కథావశమున హెచ్చువ్రాయుదును. ఆటువ వారు ఎనిమిదిభాషలలో చక్కని వైదుష్యము సంపాదించి చరిత్ర పరిశోధకులుగాను న్యాయవాదులుగాను ప్రసిద్ధిగాంచిన శ్రీ వేంకటాచలముగారు. తర్వాతివారు శ్రీ సూర్య నారాయణశాస్త్రులవారు. నెల్లూరు వేంకటగిరిరాజ పాఠశాలా ధ్యాపకులుగా నలువది సంవత్సరములకన్న హెచ్చుగా పనిచేసి ప్రస్తుతము నెల్లూర విరామముగా నున్నారు.

ఈవిధముగా పుత్రులను పౌత్రులనుం గాంచి, ౮౩ సంవత్సరములు జీవించి ౧౯౦౦ సం॥ మున 'అనాయాసేనమరణమ్, వినాదైన్యేనజీవనమ్' అని పెద్దలు వాంఛించునట్లుగా ధన్యజీవి, తముం గడపి, కుమారులపాండిత్య పరమోచ్ఛ్రితిం గాంచి, హర్షించి పండుముసలితనమున నొకదినము సాయంకాలము,

ఇంట సందఱకును భోజనము లయిన వెనుక నిముసములో తనువు చాలించిరి. తమజీవితమంతయు నాధ్యాత్మిక చింతయందే గడపిరి. నిరాడంబరులు, నెమ్మదిగాను చిన్నగొంతుకతో మాటలాడువారు. ఆమాటలలో చమత్కారమును హాస్యమును గర్భితములై యుండెడివి. కుమారుల కలవడిన హాస్యధోరణియంతయు వీరిదే. తెనుఁగు ప్రబంధములలో నాముక్తమాల్యద వీరికి అభిమాన గ్రంథము. అందును 'ఆనిస్తానిధి గేహసీమ'యను పద్యమును నిరంతరము వర్ణించుచు అట్లె తాముసు నిరంతరము అతిథిసపర్య చేయుచుండవలయునని వాంఛించువారు. ఎట్టి చిరకాల బద్ధశత్రువులనైనను మిత్రులనుగా నొనర్చువారని మా తాతగారే నాకు చెప్పియున్నారు. వారిసౌజన్య మట్టిది అనవసరపు వాదములలో పాల్గొనలేదు. వీరు రచించిన గ్రంథములు రెండే—ఆత్మబోధ వివరణము, లఘువ్యాకరణము. విశేష గ్రంథరచనకు పూనుకొనలేదు. కాని ఆకొఱంతను వారి పెద్ద కుమారులు తీర్చిరి.

---

*

## ౨-ప్రకరణము

## వేంకటరాయ శాస్త్రులవారి బాల్యము.

శ్రీ వేంకటరాయశాస్త్రిగారు ౧౮౬3 సం॥ డిసంబరు ౨౧ తారీఖున (ప్రమాదీచసంవత్సర మార్గశీర్ష బ ౬లు బుధ వారము) మదరాసులో జనించిరి. అప్పుడు వీరితండ్రిగారు మద రాసులో సంస్కృతాంధ్ర ద్రావిడ పాఠశాలలో ప్రధానపండి తులు. తర్వాత రెండేండ్లకే వేంకటరమణశాస్త్రులవారికి కాకి నాడలో నుద్యోగ మైనది. వేంకటరాయశాస్త్రులవారి బాల్య మంతయు తండ్రిగారితోకూడ నాంధ్రదేశమున పలుతావుల గడచినది. బాల్యమునుండియు కంటఁబడిన వస్తువును కనులారఁ జూచి చెవులఁ బడినవాసిని చెవులారవిని ఆనందించి ఉత్తరకాల మున గ్రంథస్థములం జేసినారు. ఆ సునిసితబుద్ధికి అన్నియు జ్ఞాప కములే. రసాత్మకవాక్య మేది ఆయన చెవింబడినను మఱి యా హృదయమును వీడదు. ఆంధ్రదేశమును వర్ణింపను ఆంధ్రప్రతి భను లోకమున ప్రకటింపను వారికి బాల్యమందే ఆశజనించి నది; ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధ నాటకములందు రూపుఁ దాల్చినది.

ప్రతాపరుద్రీయనాటకరచనాబీజము వారి హృదయ మున వారి యెనిమిదవయేటనే పడినది. ప్రతాపరుద్రీయనాటక ప్రథమముద్రణావతారికలో నిట్లు వ్రాసినారు. "ఓరుగంటి ప్రతాపరుద్ర మహారాజును తురకలు ఢిల్లీకి ఖయిదుకొని

పోయిన కథ లిఖితముగాని ముద్రితముగాని నాకెచటను దొరకలేదు. నే నెనిమిదేండ్ల వయసున నుండఁగా మానాయనగారు వేదము వేంకటరమణశాస్త్రులవారు తమమిత్ర బృందములో నీకథను ప్రస్తుతించునపుడు నేనును వింటిని. వారుచెప్పుటలో నీకథ అరగంటకూడ పట్టలేదు. ఇటీవల నేను ఆంధ్రజనవినోదినీ ముద్రణాధికృతుఁడనై యుండఁగా 188౮ సం॥మున ఈ కథను నాకుఁదోఁచినట్లు విరివిచేసి యల్లి కథారూపమునఁ బ్రచురించి యుంటిని. పిమ్మట 1896 సం॥ జూలై నెలలో దానిని నాటకోచితముగా మార్పుచేసి, ఈ నాటకమునందలి గద్యభాగమును మాత్రము వ్రాసి నామిత్రులకుఁ జూపితిని......"

వేంకటరమణశాస్త్రులవారికి వేదాంతులు పలువురు శిష్యులు నిరంతరము వారితో గోష్ఠి సలుపుచుండువారు. ఒకరు ముసల్మాను, రెండవవారు చాకలి, మూఁడవవారు క్రిశ్చియను, నాలవవారు బ్రాహ్మణులు. సాహెబుగారు తమ మతగ్రంథముల లోని వేదాంతవిషయములను చెప్పుచు "ఆ అరాబియా దేశం లో వఖ్ ఫఖీర్" అను నీతీరున మాటలాడుచుండువారు. ఆ యెనిమిదేండ్ల వయసున సాయెబుగారిమాటలు వేంకటరాయ శాస్త్రులవారికి వింతగా కనఁబడినవి; హృదయమున నెలకొన్నవి. ఇట్టి సాయెబుల నెందఱినో కని ప్రతాపరుద్రీయ మందలి ఆ మహమ్మదీయ పాత్ర భాషితములను వ్రాసితి మని వారే చెప్పి యున్నారు.

శాస్త్రులవారికి ఆంధ్రాభిమానము హెచ్చు. పుదూరు ద్రావిడులయింటఁ బుట్టినారు; నియోగుల (తెలుఁగువారి)యింట

పెరిగినారు. వారే యిట్లు వ్రాసియున్నారు. "మదీయనరసాపూరు చరిత్రము—ఉపనయనమునకు మునుపటిది. ఉపనయనము గర్భాష్టమమున. మల్లయ్యపాళెములో. పులిపాక లచ్చన్నబాబు గారు, శేషమ్మపిన్నిగారు, చంద్రమ్మత్తయ్య, రవణప్పత్తయ్య— వారికి గోసమృద్ధి, పేరిన హయ్యంగవీనము, చక్రకేళి యరఁటి యాకు. వంట శుచి 12 సం.ల యనంతరము కూడ యథాపూర్వముగానే యుండుట. నెమళ్ల గొప్పయారామము. మానాయనగారు కాపురమున్న యింటివారును పులిపాకవారే. కోడలో కూఁతురో అన్నపూర్ణమ్మ. అత్తగారు రవణమ్మ. ఆమెకు కుడిచేతి బొటనవ్రేలికి రెండుగోళ్లు. ఇరువురును వితంతువులే. ఇంటియద్దె రు ౧. వారు రాత్రి చేసికొను ఉప్పుపిండిగాని రొట్టెగాని నా తమ్ములకు తప్పదు. ఈచెప్పిన మూఁడు కుటుంబములును అభేద ప్రతిపత్తితో అత్యంతమైత్రితో నుండినవి. వారి యాయింటికి పిశాచప్రథ. ఆ పిశాచములు మేము పోడూరికి పోయినతర్వాత ఆయింట నివసించిన వారిని పీకుకొని తినుట—వేంకటరమణ శాస్త్రులవారు మావారు. అందుచే వారిని ఏమియు చేయమైతిమి అని పిశాచములు వాదించుట.

"అన్నపూర్ణమ్మగారి యింట వేన్నీళ్లపొయ్యిలో టపాసులు కాల్చినందుకు నాయనగారు *కొఱకచ్చు చేతఁగొని నన్ను జూడుటకు తఱుముకొనివచ్చుట—నేను నేలబావిని దాఁటి అందులో పాతము తప్పించుకొని తహశ్శీలుదారుగారి కచ్చేరికి

* సగము కాలిన కొఱవి.

పోయి నాయనకు రు 5 జీతము తగ్గింపుఁడని కోరుట-కొలకంచు అనఁగా వారికి అర్థము తెలియక కొంతచర్చయు పరిహాసమును జరుగుట.

"బైలారుదొరగారు, రోజాపుష్పములు—గోచిలేని చిన్న దట్టి-దొరవారి యాక్షేపము-అవధూతాశ్రమము అని నేను వచింపఁగా దొ"రవారు సమాధాన పడినట్లు నటించుట- ఒక నాఁడు రాత్రి నాయనగారు నన్ను వీథిలోనికిత్రోసి తలుపు వైచుట-అంతట చింతాతయ్యగారి యింటికి పోవుట.

"మాపొరుగు ఎడమవైపున గోటేటివారు-వారి యింట దొండపాదులు మెండు-సదా ఆదొండపిందెలను కాయలను నేను భక్షించుచుండుట-మాయింటికి కుడివైపు పొరుగు రేవు వారు- రేవు సీతమ్మగారు మా నాయనగారికి రు 120 అప్పిచ్చుట—ఆపైకమిచ్చి నాయనగారి యుత్తమర్ణు నొక యుపాదాన బ్రాహ్మణుని, వడ్డిగొనుటయేగాక నిత్యాతిథినిఁ తొలఁగించుట- పులిపాకవారు మాకు సదా వైద్యము చేయించుచుండుట.

"పోడూరు—సోంభట్ల వెంకటజోగయ్యగారు మా నాయనగారియొద్ద నైషధము చదువుచుండిరి- రాజులు కొందఱు వసుచరిత్ర చదువుచుండిరి. వెంకటసుబ్బయ్యకు గడ్డి మేటి నుండి వెంటిపట్టుకొని దిగుచుండఁగా జాఱిపడినందున చేయి విఱిగినది. దానిని ఒడ్డూరనుగ్రామములో రాజులు కట్టి కుదిర్చినారు. అక్కడ ప్రతి తరగతిలోను నేనే మొదటివాఁడను. పై

తరగతిలో నన్ను వేయఁగానే క్షణములో నేనే మొదటివాఁడ నగుదును. మఱి నాతొందరపాటు తప్పింప నొరులతరముగాదు. నాకు ఒకమాఱుచెప్పిన చాలును, ఒకమాఱు చదివిన వచ్చును. నాకు సులువుగ రానిది గణితము, కుదురనిది చేతివ్రాత. నేను దెబ్బ లెఱుగను. అబద్ధము చెప్పను. సాలాఖరుపరీక్షలో నాకు పుస్తక బహుమానము, For General Proficiency అని వ్రాసి యిచ్చినారు.

"ఉపనయనానంతరము—తాతగారు సంధ్యావందనము చెప్పుట-నేను నోటచెప్పుచు చేతులతో సంధ్యోదకమును కాలువలు పాఱించుట...రేవువారి యింట నొకపంతులు సర్కారుద్యోగస్థుఁడు-పేరు కస్తూరివారు-తద్భార్య శేషమ్మ-ఆమె సంస్కృతమున విదుషి-ప్రతిదినము రాత్రి మానాయనగారి భోజనసమయమున వచ్చి వారితో సంభాషించుచుండును. తద్భర్త ఆమెను మానాయనగారితో నిట్లు విద్యావ్యాసంగము సేయుటకు ఆక్షేపింపక పైగా సంతోషించుట"

శాస్త్రిగారు రాజమండ్రిలో నుండఁగా మితిమీరి బోటు షికారులు పోవువారు. ఒక్కొకప్పుడు రాత్రులు సయితము ఇంటికి రాక యే తిరుగువారఁట. వీరికి వీరితమ్ములు వేంకటసుబ్బయ్య గారు నిరంతరము తోడు. వారికిని శాస్త్రులవారికిని వయసున ఎక్కుడుభేదము లేదు. ఒకమారు వీరిరువురును కొందఱు స్నేహితులతో గోదావరిలో ఈఁత పందెములు వేసికొని ఆవలిగట్టునకు ఈఁదసాగిరి. కొంతదూరము మీఁదు నప్పటికి

ఆస్నేహితులు ఒకరొకరుగా వెనుకకు జారుకొనిరి. తుదకు శాస్త్రులవారును వారి సోదరులును మిగిలిరి. వీరికి అభిమానము ఎక్కువ. వెనుకకు పోయిన పరువులోప మని యీదుచునే యుండిరి. లోతు, కాలికి నేల యందదు. ఇందులో శాస్త్రుల వారికి ఈత సరిగా రాదు. వారితమ్ములకు చక్కఁగా వచ్చును. వారు వీరిని పట్టుకొని ఈదుచుండిరి. శాస్త్రులవారి దోవతి వీడి పోయి కాలికి చుట్టుకొన్నది. ఇఁక ఆ యీఁతయు అసాధ్యమే. అంత వారు ఈఁదలేక తమ్మునితో "ఒరేయి, నన్ను వదలి వేయి, నేను చచ్చిపోతాను, నాకు ఈదినం గండం, నువ్వెం దుకు నాకోసం చచ్చిపోతావు?" అనిరి "ఆ! మిమ్మల్ని వదలి పెడతానా?" అని వెంకటసుబ్బయ్యగారు మెల్లగా కాలికి నేలతగులువఱకు ప్రయాసతో కొనిపోయిరి. అక్కడ సరిగా కంటివఱకు నీరు ప్రవాహము వేగముగా లాగుచుండెను. అలసిపోయినారు. వాస్తవముగా శాస్త్రులవారు నాఁడు తాము చనిపోవుచున్నామనియే తలంచినారు. ఇంతలో దూరమున పడవ యొకటి కనఁబడినది. 'పడవోయి పడవ, ఓయిపడవ' అని ఇరువురును అఱచినారు. రెండు పర్యాయములు వీరిమా టలు వారికివినఁబడలేదు తర్వాత విని, వీరు గుడ్డను పిండి విస రఁగా చూచి పడవవాండ్రు వచ్చినారు; 'ఏంబ్రాహ్మలయ్యా, ఏం పనయ్యా గోదారిలో' అని కసరుచు ఎక్కించుకొని గట్టుచేర్చిరి.

ఇంతలో నెవరో వారి తండ్రిగారికడకు పోయి వారితో "శాస్త్రులవారూ, మీకొమాళ్లు ఈతపందాలు వేసుకుని

గోదావరిలో ఈత్తున్నారండి, నడివరదలో ఉన్నారు. కూడా వెళ్లినవాళ్లంతా వెనక్కు వచ్చేశారండి. మీావాళ్లు మాత్రం అమాంతంగా చచ్చిపోతున్నారు.'' అని చెప్పిరి. 'ఊం.' అని గంభీరముగాను కోపముగాను చూచిరేగాని తండ్రిగారు మరే మియు బదులు చెప్పలేదు. మఱికొంతసేపటికి ఆ మనుష్యులే వచ్చి 'ఎవరోచూచి బోటులో ఎక్కించుకొన్నారండి వస్తున్నా రండి.' అని చెప్పిరఁట. 'వస్తున్నారూ, సరే.' అని బదులుచెప్పి నారు తండ్రిగారు. కొమారులు ఇంటికివచ్చిన యనంతరము వారిని ఈవిషయమైనను వారడుగలేదు. కొమాఃళ్లును భయ పడి తండ్రిగారి యెదుటికి పోలేదు.

ప్రతాపరుద్రీయము రచించునెడ విద్యానాథ పాత్రను నిర్మించుచు ఇదంతయు జ్ఞప్తికిందెచ్చుకొని విద్యానాథునికి చేర్చి సంవిధానమల్లినారు. గోదావరిపై వారికి మక్కువయుట్టెది.

ఒకపాటి మాటవిసరు శాస్త్రులవారికి బాల్యమునుండియు కలదు. అల్లాడి సదాశివశాస్త్రులవారు, తర్వాత శాస్త్రులవారికి శ్వశురులు, బాల్యములోనే యిల్లువదలి ఓడనెక్కి కటకము బరంపురము మొదలయిన ప్రదేశములకు పోయి వ్యాపారము చేసి విశేషధనమార్జించి, వేంకటరమణశాస్త్రులవారు విశాఖ పట్టణములో నుండఁగా, ఇంటికి నెల్లూరిసీమకు మఱలు చుండిరి. వేంకటరమణశాస్త్రులవారిని చూచుటకు మార్గమడుగుచు ఒక వీథిచివరను వేంకటరాయశాస్త్రులవారిని చూచి పోలికచేత ఊహించి ''బాబూ, నువ్వెవరి అబ్బాయివి?'' అని ప్రశ్నించిరి.

అప్పుడు వీరికి ఎనిమిదేండ్లుండును. "ఎవడో ఒక వెఱిముండా కొడుకు. ఎవడైతే నీకేమి?" అని బదులు చెప్పిరి. ఇంచుకయైనను సదాశివశాస్త్రిలవారి పటాటోపమునకును పరివారమునకును జంకలేదు. ఇదికూడ వేదమువారికి తగినట్లేయున్నదని తలంచి ఆవెనుక వేంకటరమణశాస్త్రులవారిని దర్శించి 'ఆ వెఱిముండా కొడుకు' వారి కొమారుఁడేయని వారు తెలిసికొనిరఁట.

ప్రతాపరుద్రీయములో వెఱ్ఱివాఁడు, 'నేనుకండచీమను, ఏమనుకున్నావో? పట్టుకుంటే వదలను' అని శిష్యులను బెదరించును. విశాఖపట్టణములో వీరు నివసించిన యింటి పొరుగింటి యాతఁడు, ముసలివాఁడు, తన పడుచు భార్యను ఈవాక్యము నే పలికి నిరంతరము బెదరించుచుండువాఁడట, జ్ఞాపకముంచుకొని తమాషాగానుండినందున వెఱ్ఱివానికి తగిలించినారు.

బొబ్బిలియుద్ధనాటకములో ఐదవయంకమున సిఫాయీలు తిరుగబాటు చేయుచున్నారనియు, సారాయిలేనిది వారు యుద్ధముచేయరనియు ఒకసిఫాయి బుస్సీకి నివేదించును.

"బుస్సీ-అవును మామాటగా బొడ్డికెతో వారికి సారాయి మామూలు కొలఁత ప్రకారము ఇమ్మని చెప్పుము."

అని చెప్పును. ఈ 'బొడ్డికె' అనుపేరు విశాఖపట్టణములో నొక సారాయి దుకాణదారుని కుండెను. వినిన క్రొత్తలో చాల వేడుకగా నుండినందున సమయము దొరకినప్పుడు ప్రయోగించినారు.

విశాఖపట్టణములో ఘనపండావారని సుప్రసిద్ధబ్రాహ్మణ కుటుంబమువారు ఓడ వ్యాపారు లుండిరి. కాలక్రమమున వారి యైశ్వర్యమంతయు నశింపఁగా నా పరంపరకుం జెందిన కడపటి బ్రాహ్మణుఁడు కాశీయాత్ర పోయెనని ఆ దినములలో ఆయనఁగూర్చి కథలుగా చెప్పుకొనువారఁట. ప్రతాపరుద్రీయములో చతుర్థాంకమున విద్యానాథుని యుగంధరుఁడు 'నీ ప్రథమోపాధ్యాయులు ఘనపండా దిగ్విజయ జ్యోతిషికులు క్షేమమా?' అని యడుగును. వాస్తవముగా ప్రతాపరుద్రుని కాలమున నట్టివాఁడు లేఁడు; ఆతఁడు విద్యానాథునికి గురువు నుంగాఁడు. శాస్త్రులవారు తమ సమకాలికుల నామధేయమును చమత్కారముగా నిచట ప్రయోగించినారు.

ఆనాటకమందే అష్టమాంకమున సుల్తానుముందు వర్తకు లాడించిన నాటకమున సిపాయి పాత్రములు 'మనము గులాం దస్త ఖైర్షునిషీ చేత కట్టించుకొన్న పాటకానిత్తాముర?' అని పాడుదురు. ఈమునిషి శాస్త్రులవారికి సమకాలికుఁడు.

శాస్త్రులవారు జంగముపాటలు వినుటకు చెవికోసికొనెడి వారు. వానిపై వారికి ప్రీతిమెండు. బాల్యములో జంగము పాటలు, ముష్టివారిపాటలు, పడవవాండ్ర పాటలు ఒడలు తెలియని యావేశముతో విని కంఠస్థములం జేసినారు; తమనాటకములలో రసాత్మకమైన యీగ్రామ్యోక్తులకు ఎక్కువ తావొసంగినారు. శ్రీ శాస్త్రులవారి యుపన్యాసములయందును, నాటకములయందును మెండుగా హాస్యరసము స్ఫురించుచుండు ననువిష

యము ఎల్లవారును ఎఱింగినదే. ఇందులకు మొదటికారణము శాస్త్రులవారే. వారి మాటల ధోరణియట్టిది. గొప్పవ్యాకరణ విషయములను గుఱించి యుపన్యసించునపుడు సయితము శ్రోతలు కడుపులు చెక్కలగునట్లు నవ్వవలసినదే. మాటవడియు తడవుకొనక జవాబు చెప్పుటయు శాస్త్రులవారికి సహజములు. శాస్త్రులవారి నాటకములు లోకస్వభావానుకరణములు. లోకవృత్తానుకరణమున వారిది మొదటిచేయి. మాటలును చేష్టలును ఇతరు లవి అట్లె అభినయించి చూపగలిగినది వారి శక్తి. శాస్త్రులవారి నాటకములు అంతటి ప్రసిద్ధిని చెందుటకు ముఖ్యకారణము వారిపాత్రోచితభాష. సాయెబులు, చాకళ్లు, మంగళ్లు, పామరులు, విద్యావంతులు, బాలురు, స్త్రీలు, అరవలు మొదలైనవారి గ్రామ్యభేదములను మెలఁకువతో కనిపట్టి తమనాటకములో ప్రయోగించియున్నారు. ఈగ్రామ్యభేదముల నన్నిటిని తమ బాల్యమునుండియే కనిపట్టుచు వచ్చినారు. ఇదియే ప్రతిభ.



3–ప్రకరణము

## విద్యాభ్యాసము

ప్రతిభావంతులకు విద్య బంగారమునకు మెఱుఁగువంటిది. శాస్త్రులవారి విద్యయంతయు స్వయంకృషియే; తండ్రిగారికడ చదివినది చాలతక్కువ అందుల కుదాహరణముగా నీయుదంతమును వారు చెప్పగా వింటిని. వేంకటరమణశాస్త్రుల వారు, వీరిని వేంకటసుబ్బయ్యగారిని పిలిచి సంస్కృతము చెప్పఁ దలంచి హితోపదేశమును పాఠముచెప్ప నారంభించిరి. ఆటల పైనను వీథులు తిరిగి వేడుకలు చూచుటయందేగాని ఇంకను చదువులమీఁదికి శాస్త్రులవారిదృష్టి పోలేదు. తండ్రిగారు

శ్లో. అసాధనా విత్తహీనా బుద్ధిమన్తస్సుహృత్తమాః
సాధయన్త్యాశు కార్యాణి కాకకూర్మమృగాఖువత్.

అను శ్లోకమునకు చమత్కారముగా నీక్రిందివిధమున నర్థము చెప్పనారంభించిరి.*

"అసాధనా=సాధనములు లేనివారున్నూ, మీవలెనే, మీకు సాధనాలులేవు; విత్తహీనాః = డబ్బులేనివారున్నూ, అదిన్నీ మీవలెనే, మీకుడబ్బెక్కడిది, వట్టిదరిద్రులు; బుద్ధిమన్తః= బుద్ధిమంతులున్ను—(ఇదిబహుశః తమవలెనేమోయనితలంచి కొమాళ్లు కొంచెము మనసు తృప్తిచేసికొనిరి) ఇది మీవలె అనుకున్నారా ఎంతమాత్రంకాదు, మీకు తెలివెక్కడిది; సుహృత్తమాః=మంచిస్నేహితులున్నూ, ఇదిన్నీ మీవలెకాదు, మీకు స్నేహం బొత్తిగాలేదు, నిరంతరం కొట్టుకోవడమే మీపని" అని యీతీరున కొమారులకిరువురకును పాఠముచెప్ప నారం

---

* ఈ వృత్తాంతమును సరిగాగ్రహింపక కొందఱు తారుమారుగా వ్రాసియున్నారు.

చిరి. 'ఒరేయి, మనకక్కరలేదు ఈచదువు'. అని కలియబలికి కొని శాస్త్రులవారును వారి సోదరులును మఱి తండ్రిగారికి కనఁబడక తిరిగి ఆ 'చదువు'ను తప్పించుకొనిరఁట. అప్పుడు శాస్త్రులవారికి దాదాపు పండ్రెండు సంవత్సరము లుండును. ఇదియే వీరు తండ్రిగారికడ కూర్చుండి చదివినదంతయు; తర్వాతి పాండిత్యమంతయు స్వయంకృషియే.

పెద్దవారైన వెనుక తండ్రిగారు వినునట్లు బిగ్గరగా చదువుకొనుచు అర్థము చెప్పుకొనుచుండుటయు, ఎచ్చటనైనను వీరు తప్పిపోయిన తండ్రిగారు 'ఆ', అనుటయు, వెంటనే వీరు దిద్దుకొనుటయు జరుగుచుండెడిది. ఎప్పుడైనను సందేహము లుండిన నడుగువారేగాని అక్షరమక్షరమును తండ్రిగారికడ నేర్చుకొనలేదు.

విశాఖపట్టణపు నార్మలు స్కూలులో ఉ రులు, స్టయిపెండు పై (విద్యార్థివేతనము) చదివి అట మెట్రిక్యులేషను (౧౮౬౯ సం) మొదటి తరగతియందు తీర్ణులైరి. శాస్త్రులవారు మెట్రిక్యులేషను పరీక్షకుపోవుటకు పైకము కట్టవలసివచ్చినది. తండ్రిగారు పైకము చెంతలేక ఒకానొక పెద్దమనుష్యుని చేబదులడిగిరి. అతనికి శాస్త్రులవారసిన కిట్టదు. ''అయ్యా! ఎందుకండీ, మంచిడబ్బు పాడుచేసుకుంటారు? మీఅబ్బాయికి ప్యాసుకాదు, వృథా.'' అనెను. అంతట వేంకటరమణశాస్త్రులవారు కొమారునితో ''ఒరే, నాయనా, నీకు ప్యాసుకాదంటాడురా ఆయన ఎం

దుకుదండుగ, మంచి డబ్బు పాడుచేసుకొంటారు,' అని అడుగు తున్నాడు'' అని చెప్పిరి. ''నాకు ప్యాసుకాకపోతే మరెవడికి అవుతుందో చెప్పమనండి చూతాం!''అని వేంకటరాయశాస్త్రి గారు కోపముతో పలికిరి. ''మీఅబ్బాయికి ప్యాసయితే నాచెవి కదపా యిస్తాను.'' అని ఆపంతులు పందెము వేసెను. సరియని పైకము కట్టినారు, శాస్త్రులవారికి చక్కఁగానే ప్యాసయినది. పైగా మొదటితరగతి. అప్పుడువారు మదరాసులో చదువుటకు వచ్చియుండిరి. తండ్రిగారికి పైకము పంపి ఆతనికి బదులిచ్చి వేయుమనియు పందెము ప్రకారము ఆతని చెవి 'కదపా' తీయించి పార్సెలుద్వారా తమకు పంపవలసినదనియు వ్రాసిరి. కాని ఆ పంతులు పంపలేదు. 'కదపా' శబ్దమును అప్పుడు తాము గ్రహించినట్లు ఈకథను వారు చెప్పఁగా వింటిని.

''అనంతరము పది పదునొకండు రూప్యముల స్టయిపెండుతో మదరాసు నార్మలుస్కూలులో చదువుచు ట్రైనింగు పొందుట-అచట *బహుజనపల్లి సీతారామాచార్యులవారు ప్రథమాంధ్రపండితులు, చదలువాడ సీతారామశాస్త్రులవారు ద్వితీయాంధ్రపండితులు-ఇరువురుం బ్రామాణికులు, ఆంధ్రమున గొప్పపండితులు. వేలు పిళ్ళలోనగు యూప్పాణపుఁ గ్రిస్టియనులు సంగీతలోలురు, ఈ సీతారామాచార్యులతో చెలిమి చేసికొని వీరి ప్రతిశనివార వేశ్యాదిసంగీతగోష్ఠులకు చందాదారులై వచ్చుచుందురు.

---

*నిర్యాణము 1891 సం. మార్చి, తే 20 ది శుక్రవారము సాయం.

"ముత్యాలపేటలో తొలుత సంస్కృతాంధ్రద్రవిడ పాఠశాలయుండెను. దానికి మానాయనగారు వేదము వేంకట రమణశాస్త్రులవారు ప్రధానపండితులుగా నుండిరి. సీతారామా చార్యులవారు ఆంధ్రపండితులు, తోటపల్లి సీతారామయ్య గారు ద్వితీయాంధ్రపండితులు. అరవమునకు జ్ఞానసుందర పండా రాదు లుండిరి మానాయనగారు శాస్త్రోక్తాచారనిష్ఠులు, అసత్యదూరులు, అప్రతిగ్రాహకులు, వ్యాకరణమున అపరపతం జలియని పేరొందినవారు. సీతారామాచార్యులను ఆంధ్రవిద్యకు మెచ్చియు,...లంపటుఁడని విగర్హించుచుండిరి. అందువలన సీతారామాచార్యులవారు తమ శనివారపు సంగీతగోష్ఠులకు నన్ను పిలుచుటలేదు. అట్టివానికి నేను పోవుటయు లేదు."

శాస్త్రులవారు ఆపాఠశాలలో చేరిన మొదటిదినములలో ఆచార్యులవారి పాండిత్యాతిశయమునను చక్కఁగ ఎఱుంగ నందున వారిని మాటిమాటికి ప్రశ్నలు వేసి వేధించుచుండు వారు. అటుపిమ్మట తండ్రిగారి కడకు పోయినప్పుడు ఈసంగతి చెప్పగా వారు నవ్వి "నీవు పొరపడితివి, వారు ఆంధ్రములో మహాపండితులు." అని వచించిరట. శాస్త్రులవారు ఆచార్యుల వారిని మరల దర్శించినపుడు తమ యవినయమునకు క్షమాపణ కోరఁగా వారు "నీవు గడుసువాఁడవు" అని అభినందించిరఁట. శాస్త్రులవారు ఆ పాఠశాలను వదలిన చాలకాలమునకు మరల గురువర్యులనుదర్శించి తమకు యోగ్యతాపత్రము నొకదానిని దయచేయుఁడని కోరినప్పుడు వారు ఈవిధముగ వ్రాసియిచ్చిరి.

"ఇది వేదము వేంకటరాయశాస్త్రులవారి యోగ్యతను తెలియఁజేయుపత్రిక......వీరు కొన్నియేండ్లకుముందు రమారమి ఒకటియున్నర సంవత్సరము నార్మలుస్కూలులో నాయొద్ద తెనుఁగు చదువుచుండిరి. అదిమొదలు నేను వీరిని బాగుగ గుర్తెఱుంగుదును చదువునప్పుడు వీరుచేయు విద్యావిషయకమైన ప్రశ్నలకు సదుత్తరములుచెప్పి వీరిని సమాధాన పఱిచి నాపాండిత్యగౌరవమును మాటిమాటికిని నిలువఁబెట్టుకొనవలసి వచ్చుచుండెను.....................................౧౮౮౨.

౧౮౮౫ సం॥ శాస్త్రులవారు రాజమండ్రిలో ఎఫ్. ఏ., పరీక్ష నిచ్చిరి. వారి ప్రిన్సిపాలు, దొర యొకఁడు, ఎందుచేతనో వారిపై ఆదినుండియు గంటువహించియుండెను. పరీక్షహాలులో శాస్త్రులవారు తెలుఁగు పేపరుకు జవాబు వ్రాయుచుండిరి. మూఁడుగంటలకాలము. మొదటి రెండుగంటలు పరీక్షప్రశ్నలను అపార్థముచేసికొని జవాబులను తప్పుగా వ్రాసినారు. రెండు గంటలైపోయినవి. వెనుక మేలుకొని మొదట వ్రాసినదంతయు కొట్టివేసి అదంతయు మరల వ్రాయనారంభించి చాలవడిగా వ్రాసినారు. కాని ఆటవెలఁది తేటగీతిలక్షణములు వ్రాయవలసి యుండెను. 'ఇనగణత్రయంబు నింద్రద్వయంబును' అని వ్రాసినారు. గంటవినఁబడినది. 'హంసపంచకంబు నాటవెలఁది' అని వ్రాసినారు. దొరచూచి పేనా లాగుకొని పోయినాఁడు. అంతట చిటికెనవ్రేలు సిరాలోముంచి "సూర్యుఁడొక్కరుండు సుర

రాజు లిద్దరు'' అని వ్రాసినారు. 'ఇంకా వ్రాస్తున్నావా?' అని దొర సిరాబుడ్డిని ఎత్తుకొనిపోయినాఁడు. చిటికెనవ్రేలికి ఎంగిలి తగిలించి తడిచేసి 'దినకరద్వయంబు తేటగీతి' అని పూర్తిచేసినారు. దొర యీమారు తెలివిగా పేపరునే ఎత్తుకొని పోయినాఁడు. ఈ గందరగోళములో శాస్త్రులవారు తమ నెంబరు వ్రాయలేదు. ఇంత ప్రయాసయు నిష్ఫలమగును. సగము దూరము ఇంటివైపు పోయినవారు వెనుకకువచ్చి పూర్ణ్యాసును ప్రార్థించి, దొరలేనప్పుడు పోయి, తమ నెంబరువ్రాసికొని యింటి కరిగిరి.

ఆంధ్రసారస్వత సభవారు వీరికి మహోపాధ్యాయ బిరుదమును 1116-రు., ల నొసంగి సత్కరించిన సమయమున సభలో నిట్లుచెప్పిరి. ''18?5-వ సం , ఎఫ్. ఎ., కై విశాఖ పట్టణముజిల్లా నరిసీపట్టణము అసిస్టంటు కలెక్టరు కచ్చేరిలోని యుద్యోగమును మానుకొంటిని. ఆంధ్రము, అంగ్లము, గణితము—అను మూఁడే విషయములచే ఎఫ్. ఏ., లో రెండవ తరగతిలో 5-వ వాఁడనుగా జయ మొందితిని.'' అని.



## ౪-ప్రకరణము

## ఉద్యోగదశ

ఆదినములలో ఎందఱు పరీక్షలో తేరిన నందఱకును ఉద్యోగము లిచ్చుచుండువారు. ఆపరీక్షలో నుత్తీర్ణులయిన వెనుక దొర శాస్త్రులవారికి ఉద్యోగమునకు సిఫారసుచేయలేదు. శాస్త్రులవారు వెంటనే పైదొరలకు వ్రాసికొనిరి. పైదొరలు విచారింపఁగా వీరి ప్రిన్సిపాలు 'వెంకటరాయఁడు పెంకె, మనము చెప్పినపనులు చేయఁడు, అధిక ప్రసంగి. అతనికి రాజమండ్రిలోనే ఉద్యోగము కావలెను, మనము పంపిన ఊళ్లకంతయుపోఁడు,' అని బదులు వ్రాసెను. శాస్త్రులవారు ఇదంతయు నబద్ధమనియు, ఎచటికి దొరతనమువారు పంపుదురో ఎంత జీతమునకు పంపుదురో అన్నిటికిని ఒప్పుకొని యున్నారమని చాలవినయముగా వ్రాసికొనిరి. అంత విధిలేక శ్రీకాకుళము హైస్కూలులో కడపటియుపాధ్యాయునిగా పన్నెండు రూపాయల జీతముపై శాస్త్రులవారిని నియమించిరి. ఇది యొకవిశేషము, ఎఫ్. ఏ., ప్యాసై అంత కొంచెముపాటి జీతమునకు ఆంధ్రులెవరును ఉద్యోగముచేయువారు కారు. శ్రీకాకుళములో కొందఱు శాస్త్రులవారిని 'ఏమండీ, శాస్త్రులవారూ, ఎఫ్. ఏ., చదివి ఇంతకొద్ది జీతానికి ఎలాగొప్పుకొని ఒచ్చారండీ? మేము వెళ్లమండి. మీరు దక్షిణాదివాళ్లండి, నెల్లూరు సీమనించి ఇంతదూరం ఈరవంతజీతానికోసం వచ్చారండీ?' అని యడుగువారఁట.

శ్రీకాకుళములో పెద్దమనుష్యులొకరు ఉచితముగా గది నిచ్చినారు. వారిపిల్లలకు చదువులు చెప్పుచు, ప్రబంధములు పఠించుచు అచ్చట రెండునెల లుండిరి. ఆకాలములో కథాసరిత్సాగరమును చదివిరఁట. అంతట, ఏదోతోఁచి, శ్మశానములో రాత్రులు పిశాచములు బేతాళములు తిరుగుచుండునని అందులో కలదే, నూతము ఏమయిన కనబడునేమోయని రాత్రులు తిరుగుచుండువారఁట ఒకదినము ఎవరోచూచి 'ఏమండోయి, శాస్త్రులవారూ, ఎక్కడ తిరుగుచున్నారు ఈఅపరరాత్రి వేళ?' అని యడిగిరి. 'పిశాచాలేమైనా కనబడతాయేమో చూతామని.' అని శాస్త్రులవారు బదులుచెప్పిరి. 'మంచిపిశాచాలే, ఈఊరు ఏలాంటిదో ఎరగరు. ఇక్కడ బోగంకొంపలు, ఖూనీలు జరుగుతాయి. ఎవరో అనుకొని రాత్రిపూట మిమ్మల్ని కడతేరిస్తే ఏమైపోతారు. పదండి, పదండి ఇంటికి' అని వారు నివారించిరి. దానితో పిశాచాలకుగాను తిరుగుట మానివేసిరఁట.

అనంతరము చోడవరము తాలూకాస్కూలు ప్రధానోపాధ్యాయులుగా నియమింపఁబడిరి. ఈ స్కూలులో ప్యూను వేరు పేరిగాఁడు. వీఁడు బడికిరాక అనుదినము సెక్రిటరీగారి యింట నౌకరీచేయుచుండువాఁడు. ఎప్పుడైనను బడికివచ్చినా స్కూలువరాండాలో బల్లలమీఁద పరుండి నిద్రపోవువాఁడు. శాస్త్రులవారు వీనికిబుద్ధిచెప్పఁదలంచినారు అన్నిపనులను బడిలో ఉపాధ్యాయులే చేసికొనవలసియుండెను. పూర్వముండిన ప్రధా

కోపాధ్యాయుఁడు సెక్రటరీకి భయపడుచుండెను. శాస్త్రిలవారికి ఎవఁడును లక్ష్యములేదు. ఒకదినము పేరిగాఁడు నిద్రపోవుచుండఁగా బెత్తముతో వానివీపున, కాళ్లమీఁద దెబ్బలు వాయించి వానికి కనఁబడక మరలవచ్చి తరగతిలో పాఠములు చెప్పసాగిరి. 'ఓయమ్మో, ఓయిబాబో,' అని వాఁడు అంగలార్చుచు 'నన్నెవరో కొట్టేశారండీ, చంపేశారండీ' అని రొద చేయసాగెను. ఉపాధ్యాయులందఱును వచ్చిరి. అందఱికిని వెనుక శాస్త్రిలవారు పోయిరి. ఎవరు వానిని కొట్టినదియు తెలియలేదు. బాలురు వినోదము చూచుచుండిరి. పేరిగానికి వాఁడు కాయశుద్ధియైనందులకు అందఱును సంతోషించిరి. శాస్త్రిలవారు వానితో 'నువ్వు చేస్తాండే ద్రోహానికి నిన్ను వెంకటరమణమూర్తి శిక్షించాడు. ఫో, ఎవరితోపోయి చెప్పుకొంటావో, చెప్పుకోపో,' అని వానిని తఱిమివేసిరి. శాస్త్రిలవారిని బదులుకొట్టుటకు వానికి ధైర్యములేదు, బలమునులేదు. వాఁడు వెంటనేపోయి సెక్రిటరీగారితో చెప్పుకొనెను. సెక్రిటరీ వీరిని తమయింటికివచ్చి అందులకు సమాధానము చెప్పవలసినదని ఆజ్ఞాపించెను. 'మేము ఇందుకోసం సెక్రిటరీగారి యింటికిరాము. ఈ విషయంలో మాయింటికి వారు రావచ్చును. లేదా స్కూలుకువచ్చి మాట్లాడవచ్చును.' అని శాస్త్రిలవారు బదులుపలికిరి. సెక్రిటరీ ఆయూరిలో పలుకుఁబడి గలవాఁడేయైనను తుదకు శాస్త్రిలవారికి లొంగిపోయెను; పేరిగాఁడును స్కూలు నౌకరీ సరిగా చూడసాగెను.

వెనుక శాస్త్రిలవారు విశాఖపట్టణము హిందూ హైస్కూలు ద్వితీయోపాధ్యాయులుగాను రాజమహేంద్రవరము టౌను స్కూలు ప్రధానోపాధ్యాయులుగాను నుండిరి. రాజమండ్రికిపోయిన క్రొత్తలోనే యొకవిశేషము జరిగినది. ఆబడిలో క్రొత్తగా నొక టీచరు రాఘవయ్యనాయఁడని వచ్చియుండెను. దేవరకొండగోపాలశాస్త్రిలవారని తెలుగుపండితులు నుండిరి. ఈ శాస్త్రిలవారికి ఒకకన్ను కాయ. వేంకటరాయశాస్త్రిలవారు అందులకు కారణమడుగఁగా, మధ్యాహ్నము బాలురు స్కూలు గదులలోనే జాలతో ఒకరినొకరు కొట్టుకొనుటలో నొకజాయితగిలి తమ కన్ను పోయినదని ఆపండితులే చెప్పిరి. అంతట శాస్త్రిలవారు బాలురను 1-2 గంటల సమయములో స్కూలు వరాండాలలోనే యుండునట్లు నియమించి యుపాధ్యాయులకు, సర్క్యులరు ఒకటి పంపిరి. బాలురను ప్రవచనము చెప్పెడు గదులలోనికి ఆ సమయమున రానీయవలదనియు, రాలు రువ్వుట లోనగు దారుణ క్రీడలు ఆడనీయవలదనియు, వారిని గదులలోనికి పనియున్నరప్పించుకొని వెంటనే పంపివేయవలసినదనియు, వారితో ఆగంటలో ఉపాధ్యాయులు గోష్ఠిపెట్టుకోరాదనియు అందు వ్రాసిరి. దానిని చూచినందులకు గుర్తుగా నందఱును అందు సంతకము చేయవలసినదిగా హెచ్చరించిరి. అట్లే ఉపాధ్యాయులందఱును ఆసర్క్యులరులో సంతకముచేసిరి.

కాని వేంకటరాయశాస్త్రిలవారు గట్టియనుశాసకులని ఎఱుంగక కొందఱు విద్యార్థులు ఆవిధముగానే గదులలో ఆడుచునేయుండిరి. వారిని శాస్త్రిలవారు బెత్తముతో తాడించి బెదరించిరి. ఆక్రొత్త యుపాధ్యాయుఁడు లక్ష్యముచేయక కొందఱు బాలురను పెట్టుకొని ఒకగదిలో గోష్ఠి చేయుచుండెను. తమచిత్తమువచ్చినట్లు కొందఱు బాలురు ఆడుచుండిరి. వేంకటరాయశాస్త్రిలవారు ఇందఱకును తమ శాసనమెట్టిదో తెలుపగోరి బెత్తముఁగొని, ఆగది ప్రవేశించి, అచటనున్నవారి మొగములను చూడక కాళ్లమీఁద అందఱను చిత్తమువచ్చినన్ని దెబ్బలువాయించిరి. ఆయుపాధ్యాయునికిని చక్కఁగనే దెబ్బలు తగిలినవి. ఆతఁడు పైయుద్యోగస్థులకు అర్జి పెట్టుకొనెను. విచారణజరిగినది. శాస్త్రిలవారు తమసర్క్యులరునుచూపి, గోపాలశాస్త్రిలవారి కంటెని చూపి, వివరించిరి. ఆనాయని అర్జినిత్రోసివైచుటయే గాక శాస్త్రిలవారిని అధికారులు కరము శ్లాఘించిరి. అదిమొదలు శాస్త్రిలవారన్న విద్యార్థులకేగాక ఉపాధ్యాయులకును భయమేర్పడెను. ఆపాఠశాల బాగుపడెను.

ఈకాలముననే శాస్త్రిలవారికి వివాహమైనది. మొదట దాదాపు పదునాఱు పదునేడు సంవత్సరముల ప్రాయమున ఉడాలి వారి యాడుపడుచు శ్రీ జానకమ్మగారిని పరిణయమైరి గాని ఆయమ కాపురమునకు వచ్చుటకుమునుపే చనిపోయెను. వెనుక దాదాపు ఇరువదియొకటవయేట పుదూరు ద్రావిడులలో సుప్రసిద్ధులైన శ్రీ అల్లాడి సదాశివశాస్త్రిలవారి కొమార్తె

శేషమ్మగారిని వివాహమైరి. శాస్త్రిలవారి వివాహము నెల్లూరుజిల్లాలో నాయుడుపేటకు తూర్పున పుదూరునకు సమీపమున నుండు చిల్లమూరుగ్రామమున శ్రీ సదాశివయ్యగారి స్వగృహమున జరిగినది.

వెనుక కొంతకాలమునకు శాస్త్రిలవారు బి ఏ. చదువవలయునని, తమ యుద్యోగమందు తమ సోదరులు వేంకటసుబ్బయ్యగారిని ఉంచి, మదరాసునకు వచ్చిరి. బి ఏ, చదువుటకు శాస్త్రిలవారికి తీరిక లేకపోయినది. ఇతర విద్యావ్యాసంగములు ఎక్కుడయినవి. ఐదారు పర్యాయములు పైకము కట్టియు చదువు చాలకని పరీక్షకు పోలేదు. తదేకదీక్షతో సంస్కృతాంధ్ర గ్రంథములను చదువుచుండిరి. ఇట్లుండఁగా ముత్యాలపేటలోని ఆంగ్లోవర్నాక్యులర్ మిడిల్‌స్కూలునకు ప్రధానోపాధ్యాయులైరి. నలువదిరూప్యములు జీతము. అందు కుటుంబ వ్యయమునకయినది పోను మిగిలినదానినంతయు కలకత్తా బొంబాయి మొదలైన ప్రదేశములనుండి సంస్కృత గ్రంథములను తెప్పించుచు చదువుచునుండిరి. ఆ దినములలో నచ్చైన గ్రంథములలోను ప్రచారమందున్న తాళపత్ర గ్రంథములలోను చదువక విడిచినదియు చదివి మఱచినదియు లేదు. ముఖ్యముగా సాంఖ్య, యోగ, వేదాంత, వ్యక్తావ్యక్తగణిత గ్రంథములు విశేషముగా చదివిరి. బాల్యములో 'నాకు సులువుగరానిది గణితము' అని వారే చెప్పియున్నను గొప్పగణితశాస్త్రజ్ఞులని వారి నాటివిద్యార్థులు చెప్పుదురు.

శాస్త్రులవారికి ఈకాలములో సోదరవియోగము వాటిల్లినది. వేంకటసుబ్బయ్యగారు శాస్త్రులవారితో ఆబాల్యము క్రీడించినవారు, నిరంతరము తోడునీడగా నుండినవారు, ఆకస్మికముగా నాలుగుదినములు జ్వరముచే బాధపడి రాజమండ్రిలో మరణించిరి. వారిగుణాదికములను శాస్త్రులవారు అప్పుడప్పుడు చెప్పి దుఃఖించువారు. అన్నగారికన్నను ముందే ఎఫ్. ఏ., ఐ అన్నగారు ఇంకను బి, ఏ.. కాలేదనుకారణమున, తాము, అనాయాసముగ బి ఏ, కాఁగలిగినవారే అయ్యును 'అన్న బి. ఎ, కాకముందే నేను బి. ఏ, అయితే బాగుంటుందా?' అని మానుకొనిరఁట. వీరికి ఆంగ్లభాషయందు అప్పటికే మంచి ప్రావీణ్య మేర్పడినది. సంగీతమునందును చాల అభిరుచి యు డెడిది. ఒకప్పుడు ఫిడిలునేర్పిన యొకఁడు వారికడకు వచ్చి తనకు ఏదైన సాయము జేయవలసినదని కోరఁగా వెంటనే వీరు ఆలోచించక అన్నగారిద్రవ్యమునుండి అతనికొక రూపాయయిచ్చి, ఆవెనుక అన్నవచ్చి ఏమిచెప్పునోయని భయపడుచుండిరఁట అన్నగారు ఈవిషయమును తెలిసికొని తమ్మునిఁ జూచి 'నీవు చేసినది మంచిపని' అని చెప్పువరకు వారిభయము తీరలేదు. సకలవిషయములయందును అన్నగారిమాట వేదవాక్యము. 'పాండిత్యప్రతిభలలో సర్వవిధములను నన్ను మించినవాడు నాతమ్ముడు' అని శాస్త్రులవారు పలుమార్లు వచించువారు. ఆసోదరుల సౌభ్రాత్రము అట్టిది. అన్నగారికన్న పొడుగుపాటి శరీరము, చక్కని మేనిచాయ, వ్యాయామా

దులలో నై పుణ్యము, హాస్యాద్యుక్తులలో చాతుర్యము, సద్యః స్ఫురణము, దయార్ద్రహృదయము—ఇవి వీరిగుణములు.

వీరికిని అన్నగారికి వివాహమైన అనతికాలములోనే వివాహమైనది. వీరిభార్యయు వీరిగుణాదికములకై వీరిని వలచి పరిణయమైనది. ఎల్లవారి దురదృష్టముచే వారు ఆకస్మికముగా మరణింపఁగా ఆయమ నిరంతరము తదేకచింతచే స్రుక్కి శోకదేవతయై కొంతకాలమునకు తనువు త్యజించినది.

శాస్త్రిలవారు తమ్ముని మరణసమయమున చెంతలేరు. మదరాసులో నుండి తమ్ముఁడును తానును ఏనేవో కార్యములను సాధింపవలయునని పృచ్ఛను ఆసలతో నుండు సమయమున, పిడుగుదెబ్బవలె, తమ్ముఁడు గతించెనను వార్త, జాబుమూలమున తెలియవచ్చినది. రెండుమూఁడుదినములు శాస్త్రిలవారు అన్నాహారములు మాని వేసి ఏకధారగా నేడ్చుచుండిరి; క్రమముగా దుఃఖము ఉపశమించినను వారు తమ్మునిమాత్రము మఱువలేదు.

దినములు గడచిపోయినవి.



## ౫-ప్రకరణము

## వితంతువివాహ వాద్ధములు

ఇంతవరకును శాస్త్రులవారికి వేంకటరమణశాస్త్రుల వారి కొమారులని ప్రసిద్ధియేగాని వేఱువిధముగ ప్రసిద్ధియేర్పడి యుండలేదు. ౧౮౭౦ సం॥ ప్రాంతమునుండియు శాస్త్రులవారికి ప్రసిద్ధిరాసాగినది. జీవితమున కొంత కుదురుపా టేర్పడసాగెను; పాండిత్యసంపాదనములకు అవకాశములు కలుగ నారంభించినవి; శాస్త్రులవారి జీవితచరిత్రములో నొక క్రొత్తప్రకరణము ప్రారంభమైనది. ఆంధ్రదేశమందు వితంతూద్వాహప్రోత్సాహక వాదములు బయలుదేరినవి. ఈశ్వరచంద్రవిద్యాసాగర పండితుఁడు మున్నగువారు ఉత్తరహిందూస్థానమున చేయు ప్రచారమునకు అనుగుణముగ తెలుఁగుదేశమున శ్రీ వీరేశలింగముపంతులు మొదలైనవారు ఉపన్యాసము లిచ్చుచు విధవావివాహమునకు శాస్త్రనిషేధము లేదనియు, ఎల్లవారును చేయవచ్చునని చెప్పసాగిరి. సనాతన మతస్థులు కొందఱు శాస్త్రులవారిని గ్రంథములు పరిశోధించి ఉపన్యాసము లిండని కోరిరి ఆకాలమున మదరాసులో హిందూసభ యొకటియుండెను. దానిప్రాపున శాస్త్రులవారు ఉపన్యాసము లిచ్చుచు ఇతరులవాదములను ఖండించి విధవావివాహమును శాస్త్రము మాత్ర మొప్పదని చెప్ప మొదలిడిరి. నిరంతరము ఈవిషయమై గ్రంథములను శోధించుచుండిరి. *

---

* 1879 సం॥ ఆగస్టు 3 తేది వీ. లిం. గారి ప్రథమోపన్యాసము. దానిమీఁద శాస్త్రులవారి ఖండనము. [వీ. లిం. స్వీయచరిత్రము పు. 140] రాజమండ్రినుండియే వ్రాసిరి.

నారదస్మృతి ఆకాలమున దొరకుట యరుదు. మూఁడే తాళపత్రప్రతులు, నాగరిలిపివి, దేశమునకు తటికిని, మదరాసు, కలకత్తా, బొంబాయి హైకోర్టు పుస్తకభాండాగారములలో నుండినవి. మదరాసుప్రతిని జడ్జి శ్రీ సర్. టి. ముత్తుస్వామయ్యరుగారు శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులవారికిచ్చి చదివి కొన్నివిషయముల కర్థము వ్రాసియుండని కోరియుండిరి. వారికి నాగరిలిపి తెలియనందున వారు దానిని చెదలువాడ సీతారామశాస్త్రిగారి చేతికిచ్చిరి. వారికిని ఆలిపి తెలియనందున ఆగ్రంథము వారిచేత కొంతకాలము వృథాగా పడియుండెను. ఒకదినము ఏలకో శాస్త్రులవారు వారియింట దానిని చూచి చదువఁబోఁగా వారి క్రొత్త శిష్యుఁడు 'మీకది తెలియదు' అని వారింపఁజూచెను. వేంకటరాయశాస్త్రులవారు మఱింతవడిగా దానిని పుచ్చుకొని చూడఁగా అది నారదస్మృతి. దానిని తమ కెరవిమ్మని తమ యుపాధ్యాయులవారిని కోరిరి.

సీతా: 'అది నీకెందుకు, నీకేం తెలుస్తుంది'

వేంకట: 'నాకు తెలియకపోతే మరెవడికి తెలుస్తుంది? నాకు పనికిరాకపోతే మరెవడికి పనికివస్తుంది?' అని తీవ్రముగా బదులుచెప్పిరి.

సీతా: 'అయితే నీకు నాగరిలిపి తెలుసునా ?

వేంకట: 'అద్భుతంగా. రేపు తెల్లవారి మీకు మళ్లీ తెచ్చి వప్పగిస్తాను లెండి.'

'తొందర లేదు నెమ్మదిగానే తెచ్చిపెట్టు.' అని సీతారామ శాస్త్రిలవారు దాని నిచ్చినారు. వెంటనే శాస్త్రిలవారు ఆ పెద్దగ్రంథమును ఇంటికి తెచ్చుకొని రాత్రియంతయు నిదుర పోక చదివి అందులోని భాగముల నెన్నిటినో వ్రాసికొని ఉదయము దంతధావనమునకు ముందే దానిని గురువుగారికడకు కొనిపోయిరి.

'అర్థంకాలేదా యేమి?' అని వారడిగిరి.

'ఇది చిత్తగించినారా' యని వేంకటరాయశాస్త్రులవారు తమవ్రాతను చూపిరి. వారు ఆశ్చర్యపడి కొన్ని నెలలుగా నది తమకడ నూరకపడియుండిన యాచరిత్రమును చెప్పి, వెంటనే ఆపుస్తకము బ ముత్తుస్వామయ్యరుగారికి పంపివేసిరి. అందరకు కావలసినపనియు వేంకటరాయశాస్త్రిలవారు చేసివేసినారు. ఈవిధముగా శాస్త్రిలవారు విషయసంకలనము చేయుచుండిరి.

ఒకదినము శాస్త్రిలవారు ఉపన్యాసము చేయుచుండిరి. సభ క్రిక్కిరిసియుండెను. పండితులు, ఉద్యోగులు, న్యాయవాదులు, న్యాయాధిపతులు, విద్యావంతులు నింక నెందరో వచ్చియుండిరి. శాస్త్రిలవారు ఉపన్యాస మారంభించి ముందుగానే యిట్లు ప్రతిజ్ఞ చేసిరి.

'ఎవరికైనా సందేహాలు కలిగినపక్షంలో వెంటనే అప్పుడే, ఉపన్యాసము మధ్యలో లేచి నన్ను అడిగివేయవలెను. ప్రకరణము దాటిపోగానే మీరు మరచిపోవచ్చును. లేదా నేను మరచిపోవచ్చును. ఉపన్యాసం కాగానే సందేహాలు తీరు

స్తామని చెప్పి ఉపన్యాసం ముగియగానే, సభ లేచినసందులో, తప్పించుకొనే ఉద్దేశం నాకులేదు. ఎక్కడికక్కడనే సందేహాలు తీర్చవలసింది న్యాయం. నాకు చేతనైతే సమాధానాలు చెప్తాను. చేతకాకపోతే పోయి కూర్చుంటాను. చెప్పగలిగిన వాడు వచ్చి చెప్తాడు' అని.

ఏలయనఁగా వారి ప్రతిపక్షులు, ఉపన్యాసములు ముగిసిన వెనుక సందేహములకు సమాధానములు చెప్పెద మని, తొలుత చెప్పి ఉపన్యాసము ముగిసినవెంటనే సభ లేచు కలకలములో సమాధానములు చెప్పకయే తప్పించుకొని పోవుచుండిరి. అట్టివారికి దెబ్బగా శాస్త్రులవారు ఈవాక్యములను పలికిరి.

'అయ్యయ్యో! శాస్త్రులవారూ, అట్లాగయితే కొంప మునుగుతుందే' అని వీరపక్షమువాడొకడు వెనుకనుండి హెచ్చరించిరి.

'ఎంతమాత్రము కాదు అదినాశపథము' అని శాస్త్రుల వారు బదులు పలికిరి.

'అయ్యా! ఆ మనదోషంలో ఆయన్ను పోనీయండి. అంతా చెయ్యగలిగినవాడే.' అని యితరులు చెప్పిరి.

శాస్త్రులవారి యుపన్యాసమునకు అంతరాయముకలుగ లేదు, అందఱును ఆశ్చర్యముతో వినుచుండిరి కొందఱు ప్రతి పక్షులు దీనిని చూడలేక ఎట్లైనను ఒక ప్రశ్న వేసి అంత రాయము కలిగింపవలయుననని తమలో కలియబలికికొని ఒకనిని

లేపిరి. ఆయన మధ్వమతస్థుఁడు. లేచి 'శాస్త్రిలవారూ, ఒక ప్రశ్న' అనెను.

'ఏమి ?'

'మనం తద్దినాలు ఎందుకు పెట్టవలెను? మనం పెట్టే తద్దినాలు పెద్దలకు అందుతున్నవని ఏమినిశ్చయము? అందకపోతే పెట్టడమెందుకు ?

వెంటనే శాస్త్రిలవారు ఏమాత్రము తడవుకొనక గంభీరముగా, సభయంతయు చూచుచు 'ఎవరయ్యా మధ్వమతానికి ముద్రకర్త?' అని యడిగిరి.

'అయ్యా నేనండీ' అని యొకాయన లేచెను.

శాస్త్రిలవారు: ఈ ప్రశ్నఅడిగే ఆయన్ను తక్షణా వెలివెయ్యండి ఈయన అబ్బకు తద్దినంపెడుతున్నాడా కనుక్కోండి. పెట్టేవాడయితే ఈప్రశ్న వెయ్యఁడు. పెట్టకపోతే వెలి వెయ్యండి.

ఆమాధ్వుఁడు: అయ్యా తెలివిలేక ప్రశ్న వేశానండీ.

శాస్త్రిలవారు: అయితే కూర్చో.

మరల శాస్త్రిలవారు ఉపన్యాస మారంభించినారు. ఈమారు అంతరాయము కలుగలేదు.

మఱియొకచోట ఉపన్యసించునపుడు ఒకానొకరు సభలో నుండి మాటికిముందు ఏదోయొక ప్రశ్న యడుగుచునేయుండిరి. ఒకానొక శ్లోక . నకు అర్థముచెప్పుసందర్భమున తద్విపరీతార్థముగా కూడ చెప్పవచ్చునని శాస్త్రిలవారిని ఆక్షేపించినారు.

శాస్త్రులవారు ఆశ్లోకమునకు ఆయర్థము పొసగదని యీ నది విపరీతార్థమనియు, 'శుక్లాంబరధరం' అను శ్లోకమును గాడిదపరముగా నర్థము చెప్పిన నెట్లుండునో అట్లుండుననియు చెప్పిరి.

'ఎట్లాగండీ శాస్త్రులవారు, 'శుక్లాంబరధరం' అనే శ్లోకాన్ని మీరు గాడిదపరంగా ఎట్లాచెప్తారు' అని వారు ఆక్షేపించిరి.

అంతట శాస్త్రులవారు ఇట్లారంభించిరి. "శుక్ల=తెల్లనైనటువంటి, అంబర=వస్త్రములను, ధరం=ధరించినదియు; అనఁగా మోయుచున్నట్టిదియు, చాకలిమూటలను మోయుచున్నట్టిదియు; విష్ణుం=వ్యాపించుచున్నట్టిదియు, ఒకచోటనుండక తిరుగుచునేయుండునట్టిదియు, శశివర్ణం = బూడిదరంగు గలిగినదియు, అనఁగా తెల్లగానుండునట్టిదియు, చతుర్భుజం=నాలుగు కాళ్లుగలదియు, ప్రసన్నవదనం=దానిముఖము ఎంత ప్రసన్నము! అట్టిదానిని అన్నివిఘ్నములును ఉపశమించుటకొఱకు ధ్యానించుచున్నాను." అని.

"అయితే విఘ్నంరాకూడదని గాడిద నెందుకండీ ధ్యానించడం" అని యాతఁడు మరల నాక్షేపించెను.

" 'ఓ గాడిదా, మాయుపన్యాసమునకు అడ్డురాకుమా, మేము ప్రారంభించినపనికి మాటిమాటికి అడ్డురాకుమా' అని మాప్రార్థన" అని బదులుచెప్పిరి. ఈవాక్యముతో సభయెల్ల గొల్లున నవ్వసాగెను, ఆప్రాశ్నికుఁడు మఱినోరెత్తక కూర్చుండెను.

వెనుక వితంతువివాహవాదముల నన్నిటిని చేర్చి యొక గ్రంథముగా వ్రాసియుంచుకొనిరి. ప్రకటించుట ధనసాధ్యమైన విషయము. కావున ప్రకటనము ఆలస్యమగుచుండెను. ఇట్లుండఁగా తిరువలిక్కేణిలో నొకరావుగారు ఈవాదములను మరల రేపి కొంత ప్రచారము జరిపించి, కొందఱు పెద్దలచేత చందాలు వేయించి లోకమును బాగుపఱుప నెంచియుండిరి. ఈరావుగారి ంట ప్రతి శనివార ఆదివారములు పండితగోష్ఠులును వాద ాదములును జరుగుచుండెడివి. ఒక పండితుఁడు అదిపనిగా లవారికడకువచ్చి వారు వ్రాసి యుంచుకొనియుండిన గ్రంథములలోని విషయములనుచూచి వ్రాసికొనుచు, స్త్రులవారినడిగి సందేహములను తీర్చుకొనుచు, శాస్త్రులవారి కాలమునంతయు హరించుచుండెను. ఆతఁడు ఆరావుగారియింట ఉపన్యాసములు సయితము చేయుచుండెను. శాస్త్రులవారు తమ కాలమంతయు నిట్లు పోవుటకు సహింపక ఒకదినము ప్రొద్దుననే బయలుదేరి ఆపుస్తకమునే ఆతని కిచ్చి వేసిన బాగుండుననియు ఇఁక నాదినమునుండి ఆతఁడు తనకడకురాఁడనియు తలంచి తిరువలిక్కేణికి బయలుదేరిరి ఆతనియింటికిపోఁగా నాతఁడు యింట లేఁడు. ఆతనిబంధు వొకఁడుండి 'అయ్యా, ఆయన ఫలాని రావుగారియింటికి పోయియున్నారు. తాము అక్కడికిపోకండి. తమకు అక్కడ అవమానంజరుగుతుంది' అనెను.

'నన్ను అవమానపరిచేవాడికి మూడుకళ్లు కావలెను. ఎవడయ్యా అంతటివాడు?' అని ఆరావుగారియింటికి శాస్త్రుల వారు పోయిరి. ఆ రావుగారిజవాను గేటుకడ నడ్డెను. అంత వీరు కాగితముమీఁద తమపేరు వ్రాసిపంపిరి. ఆజవాను ఇటు చీటి పుచ్చుకొనిపోఁగా తాము అటు మఱియొకద్వారమున లోనికిం బోయిరి. లోనికింబోగానే 'ఆహా! హా! శాస్త్రుల, రా! రండి' అని కుర్చీ చూపి రావుగారు మర్యాదచేసినారు. ఆజవాను వీరిని చూడలేదు. చీటి చేతనుంచుకొని వ్రేలుడు మొగముతో నొక మూల అఘోరించుచుండెను. అచ్చట విధవావివాహముల వాదమువచ్చినది. పెద్దలొకరు 'ఈ వాదాలన్నీ కలిపి ఒక పుస్తకంగా వ్రాయిస్తే బాగుంటుందండీ, వ్రాయించి ప్రకటించవలెను.' అనిరి. 'ఎవరిచేత వ్రాయిస్తాము?' అని యింకొకరడిగిరి. శాస్త్రుల వారు 'అయ్యా అటువంటి దొక గ్రంథము సిద్ధముగా ఉంటే పనికిరాదా? మళ్లీ క్రొత్తగా వ్రాయించడమెందుకు' అనియడిగిరి.

'ఆహా! పనికిరాకయేమి? బాగాపనికొస్తుందండి. అటు వంటి దొకటి ఉన్నదా అనే మా సందేహం!' అని ఆ మొదట చెప్పినవారు పలికిరి.

'ఇదుగో' అని శాస్త్రులవారు తమ జేబులోనుండి ఆవ్రాఁత పుస్తకమును తీసి చూపించినారు. వారందఱును ఒకరిచేతినుండి మఱియొకరు గ్రహించి కాగితములు త్రిప్పినారు. ఒకాయన ఇంకొకాయన చెవిలో నేదోచెప్పెను. 'పనికిరాదనిచెప్పు' అన్న మాటలుగా పెదవులకదలికచే శాస్త్రులవారికి తెలిసినది. ఏల

యన వారి ద్రవ్యార్జనకు ఈగ్రంథ మనుకూలించునట్లు కనబడ లేదు. ఆపెద్దలలో నొకరు ఈవ్రాతప్రతిని చేతనుంచుకొని 'అయ్యా, అంతా బాగున్నదిగాని, ఇందులో వాళ్ల ప్రశ్నలకు అన్నిటికీ సమాధానం లేదే ' అని ఆక్షేపించిరి.

వెంటనే శాస్త్రిలవారు 'ఆపుస్తకం దయచేయండి' అని పుచ్చుకొనిరి. అందు వారు కాగితములకు ఒకవైపుమాత్రమే వ్రాసియుండిరి. రెండవప్రక్క వ్రాతలేదు. 'తాము ఇటు చిత్తగించినప్పుడు లేదా?' అని వ్రాయనివైపుచూపి 'ఇటు చిత్తగించినప్పుడు లేదా?' అని వ్రాసినవైపుచూపినారు. ఆపెద్దలు ఏమి చెప్పుటకును తోచక మొగాలు చూచుకొనిరి.

శాస్త్రులవారు: 'కనుక పూర్తిగా చదివిచెప్పండి. ఒక కాగితం తిరగవెయ్యగానే మీకు విషయమంతా కనబడదు.' అని చెప్పినారు.

ఆపెద్దలు ఇంకొకసాకు వెదకుచు 'ఈపుస్తకం చాలా పెద్దదిగా ఉందండి. కొంచెము సంగ్రహించివ్రాస్తే బాగుం టుంది' అనిరి.

శాస్త్రు: 'ఆహా,' అని ఇంటికిపోయి చిన్ననోటుబుక్కులో సన్నయక్షరములలో వ్రాసి, ఇకనిన్ని విషయములు చేర్చి, మరల ఆ పెద్దలకిచ్చినారు. వారు చూచి 'ఆహా! ఇప్పుడు సరిగా ఉందండి.' అనిపలికినారు. ఇట్లుందురు గుణగ్రహణపారీణులు.

ఈ విధవావివాహవాదముల సందర్భమున శాస్త్రుల వారికి చాల ప్రసిద్ధియేర్పడినది. ఆంధ్రదేశమందేకాక ద్రవిడ

దేశమందును గొప్ప గీర్వాణపండితు లని ఖ్యాతిగలిగినది. ఈ ఖ్యాతిచే శాస్త్రులవారికి పలువురు పండితులు ఉన్నత పదవుల యందుండు వారు మిత్రులయిరి. వారిలో శ్రీయుత, ప్రొఫెసర్ శేషగిరిశాస్త్రులవా రొకరు

1883 సం. విధవావివాహగ్రంథమును శాస్త్రులవారు ప్రకటించి పెక్కు వేల ప్రతులను వెలలేకయే పంచిపెట్టిరి. ఈ సంవత్సరమే శాస్త్రులవారు అలంకారసారసంగ్రహ మని యొక చిన్నపుస్తకమును 'చంద్రాలోకాద్యనేక గ్రంథముల సారాంశ మును'రచించి ప్రకటించిరి.1880 లోనో అంతకుకొంత ముందో 'జనవినోదిని' యను పత్రికకు సంపాదకులై దాదాపు పదేండ్లు వ్రాయుచుండిరి. ఈ కాలమున ప్రతాపుకథను, తమతండ్రిగారి వలన వినినదానిని పెంచి అందే నాలుగుసంచికలలో ప్రకటించిరి. కథాసరిత్సాగరమును అనువదించుట కారంభించి కొన్ని ప్రకరణములు జనవినోదినియందు ప్రకటించిరి.

1886 సం.ముననే శాస్త్రులవారి యేకైకపుత్రులును మా తండ్రిగారునునగు వేంకటరమణయ్యగారు జనించిరి. వీరిం గూర్చి ముందు వ్రాయుదును.



## ౬ ప్రకరణము

### క్రిశ్చియన్కాలేజీ సంస్కృత ప్రధానపండితోద్యోగము.

ఈ పై వాదములు శాస్త్రులవారి కీర్తికి ప్రథమ సోపానము. ఎల్లవారును ధర్మసందేహములయందు వారి సలహాను పొందసాగిరి. ఇదియే వారికి క్రైస్తవకళాశాలలోని సంస్కృత ప్రధానపండితపదవికి కారణము నైనది. వారే ఇట్లు చెప్పియున్నారు. *"ఇందుంగడపట పేర్కొన్న పదమందుండఁగా (ముత్యాలపేట ఆంగ్లోవర్నాక్యులర్ స్కూలు హెడ్మేష్టరుగా) ౧౮౮౩ సం స్త్రీ పునర్వివాహ దుర్వాదనిర్వాపణమను ధర్మశాస్త్ర విషయకనిబంధన గ్రంథమును రచించి ప్రకటించితిని. బహు గ్రంథ పరామర్శపూర్వకముగా నిద్రాహారాదుల నొప్పరికించి దానిని రచించినఫలము ఇరుదెఱంగులయినది. నాకు దారిద్ర్యానారోగ్యాది క్లేశములును, తద్గ్రంథముచే నిరస్తవాదులైన స మతద్రోహులకు బిరుదాంకములును లబ్ధమైనవి. ఆనిర్వాపణ గ్రంథమునకు ఇప్పటికిని ఎవరివలనను ఉత్తరము పుట్టలేదు. అయినను 'తపస్సు ఫలింపక పోయినను తనువు తేలికపడిన' దను రీతిగా ఆవాద గ్రంథము వలనను తత్కాలమందు మహాజన సంఘముమ్రోల నా కావించిన ఖండనోపన్యాసముల వలనను, నన్ను మదరాసులోని ప్రముఖులెల్ల రెఱుంగుటయు, డాక్టరు ఆపర్టు, మిల్లరు, లోనగు వహాణులకు నేను పరిచిత గీర్వాణ భాషుఁడనుగా గోచరీభూతుఁడ నగుటయు సంభవించినది. శ్రీ

---

* ఆంధ్రసారస్వతసభలోని యుపన్యాసము 1919 క్రీ. శ.

సమర్థి రంగయ్యసెట్టిగారు నన్ను మదరాసు క్రిస్టియన్కాలేజి సంస్కృత ప్రధానపండితుం గావింపం దలంపుగొనిరి. నేనును ఆ పదమునే కోరుచుంటిని.

"ఆసమయమందే డాక్టరు ఆపర్టుదొరగారికి నేను ఇంచుకంత ఉపకరించితిని. ఎట్లన-వారు అప్పటికి ఐదువేండ్లకుముందు 'నరపతివిజయము'ను ముద్రింపం దొరంకొని ప్రాయికముగా పండిత పరిష్కృతము సేయించియు, అందొక చూర్ణిక బిరుదాంకాది భూయిష్ఠము ఆదిలో కవిపెట్టిన రూపుం గోల్పోయి లేఖకాది కారణంబున శబ్దస్వరూప వాక్యావాంతరవాక్యాది విభజన లేర్పడక క్రంపబలిసియుండ దానిని సంస్కరింపుఁడని మదరాసులోని సుప్రసిద్ధాంధ్రపండితులు ముప్వురకడ నైదేండ్లు ఉంచియు భగ్నమనోరథులైరి. వారిని నేను కార్యవశంబున దర్శింపఁగా వారు ఆచూర్ణికను తదీయ దురూహతా వృత్తాంతముం జెప్పక నాచేతికిచ్చి సవరింపుమనిరి నేనును వారము దినములు ఉన్మత్తునివలె తదేకతానుఁడనై దానిని సవరించి సాధువుగా వ్రాసి ఆంగ్లానువాద సమేతముగావించి కొనిపోయి వారికిచ్చితిని. వారు నాయిచ్చినదానిం గైకొని పండితసమేతముగా రెండు వారములు పరిశోధించుకొని అంగీకరించి అనంతరము నాకు దాని యామైదేండ్లవృత్తాంతమును వక్కాణించిరి.

"ఆ యిరువురచేతను బ్రతిబోధితులై డాక్టరు మిల్లరుగారు పూర్వోక్తమైన మదరాసు క్రిస్టియన్కాలేజి సంస్కృతోపాధ్యాయపదమును ౧౮౭౬ సం. నవంబరులో నాకొసంగిరి."

మిల్లరుదొరగారు శాస్త్రులవారికి దర్శనమిచ్చి మాట లాడుచు వారితో నిట్లనిరి. "ఈ యుద్యోగమును కోరిన అర్జీదారులలో మిమ్ము నేను అభిమానించితిని"

శాస్త్రులవారు ఈ యుద్యోగమునకు అర్జీ పెట్టుకొనలేదు. కారణాంతరములచేత ముత్యాలపేట స్కూలులో ఒక శుక్రవారమునాఁడు వారు మతయుద్యోగమునకు రాజీనామా నొసంగిరి. స్వాతంత్ర్యమునకు భంగమైన యుద్యోగము వారికి సరిపడ లేదు. ఆ మఱునాఁడే క్రిస్టియనుకాలేజీ రంగయ్యసెట్టి గారు వీరిని ఆహ్వానించి పండితపదవిని గ్రహింపుఁడని కోరిరి. అంతకుపూర్వము రాజమండ్రికి తండ్రిగారికడకు పోవుటకు సంకల్పించి శాస్త్రులవారు ప్రయాణసన్నద్ధులై యుండిరి దీనిచే నిలిచిరి. మిల్లరుదొరగా రట్లు చెప్పగానే శాస్త్రులవారికి వెంటనే 'ఇదేదో మర్యాదకు భంగకరమైన వ్యవహారముగ నున్నదే' అని తోచి ఇట్లనిరి 'నేను అర్జీపెట్టుకొనలేదు. మీరే ఆహ్వానించినందుచేత వచ్చితిని' అని ఆంగ్లమున చెప్పిరి.

మిల్లరు: క్షమింపుడు. ఈమాట చెప్పినందులకు చింతిల్లుచున్నాను. మేమే మిమ్మాహ్వానించితిమి వచ్చే తారీఖునుండి నెల నుండి ఈయుద్యోగము చేయవలెను.

శాస్త్రులవారు: అటులైన నాకీయుద్యోగ మక్కర లేదు. ప్రస్తుతము నేను స్కూలునొకరికి రాజీనామానిచ్చితిని పని లేక యున్నాను.'

మిల్లరు: కానీయండి, శాస్త్రులవారూ, తాము రేపటి నుండియే కాలేజిలో ప్రవేశింపుఁడు.

ఈవిధముగా శాస్త్రిలవారు తమగౌరవమునకు ఎంత మాత్రము లోపమురానీయక దర్పముతోనే కళాశాలా సంస్కృత ప్రధానపండితులైరి.

సంస్కృతోపాధ్యాయులైనవెనుకనే శాస్త్రులవారు బి. ఏ. చదువుటకు ప్రయత్నించిరి.

* "౧౮౮౭ సం. బి. ఏ. పరీక్షకు నియతములైన సంస్కృతాంగ్లేయ భాషలలో మనీయశిష్యులతోఁగూడ నేనును పరీక్షితుఁడనైతిని. రెంటను జయమొందితిని. సంస్కృతమందలి జేతలలో మొదటివాఁడనై విజయనగర మహారాజవైశాఖపుర గోడెగజపతిరాయ దాతవ్యములైన రు ౪౦౦ పరిమితిగల బహుమానమునకుం బాత్రమనైతిని. కాని ఆ సంవత్సరము డిగ్రీని పూర్తిచేసికోనందున ఆ బహుమానముం బడయనైతిని. ఉక్తకారణంబున ఈబహుమానము నాకు తప్పిపోయినదని నాతో ఆపట్టుగారు సెలవిచ్చిరి."

---

* ఆం. సా. సభోపన్యాసము.

## ౭-ప్రకరణము

## కథాసరిత్సాగరము

### గ్రంథరచనా ప్రారంభము. నాటి మదరాసుజీవితము

క్రిశ్చియనుకాలేజీ యుద్యోగము శాస్త్రులవారిజీవితములో నొక పెద్ద మెట్టు; చాల ముఖ్యమైన ఘట్టములలో నొకటి. జీవితమునందు చక్కఁగా కుదురుపాటుకలిగెను. స్కూలు ప్రధానోపాధ్యాయుఁడుగా నలువదిరూపాయలు మాత్రమే జీతము. ఇప్పుడు నలువదియైదురూప్యములు వచ్చుచుండినవి. పూర్వముండినచోట అధికారులకును వీరికిని అభిప్రాయభేద ముండినది. ఇప్పుడు శాస్త్రులవారికి స్వాతంత్ర్య గౌరవములు కలిగినవి; వారి పాండిత్యమునకు ప్రకాశమువచ్చినది; చిరకాలమునుండియు తా మపేక్షించుచుండినపదవి లభించినది; ఇది మొదలు శాస్త్రులవారిజీవితములో శాంతియు, గ్రంథరచనలకు అవకాశమును దొరకినవి; భావికీర్తికి పునాదు లీకాలముననే ఏర్పడినవి.

శాస్త్రులవారి నాఁటి మదరాసుజీవితము కొంత వినోదముగానుండును. సంగీతకచేరీలు నేటివలెనే నాఁడును విశేషముగా జరుగుచుండెడివి. శాస్త్రులవారు తమ చదువులకు భంగమగునని వానికి పోవువారుకారు. జనవినోదినిలో 1883 సం. మునకు తర్వాతి సంచికలలో కొన్నివ్యాసములలో సంగీతమును గుఱించి వ్రాసియున్నారు. ఈవ్యాసములో స్వారస్యపు త్రాటికి మొదలు దొరకినది. ప్రతాపరుద్రీయమందలి యనేకవిషయ

ములు తమ స్వానుభవమున వచ్చిన విశేషవిషయముల భాగ ములే యని ముందే వ్రాసియుంటినిగదా. స్వారస్యపు త్రాడు ఎచటనైనను దొరకునా యని వెదకుచుండగా జనవినోదినిలో వారి వ్యాసమందే కనబడినది. లాగిచూతము దీని మొదలు. "గానరసజ్ఞు లనిపించుకొనగోరిన వారియందును అనేక దుర భ్యాసములుకలవు. గానరసము బొత్తుగా నెఱుగని యొక రాజు నొద్దికి గొప్పగాయకుడొకడు పాడరాగా, గానమందు మహా పండితురాలైన రాణిగారు, రాజుగారిని ఒక కిటికీయొద్ద కూర్చుం డబెట్టి వారిజుట్టునకు ఒకదారముగట్టి తాను కిటికీయొద్ద గోడ చాటున (ఈకాలపు పంకావానివలె) కూర్చుండి గాయకుని పాటలో విశేషించి స్వారస్యము అగపడినప్పుడెల్ల దారమును లాగుచుండెను. వెంటనే రాజుగారి తల యూగుచుండెను. గాయకుడు రాజుగారి రసజ్ఞతకు ఆశ్చర్యపడి ఆనందించి మఱియుమఱియు హెచ్చరికతో ఇంక స్వారస్యముగా పాడ సాగెను. స్వారస్యపు దారముమూలముగా రాజుగారి తల మఱి మఱి ఆడసాగెను. ఎక్కువయూపుచేత ఆదారము పుటుక్కున తెగెను. అంత నారాజు గాయకునితో "ఓహోయి పాట నిలుపు, స్వారస్యపుదారము తెగిపోయినది" అనెను. గాయ కుడు దాని యర్థమును గ్రహింపనేరక పాటమాత్రము మాని భ్రాంతుడై నలుదెసలు చూడసాగెను. ఈలోపున రాణిగారు ఒకపళ్లెములో బహుమానమును పంపిరి. దానిని రాజుగారు

గాయకునికిచ్చిరి. గాయకుఁడు సంతోషించి స్వారస్యపుదారము తెగినరహస్యమును తెలిసికొనలేకయే వెడలిపోయెను. ఈకథ *లంబుతాలద్వారా కాలక్రమమున బైటబడెను.''

ఆనందబాష్పములుకూడ ఇచ్చటనే యున్నవి. ''మఱి యొకరాజు గానరసజ్ఞుఁ డనిపించుకొనుటకై పాటవినునప్పుడెల్ల మిరియాల కలికము కన్నులలో వేసికొని బాష్పములు తెప్పించు కొనెనఁట, ఆసంగతి వారి కొట్టడిలెక్కలలో 'ఆనందబాష్పము లకు అరపలము మిరియాలు' అని వ్రాయఁబడియుండెనట. ఆ లెక్కలవలన ఆయనయొక్క రసజ్ఞత బయలువడెనఁట ''

శాస్త్రులవారికడ నిరంతరము పండితు లెవరో యొకరు వచ్చి విద్యావ్యాసంగము చేయుచుండువారు. శాస్త్రులవారును, స్వయము గాయకులు కారేగాని, ఆశాస్త్రమును చక్కఁగా నెఱిఁగినవారు ఒకదినము శాస్త్రులవారు ఏదో మంచివిషయ మునుగూఱించి మాటలాడుచుండఁగా నొక సంగీతాభిమాని మధ్యలో సంగీత ప్రస్తావము౦ దెచ్చెను. ఒకానొక భోగముది నాటిసాయంకాలము నాట్యముచేయునని ఆతఁడు సూచించెను. శాస్త్రులవారికి ఆప్రస్తావము దుస్సహముగానుండెను; పైగా వా రేదో వేఱువిషయమున లగ్నమైయుండిరి; వినిపించు కొనలేదు.

ఆతఁడు మరల, 'శాస్త్రులవారూ, అది కన్నుతిప్పి తేనే చాలునండీ' అని చెప్పెను. ఆతనికి శాస్త్రులవారితో పరిచయము క్రొత్త. శాస్త్రులవారు వెంటనే ఆయనంగని తమ మనోభిప్రాయ

* అంతఃపుర పరిచారికలు.

మును బయలుపఱుపక, ముఖవికారము మార్పకయే 'అయ్యా! నాకొక సందేహమున్నదండీ' అని యడిగిరి.

ఆతఁడు 'చెప్పండి శాస్త్రులవారూ,' అనెను.

శాస్త్రులవారు: 'ఆవేశ్య మనకంటిలో వేలుపెట్టి తిప్పుతుందా, లేక తనకన్నే తిప్పుకుంటుందా.' అని అడిగిరి.

అచటనున్న వారందఱును గొల్లున నవ్వసాగిరి. ఆ రసజ్ఞుఁడు నివ్వెఱపోయి చూడసాగెను. శాస్త్రులవారు నవ్వలేదు, మొదట నెట్లుండిరో అట్లేయుండిరి. 'ఇదేమి, ఈశాస్త్రులు, ఇంత తెలియనివాఁడా!' అని ఆతని యాశ్చర్యము కాఁబోలు కొంతసేపుండి, అందఱును నవ్వి ముగించినవెనుక ఇంకొకరు, శాస్త్రులవారు వేడుకచేయుచున్నారని ఎఱిఁగి 'అయ్యా, అది మనజోలికిరాదు, మనలను తాకదులెండి' అనిరి.

'ఆహా? అయితే పర్వాలేదు' అన్నారు శాస్త్రులవారు. అందఱును లేచినవెనుక ఆప్రస్తావము తెచ్చిన ఆయనను ఇతరులు 'శాస్త్రులవారు మంచివిషయ మేదో చెప్పుచుండగా ఇటువంటి పాడు ప్రస్తావము తేవచ్చునా? నీకు బుద్ధిచెప్పడానికి వారు హాస్యము చేసినారు వారికి లోకవ్యవహారం నీకంటె బాగానే తెలుసును. ఇకమీఁద కుదురుగా ఉండు.' అనిరి, అది మొదలు ఆతఁడు అట్టిప్రస్తావములుమాని వారిముందు, గౌరవముగా ప్రవర్తించుచుండెను.

1886 సం. శాస్త్రులవారు ప్రక్రియాఛందస్సు, (అలంకారసారసంగ్రహములను రచించి ప్రకటించిరి. కథాసరిత్సాగర

మును ఆంధ్రీకరింప నారంభించిరి. తమమిత్రులను ఎవరినైనను చదువుచుండుమని నియోగించి వారు చదువుచుండఁగా తాము తెలుఁగున వచనముగా చాలవడిగా వ్రాసికొనిపోవుచుండువారఁట. ఒకానొక రావుజీ, తెలిగ్రాపు ఆఫీసరు, సంస్కృతపండితుఁడు కొంతకాలము కథాసరిత్సాగరమును ఈపనికై చదువుచుండెను. శాస్త్రులవారు వ్రాయుటంజూచి ఆశ్చర్యపడెను. ఆతఁడు చదువుట నిలుపఁగానే శాస్త్రులవారి తెలుఁగువ్రాత పూర్తియయ్యెడిది. 'తంతిఆఫీసువాళ్లం, మేము ఇంతవడిగా వ్రాయలేమండీ' అని ఆతఁడు ఆశ్చర్యపడెను. వేఱుపనులచే దినమునకు ఐదుపుటలవంతున వ్రాసి కొంతకాలమునకు ఈ గ్రంథమును పూర్తిచేసి 1891 సం. ప్రకటించిరి. 1890 సం. సంస్కృత భోజచరిత్ర విక్రమార్కచరిత్రములను సంస్కరించి లఘుటీకలతో ప్రకటించిరి.

'ఇట్టి గ్రంథములనన్నిటిని ఈ ప్రకారమే శోధించి అచ్చు వేయ నుద్యుక్తుఁడనై యున్నాను. పండితులును, విద్యాశాలాధికారులును, విద్యార్థులును ఈసదుద్యమమునకు సంతోషించి... ...ఈ గ్రంథములకు ప్రచారము కలుగఁజేయుదురుగాక యని సవినయముగ కోరుచున్నాను' అని ప్రకటనగావించిరి.

శాస్త్రులవారికి అచ్చాపీసుకు ప్రారంభించి అందు సంస్కృతాంధ్ర గ్రంథముల శోధించి పరిష్కరించి ముద్రింపవలయునని యభిలాష పొడమినది. అంతట జ్యోతిష్మతీముద్రాక్షరశాలను 1890ప్రాంతమున స్థాపించిరి. కథాసరిత్సాగరగద్యప్రబంధ ను

అందచ్చువేసిరి. ఈకాలమున శాస్త్రులవారికి శ్రీ వేంకటగిరిమహా రాజా, కీ. శే. శ్రీ గోపాలకృష్ణయాచేంద్రులవారి యాదరము లభించినది. శ్రీమహారాజావారు స్వయము విద్యావంతులును విద్వత్పోషకులును. శాస్త్రిలవారు కథాసరిత్సాగరములో నిట్లు వ్రాసినారు. "కథాసరిత్సాగరము......నేను దొరం కొని ఆంధ్రలోకమును నమ్మి కొంతవఱకు నడిపి ఆంధ్రులకు ఈ విషయమున అక్కఱ చాలనందున అల్పసారుఁడను భగ్నారం భుఁడనైతిని. ఇట్లుండ......శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్ర బహదర్ వారు ఆప్తవర్గమువలన మదీయ పూర్వోక్తోద్యమాపరి సమాప్తి నెఱింగి లోకోపకార పారీణతావశంవదులై ఏత దాంధ్రగ్రంథ రచనాముద్రణాసహాపమునకు వలయుసహాకార మెల్ల తా నొనర్చెదమని నాకుం దెలిపించి, అట్లే వలసిన సకల ధనమొసంగి యీ యుద్యమమును నెఱవేర్చి నన్నుం గృత కృత్యుం గావించినారు." అని.

'నానాఖ్యానమనోహరం' బైన యీ ప్రబంధ మొక యపూర్వశైలిలో రచియింపఁబడినది. కఠినపదాడంబరము లేక సులువైన పదజాలముతో నిండి కథాభాగములకు ఆయాచోట్ల అనువైన శైలితో ఎల్లవారికిని సులభగ్రాహ్యమై ఈపుస్తకము ఆంధ్రవచనవాఙ్మయమున నొక నూతనశైలికి మార్గదర్శకమై యున్నది. కొందఱు ప్రబంధములలోని వచనముల శైలిని వ్రాయుచుండిరి. మఱికొందఱు వీరేశలింగముపంతులు ప్రభృతులు ఆంగ్లగ్రంథముల సాంప్రదాయములను తెనుఁగులోనికి

తెచ్చుచుండిరి. శాస్త్రులవారు తెలుఁగువారి జాతీయతను తో పింపఁజేయు శిక్కనాదుల సాంప్రదాయము ననుసరించి ఆంధ్ర దేశమందు జనసామాన్యముయొక్క వాడుకభాషకు చేరువ యైనభాషలో కథలను వ్రాసిరి. ఈవచనమున పటిమయు గాంభీర్యమును చక్కఁగానున్నవి. శైలి ఏమాత్రము హెచ్చు తక్కువలులేక సాఫుగా నడచినది. శాస్త్రులవారిశైలి ననుక రించి పలువురు వ్రాసియున్నారు; ఇంకను వ్రాయుచున్నారు.

ఇది యిట్లుండగా శాస్త్రులవారి యచ్చాఫీసు ఎక్కువ కాలము జరుగలేదు; వారిని ఆర్థికక్లేశముల పాలుగావించినది. వెంటనే శాస్త్రులవారు దానిని విక్రయించివైచిరి. తమ యు ద్యమమును తాత్కాలికముగా నాపివైచిరేగాని మరల ప్రారం భించు నుద్దేశమునుమాత్రము మానలేదు.

---

# ౮-ప్రకరణము

## పాత్రోచిత భాష

ఆంధ్రవాఙ్మయమున పూర్వకవు లెవరును నాటకములు వ్రాయలేదు. నాటకములు వ్రాయవలయునను బుద్ధి మనకు ఇంగ్లీషుభాషా సహవాసానంతరము వచ్చినది. ఈవిషయమును గుఱించి గ్రామ్యభాషాప్రయోగ నిబంధనమను నుపన్యాసమున శాస్త్రులవా రిట్లు వ్రాసియున్నారు —

“మనవారు మేఁకదాఁటుగా చిరకాలము పురాణముల నాంధ్రీకరించి తర్వాతం బ్రబంధంబులవిసిగి యిపుడు అన్యములం దొడంగినారు. మఱియు గీర్వాణనాటకముల నెఱింగియు హూణనాటకములం జదువఱకు నాటకముల వ్రాయరైరి. గీర్వాణకథల నెఱింగియు హూణనవలలం గాంచిన దనుక నవలలపయిం బడరైరి. మఱియు గద్యకవన మొక ప్రజ్ఞ కాదఁట. ఆభావముచే నవలలు లేకపోయినవి. నాటకములు వ్రాయమికి అట్టి కారణమే యొకటిగలదు.

కావ్యాలంకారచూడామణి-

చ. ‘వినుత యశంబునం గలుగు విశ్రుతనాకనివాస; మయ్యశో
జననము శ్రవ్యకావ్యముల సంగతినొప్పగు; శ్రవ్యకావ్యముం
దనరఁ గవిప్రభావమునఁ; దత్కవి సమ్మతిలేని రాజులే
పునవిహరింప; రవ్విభులు పోయినజాడ లెఱుంగఁబోలునే.’ ౩-౯౦

మ. కవిసంసిద్ధపదంబు భావరస విఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్రవ్యంబుం జతుర్వర్గసం

భవసద్మంబును నైనకావ్య మిలనా పద్మోద్భవస్థాయిగా
కవిసంస్ఫూర్తియుదాత్తకీర్తియుఁదగం గల్పించు నెల్లప్పుడున్.

ఈ వ్రాఁతంబట్టి చూడఁగా,–మనవారు శ్రవ్యకావ్యముమాత్రమె సప్తసంతానములలో చేరినదనియు, ఆముష్మికాభ్యుదయప్రదమనియు, దృశ్యకావ్య మట్టిది కాదనియు, తలంచిరని యొక రహస్యము వెలువడుచున్నది ''(పుట 54)

''మఱియు పూర్వులు రూపకరచనసేయనే లేదనుట సరిగాదు. శ్రీనాథుఁడు వీథినాటకము రచించెనని ప్రసిద్ధము గదా. అతఁడు బూతులుచేర్పక యుండిన నప్పటినుండియే నాటకము లల్లుకొనియుండును.'' (పుట 55)

౧౮౮౦ సం॥ ప్రాంత్యమున తెనుఁగున కొందఱు సంస్కృతనాటకములను అనువదింపసాగిరి. సంస్కృతనాటకములను మొదట తెనిగించినవారు నడుమవచ్చిన ఇంగ్లీషు అనువాదముల మర్యాద నవలంబించి తమ యనువాదములయందు సంస్కృత మూలములందలి ప్రాకృతాది భాషాభేదములను నిర్వహింపక అంతటను వ్యాకృతాంధ్రమే పెట్టిరి. దీనిచే రసము చెడినది. నాటకముయొక్క ప్రయోజన మంతరించినది ౧౮౯౧ సం. వేంకటరాయశాస్త్రులవారు నాగానందనాటకము నాంధ్రీకరించిరి. ఈ యాంధ్రీకరణ ప్రకటన మాంధ్రనాటక వాఙ్మయమునందు నూతనయుగ ప్రారంభమును సూచించుచున్నది.

అప్పటి కింకను స్వతంత్రనాటకములు వెలువడలేదు శాస్త్రులవారు నూతనమార్గములను కోరినవారు. "దృష్ట బహుప్రయోజనంబుగావునను, ముఖ్యముగా నానందనిష్యంది గావునను, పెద్దనాది లక్షణకారులచే ననుజ్ఞాతంబుగావునను, మఱియుం బ్రబంధములలోఁ బ్రాణము విసిగిపోయినదిగావునను, నాటకము మనకు ఉపాదేయమే." అని ఎల్లవారును నాటకములు వ్రాయవలసినదను తమ యభిప్రాయమును విశదీకరించుచు పలుతావుల ఉపన్యాసము చేయసాగిరి.

నాగానందనాటకమున శాస్త్రులవారొక క్రొత్తమార్గమవలంబించినారు. సంస్కృతనాటకముల మర్యాదప్రకారము మూలములో సంస్కృతముండుచోట్ల సలక్షణభాషయు, ప్రాకృతాది భాషాభేదములుండుచోట్ల తెలుగు గ్రామ్యభేదములనుం బ్రయోగించి అనువదించిరి. ఆంధ్రవాఙ్మయమున పాత్రోచిత భాషయందు రచియింపఁబడిన ప్రథమనాటక మిదియే శాస్త్రులవారవలంబించిన యీక్రొత్తమార్గముంగని సహృదయులు కొందఱు పండితులామోదించిరి.

మ.రా.రా.శ్రీ వడ్డాది సుబ్బారాయకవిగారు శాస్త్రులవారికి ఇట్లు వ్రాసిరి.—

"పండితోత్తమా, భవద్విరచితమగు నాగానంద నాటకము పుటములుదీరిన హాటకమువలె గావ్యేందిర కలంకారమై ప్రకాశించుచున్నది.

"నీచపాత్రములకు దెలుఁగు నాటకములయందుఁ దమరుచూపినదారి నామట్టు కాదరణీయముగానే తోఁచుచున్నది. మఱియు దానివలన ననేకలాభములున్నట్లు నేను దలంచుచున్నాఁడను. గ్రామ్యములేవో యగ్రామ్యములేవో యెఱుంగనివార లనేకులుందురు గాన వారివి గ్రామ్యములివి యగ్రామ్యము లని తెలిసికొనుటకు వీలుకలుగుచున్నది. మఱియు వాడుకప్రకారము అట్టి గ్రామ్యరూపములు వ్రాయుట కష్టమే. నాకుఁ జూడ దన్నాటకము బహు రసవంతముగానున్నది."

కొందఱు పండితులు ఔచిత్యాభిమానులు హర్షించినను ఇతరులు ఈపద్ధతికి వెంటనే హర్షింపలేదు. ఈవిషయము పండితులలో నొక యలజడిబుట్టించి వృద్ధిచేయుచుండినది.

౧౮౯౬ సం. శాస్త్రులవారు కాళిదాసమహాకవి విరచిత శాకుంతలనాటకము నాంధ్రీకరించి ప్రకటించిరి. మునుపటివలెనే పాత్రోచితభాషం బ్రయోగించిరి. దాని పీఠికలో నిట్లు వ్రాసిరి. "నాగానందమునఁ బ్రాకృతస్థానమున నేఁ బ్రయోగించిన గ్రామ్యభేదములను నాంధ్రాంగ్లేయభాషాపారీణులగు విపులహృదయు లామోదించిరి. దీనియందును గణ్వకశ్యపులకును తలారిచెంబడులకును నేకవిధభాషణముం బ్రయోగించుట యనుచితమని కావలివాండ్రకు మత్స్యఘాతకునికిని గ్రామ్యముం బ్రయోగించితిని."

శాస్త్రులవారి పద్ధతులంగని కొందఱు పండితులు తమ నాటకములలో నీచపాత్రములకు అచ్చ తెలుఁగుం బెట్టసాగిరి. దీనింగూర్చి వారే తమ గ్రామ్యభాషాప్రయోగనిబంధనమున నిట్లు వ్రాసినారు.

"కొందఱు మదీయ నాగానందముంగని, భాషాభేద మావశ్యకమని గ్రహించియు, నామార్గమవలంబించిన నా శిష్యు లగుదురని ద్వేషించి, నీచపాత్రముల కచ్చ తెలుంగని యొక రసాభాసంపు నియమముఁగల్పించుకొని నిర్వహించు కోలేక, పరమనీచపాత్రములకు నిజనియమవిరుద్ధముగా తత్సమముంబెట్టుచు, ఋషికన్యాది సత్పాత్రములచే మాల మాదిగల చేతఁబోలె మహారాజును 'పబువులు' అనిపించుచు, నీచనీచతరపాత్రములైన చేటికాదులచే సీతారాజ కన్యాదులను అతి నమ్రతతో అతి సుకుమార సంబోధన చేయవలసినచో, అతి తిరస్కార సూచకముగా, మాండ్య కశాఘాతాంగకర్తనాంక నిర్వాసనాది దండార్హముగా 'రాచకూఁతురా' యని సంబోధనచేయించుచు, నటిని సూత్రధారునిచే 'దేవీ' యని దేవిరింపించుచు గ్రామ్య నాటకములు వ్రాయుచున్నారు." (పుట 60)

౧౮౯౭ సం. శాస్త్రులవారి జీవితమున మఱువరానిది. ఈసంవత్సరమే వారు తాము బాల్యములో తమ తండ్రిగారు చెప్పఁగా విన్నట్టిదియు, వెనుక, తాము పెంపొందించి, కథగా జనవినోదినిలో ప్రకటించినదియునైన, ప్రతాపరుద్రుని కథను

నాటకముగా రచించి ప్రకటించిరి. ఆంధ్ర వాఙ్మయమునందలి మొదటి జాతీయనాటకము, స్వతంత్ర రచన, ఇదియే. ఈనాటకమందలి కథాసంవిధాన చమత్కారము, సన్నివేశ సౌభాగ్యము, సమన్వయసౌలభ్యము, పాత్ర నిర్మాణకౌశలము, రసపోషణము, కవనస్వారస్యము మొదలగువాని నిండు కలిమియటుండ, బహుపాత్ర నిర్మాణముంగావించి ఎనిమిది తొమ్మిది తెగల గ్రామ్యభేదములం బ్రయోగించి, తమ పాత్రోచితభాషా సిద్ధాంతమును స్థిరముగా నెలకొల్పుటమాత్రమేగాదు, శాశ్వతముగా రూపకరచనావిధానముం జూపినారు. 'ప్రౌఢవనైకవేద్యరసం'బగు నీ నాటకము తమప్రాపక వరేణ్యులైన శ్రీ వేంకటగిరి మహారాజావారికి తమ కృతజ్ఞతాసూచకముగా సంకేతముం గావించినారు.

ఆసంవత్సరమే 1897 శ్రీగురుజాడ అప్పారాయ కవిగారు *తమ కన్యాశుల్క ప్రహసనమును ప్రకటించిరి.

* శ్రీ అప్పారావు పంతులవారు తమ నాటకముయొక్క పీఠికలో శ్రీ శాస్త్రులవారే పాత్రోచితభాషకు ప్రాపకులని తెల్లముగా వ్రాసియుండ ఇప్పుడిప్పుడే ప్రసిద్ధికి వచ్చుచుండు కొందఱు రచయితలు, శాస్త్రులవారి గ్రంథములం జదువకయు, ఆంధ్రవాఙ్మయమున వారు చూపినమార్గము లేవో తెలియకయు, వ్యాసములు వ్రాయగడంగి, వానిలో శ్రీ అప్పారావు పంతులవారు పాత్రోచితభాషను ప్రారంభించిరనియు, వేంకటరాయశాస్త్రులవారు ఆమతమును అనుకరించిరనియు వ్రాయుట పొరబాటు. ఇట్లే పెక్కు పొరబాట్లు అల్లుకొనిపోయి యున్నవి.

ప్రతాపరుద్రీయముంగాంచినంతన తెలుఁగు ప్రపంచమున చెప్పరాని యలజడియు ఆవేశమును జనించినవి. పాత్రోచితభాషావాదము బలపడినది. దేశమందు లెక్కలేని పండితులు ఆమోదించి శాస్త్రులవారికి జాబులును పత్రికలలో వ్యాసములును వ్రాసిరి. ద్వేషులు శాస్త్రులవారిమతమును కడతేర్పవలయునని పన్నాగములు పన్నందొడంగిరి.

పండితులు కొనియాడినవిధము

అముద్రితగ్రంథచింతామణ్యధిపతి శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు పెద్దవిమర్శను పదునొకండుపుటలలో ప్రకటించిరి. "ఈ ప్రతాపరుద్రీయనాటకము పాత్రల కుచితమగు సంభాషణ వాక్యములతో నిండి వినువారి వీనులకు విందై, యమృతంపుసోనలక్రందై వెలయుచున్నది...దీనివంటి యద్భుతనాటకమును మేము కని విని యెఱుంగము...ఇంతరసపుష్టి గలిగినట్టియు నింత ప్రౌఢమగునట్టియు నింత సలక్షణమైనట్టియు నాటకము వేఱొండు దానిని మేము చూడలేదనియు విన్నవించుచున్నారము."

కలావతిపత్రిక:—ఇట్టిమంచి నాటక మీయాంధ్రభాషలో ఇంతవఱకు మఱియొకటి కానరాదు......

సత్యసాధని:—ఇక్కవికి జాతీయ స్వాభావిక జ్ఞానపరిష్కరణప్రావీణ్యము సాక్షాత్కారము. వర్ణనాంశములువచ్చినచోట నైజప్రవర్తనమునను సరించి వర్ణింపఁబడియున్నవి. ఆయాపాత్రములకుఁ దగిన జాత్యాచారాది విషయములు వెలువడునట్లు భాషను ప్రయోగించియున్నారు. ఇది నాటకముగాన ప్రామాణిక

ప్రబంధమువలె పద్యములల్లఁబడక చాక్షుషిక ప్రబంధము నను సరించి పాత్రములననుసరించియు పద్యము లల్లఁబడియున్నవి.

Madras Christian College Magazine September, 1898.

We cannot but congratulate him upon the happy choice of subject he has made. We must congratulate him also on the success with which he has accomplished his task

We shall content ourselves with saying that Prataparudriya by itself would suffice to answer those who seek to belittle the literary intellect of South India. The Drama however marks a new departure in Telugu literature. Secondly, the drama is the work of one who has before now tried his skill in the interpretation of the Sanskrit dramatists and had made a name for exactness of rendering and for his high attainments in Telugu composition both in prose and verse. Further, he has studied the dramatic art with special attention, not only for the gratification of his own scholarly instincts, but also with a view to the practical application of his studies and researches in the representation of the classical Sanskrit dramas. He has also cultivated a knowledge of the drama as understood and enacted by the Masters of the west. A work by such an author should certainly evoke the interest of the educated public.

శశిలేఖ: ఈనాటకము నూతనఫక్కిని వ్రాయఁబడి యుండుటచేతను, ఆంధ్రభాషయం దింతకుపూర్వ మిట్టినాటకములు లేకుండుటచేతను, పండితశిఖామణిచే వ్రాయఁబడిన యీ నాటకరత్నము......

“ఈనాటకము ఇతరనాటకములవలెగాక నూతనపద్ధతిని వ్రాయఁబడియుండుటచేతను......

“ఇన్ని నాటకములు మనభాషయందీ కొద్దికాలములో వ్రాయఁబడినను సంస్కృతమునుండి ఆంధ్రీకరింపఁబడిన నాలుగైదు నాటకములు తప్ప మనభాషకు గౌరవము కలుగఁజేయునవి లేవని మాయభిప్రాయము. అట్లగుటచే భాషాంతరీకరణముగాక స్వతంత్రముగ రచింపఁబడిన ప్రతాపరుద్రీయ నాటకము ఈలోపమును వారించుప్రయత్నమునకు గణపతిపూజ యనందగియున్నది వేంకటరాయశాస్త్రులవారిచేఁ జూపఁబడిన నూతనమార్గము పండితులచే నంగీకరింపఁబడునుగాక యని నమ్ముచున్నాను......

“ఈనాటకము ప్రదర్శింపఁబడినచో చూచువారు మిక్కిలి యానందమును చెందెదరనుటకు సందియము లేదు. గ్రంథకర్తయొక్క లోకానుభవము అద్భుతముగనున్నది. ఆంధ్రదేశమునందలి తురకలయు, చాకలివాండ్రయొక్కయు, అలవాటులను జక్కఁగ నెఱిఁగినవా రీనాటకమం దాపాత్రముల నిసర్గమనోహరత్వమును గ్రహించి యద్భుతమొందక మానరు.”

---

# ౯-ప్రకరణము

## సమకాలికపండితులు-నాటి పత్రికలు

ఆంధ్రవాఙ్మయము ఆంగ్ల విద్యాసంపర్కముచేత క్రొత్త పోకడలఁ బోవుచుండిన యీకాలమున పలువురు పండితులును కవులును తమ నూతనరచనలచే నాంధ్రవాగ్దేవిని సేవించుచుండిరి. ఆంధ్రనగరమైన మదరాసునగరము ఆంధ్రభాషకు కేంద్రస్థానమైనది. నెల్లూరినుండి పుదూరుద్రావిడ బ్రాహ్మణులు మదరాసుప్రవేశించి అచ్చాపీసులను స్థాపించి సంస్కృతాంధ్రగ్రంథములను ముద్రింప నారంభించిరి. శ్రీ చిన్నయ సూరిగారు 1862 సం. మున నిర్యాణముం జెందగా శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు, వారు ప్రారంభించిన గొప్పనిఘంటు నిర్మాణపద్ధతి అసాధ్యమని తలంచి ఒక పాటివిధమున శబ్దరత్నాకరమను నిఘంటువును 1885 లో ప్రకటించిరి. వావిలాల వాసుదేవశాస్త్రులు మున్నగువారు సంస్కృత నాటకములను తెనుఁగునకు అనువదింప మొదలిడిరి. శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులవారు, వీరేశలింగముపంతులవారు, ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు ఇంక ననేకులు వేంకటరాయశాస్త్రులవారికి సమకాలికులై ప్రబంధములను గద్యగ్రంథములను నాటకములను వ్రాయుచుండిరి. గురుజాడ శ్రీ రామమూర్తి పంతులవారును, వీరేశలింగము పంతులవారును ఆంధ్రకవి జీవితములను వ్రాయు

చుండిరి. ఇయ్యది చాలసంగ్రహముగా శాస్త్రులవారి సమకాలి కాంధ్రభాషాస్థితి.

వేంకటరాయశాస్త్రులవారు నాగానందమును ప్రకటించి ప్రతాపరుద్రీయమును ప్రకటించుటకు నడుమ జరిగిన భాషా వివాదములే శాస్త్రులవారి ప్రతాపరుద్రీయనాటకరచనా దీక్షకు కారణమైనటుల తెలంపవలసియున్నది. ప్రతాపము వారి హృదయమున చిరకాలమునకు పూర్వమే అంకురించినను పక్వమై వెలయుటకు ఇంతకాలము పట్టెను. ఈలోపల నాంధ్ర దేశమందు పండితకవులు పరస్పర వైషమ్యములచే వ్రాసికొన్న వ్రాతలచే ఆంధ్రకవి పండితసంఘమేర్పడి వేంకటరాయశాస్త్రుల వారిచే తుదముట్టెను. ఈవిషయములు శాస్త్రులవారి జీవితమున ప్రధానస్థానము నందుటచేతను, శాస్త్రులవారు వాఙ్మయ సమరమున పోరాడిన యోధుడగుటచేతను, ఈ చరిత్ర నంతయు వదలుట భావ్యముగాదు.

ఈకాలమున నాంధ్రదేశమున భాషావిమర్శకాదులకు పూనుకొని సూర్యాలోకము, ఆంధ్రభాషా సంజీవని, అముద్రిత గ్రంథచింతామణి, శశిలేఖ, వివేకవర్ధని, కలావతి మున్నగు పెక్కు పత్రికలు తీవ్రవిమర్శలు సలుపుచుండినవి. సూర్యాలోకమును, జి. సి. వి. శ్రీనివాసాచార్యులవారు మదరాసునుండి ప్రచురించుచుండిరి. ఇందు విద్యావిషయములేగాక లోక వృత్తాంతముకూడ ప్రకటింపఁబడుచుండెను. ఆంధ్రభాషాసంజీవని పత్రికను శ్రీ మహామహోపాధ్యాయులు కొక్కొండ

వేంకటరత్నము పంతులవారు మదరాసునుండి జరుపుచుండిరి. వీరు మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో నాంధ్రపండితులేగాక ఆంధ్రవిద్యాపారంగతు లని ప్రసిద్ధి వహించియుండిరి. బహు నాటక కర్తలైన శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి వంటివా రనేకులు వీరి శిష్యవర్గములో నుండిరి. అముద్రిత గ్రంథచింతామణి యను పత్రికను శ్రీ పూండ్ల రామకృష్ణయ్య గారు నెల్లూరినుండి ప్రకటించుచుండిరి. వీరు ౧౮౬౦ సం. జూలై ౪ తేది, నెల్లూర, దువ్వూరను గ్రామమున ఆరువేల నియోగిబ్రాహ్మణకుటుంబమున జనించి సంస్కృతాంధ్రములందు చక్కని జ్ఞానము సంపాదించుటయేగాక మంచిలాక్షణికు లనియు, విమర్శకులనియు ప్రసిద్ధివడసిరి. ౧౮౮౫ సం. మున వీరును ఒడయూరు శ్రీ నాగయ్యగా రనువారునుకలసి యీ పత్రికను, శ్రీ వేంకటగిరి మహారాజా. కీ. శే. శ్రీ రాజగోపాల కృష్ణయాచేంద్ర బహద్దరు వారిపోషణలో, ప్రారంభించి, ౧౮౮౮ సం. వరకు జరపిన యనంతరము సహాయసంపాదకు లైన వీరనాగయ్యగారు మానుకొనఁగా తామొక్కరే తమ నిర్యాణపర్యంతము ౧౯౦౪ సం. వరకు జయప్రదముగా జరిపిరి. పూర్వకావ్యముల నెన్నింటినో పరిష్కరించి ముద్రించిరి. శశిలేఖయను పత్రికను మదరాసునుండి శ్రీ గట్టుపల్లి శేషాచార్యులవారు, శ్రీ నేలటూరి పార్థసారథి అయ్యంగారు మొదలైనవారి తోడ్పాటున, ముద్రించుచుండిరి. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులవారు వివేకవర్ధనిని రాజమహేంద్ర

వరమునుండి జరుపుచుండిరి. కల్పలతి పత్రిక శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి సంపాదకత్వమున రాజమహేంద్రవరము నుండి వెలువడుచుండెను.

ఇక్కాలమున శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారికిని శ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులవారికిని బిల్హణీయమను గ్రంథము విషయమై వివాద మేర్పడినది. దీనింగూర్చి శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారే ప్రకటించిన వ్యాసమునుండి కొంత యుదాహరించుట మంచిది:—

*"శ్రీ బిల్హణీయకృతి విమర్శనముంగుఱించి— ఈసంవత్సరము మార్చినెల మొదలుగ మేము విమర్శించుచున్న శ్రీ బిల్హణీయముంగూర్చి వివిధాభిప్రాయము లితరులచేఁ బ్రకటింపఁబడినవి. వానికిం బ్రత్యుత్తరముగ నియ్యుపన్యాసముం బ్రకటించుచున్నారము:—

బ్రహ్మశ్రీ, మహారాజశ్రీ శ్రీమత్కొక్కొండ వేంకటరత్నము పంతులవారు సంస్కృతాంధ్రములయందు సమానపాండిత్యముగల వారనుట జగద్విదితమైన యంశము. అట్టి పండితునిచే విరచింపఁబడిన గ్రంథమును విమర్శించుట పండితులకు విధియైయున్నది. శ్రీ పంతులవారే తమ గ్రంథమును విమర్శనార్థమై 1-9-'98న, మాకార్యస్థానమునకుఁ బంపియున్నారు. గ్రంథమును సాంతముగఁ జదువఁగా గుణములతోఁబాటు కొన్నిదోషము లగపడినందున మావిమర్శనయంతయు నొక గ్రంథముగ వ్రాసి ప్రక

* అముద్రితగ్రంథచింతామణి సం. 7 సంచి. 12.

టించుటకు ముందుగఁ బంతులవారి యభిప్రాయమూ దెలిసి కొనిన మేలనియెంచి యీ ఫిబ్రవరి నెల 4, 5 తేదులలోఁ జెన్నపురికిం బోయి వారికి మావిమర్శన గ్రంథమునంతయుం జూపితిమి. పంతులవారు మావిమర్శనముం గనుంగొని యే కారణముననో మీపత్రికం బ్రకటించినచో దీనికిం బ్రత్యుత్తరమిచ్చెద నని యుత్తరమిచ్చిరి. ఇయ్యుదంతమంతయు మహారాజశ్రీ పసప్పాకము శ్రీనివాసాచార్యులతో విన్నవించితిమి. పంతులవారు చెప్పినచొప్పునఁ జేయుఁడని శ్రీనివాసాచార్యులవారును మాతో మందలించిరి. మేము మా స్వస్థలముం చేరినతర్వాత, 1894 సం. మార్చి నెల పత్రిక ముద్రింపించుచుండఁగా శ్రీ పంతులవారు చెన్నపురినుండి మాకు నొక జాబువ్రాసిరి. [...ఇట జాబు ఉదాహరింపఁబడినది.] మా మార్చి నెల పత్రిక యప్పటికే ముద్రితమై యుండినందునఁ గాలము మిగిలినదని బదులులిడితిమి. (ఈ పద్యములలోపములను మేము పంతులవారికిం దెల్పినారము. మార్చి సంచికంజూచిన విస్పష్టమగును.) తాము వ్రాసిన పద్యములఁ బ్రకటింపలేదను కోపముతో మార్చి నెల పత్రిక యందలి మాయాక్షేపణలకుఁ బ్రత్యుత్తరము లిచ్చుచు బ్ర సిద్ధాంతి శివశంకరశాస్త్రులవారు వ్రాసినట్లుగఁ గొన్ని పద్యములు వ్రాసి మమ్ముసందించిరి. ఆపద్యముల మే నెల సంచికలోఁ బ్రకటించుచున్నారము. ఇందువలనఁ బ్రప్రథమమునఁ గచ్చకుఁ గాలుద్రవ్వినవా రేరైనది విజ్ఞు లెఱుంగుదురు

గాత. అనల సంకులసమరము సమకూడినది. ఎవరిశక్తి కొలఁది వారు పోరాడిరికదా. ఈవాగ్రణము భాషోపయోగమైన విషయముగాన మేమును మోమోటమిలేక వాగ్జన్యము గావించితిమి. అర్ధరథు లతిరథులు మహారథులందఱు మాపక్ష మవలంబించిరి. కొన్ని ప్రయోగము లుపసంహారములైనను మాకుఁజయమనుటకు సందియములేదు. పండితులనేకులు మావాదమున కనుమోదకులగుటయే యిందుకు నిదర్శనము. అయిన నింతమాత్రమున మేము విఱ్ఱవీగువారముకాము. 'ప్రమాదోధీమతామపి' అని యున్నది గదా......నిందింపఁగడఁగిరికదా...ఇది యటుండనిండు. ఇప్పటికిని శ్రీపంతులవారియందుమిగుల గౌరవము మాకుఁ గలిగియే యున్నది...."

ఇదిపై వాదచరిత్రసంగ్రహము. దీనిని సమగ్రముగా నెఱుంగగోరువారు అముద్రితగ్రంథచింతామణినుండి గ్రహింపవలసినదేగాని ఈ లఘుగ్రంథమున హెచ్చుగా వ్రాయ నవకాశము లేదు.

ఇంతవరకును వేదము వేంకటరాయశాస్త్రిలవారు విమర్శనలంగావించి ఎవరిహృదయములంగాని నొప్పించియుండలేదు. పై వాదముల సందర్భమున శ్రీ రామకృష్ణయ్యగారు పండితాభిప్రాయములను సేకరించువారై వేంకటరాయశాస్త్రిలవారి యభిప్రాయముఁగోరఁగా శాస్త్రిలవారు కొన్నిజాబులు వ్రాసిరి. వానిని రామకృష్ణయ్యగారు తమ పత్రికయందు ప్రకటించిరి.

*"వబలకు ప్రాసముగలదని శ్రీ పంతులవారిదివఱకు నేపద్యము నుదాహరించుచుండిరో యాపద్యంబునం దమపడిన యభిప్రాయముపొరబాటని దానిని సంస్కరించిన బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారి యుపన్యాసమును సన్నుతించి యొప్పుకొన్నారు." ఇంతమాత్రమే గాదు, †"వేంకటరాయశాస్త్రులవారి 'ప్రక్రియాఛందస్సు' అను నొక గ్రంథముపై, పంతులవారీ విధముగవ్రాసినారు. ఎట్లన 'ఈపుస్తకము రూపునం గడుచిన్నదైనను గుణాతిశయములచేం బెద్దదనియే యెన్నదగియున్నది'." అని. తర్వాతతర్వాత శాస్త్రివారి జాబులను పూండ్ల రామకృష్ణయ్యగారు విశేషముగా ప్రకటింప నారంభించిరి. ఆంధ్రభాషాసంజీవని యందు ఆసూరి శ్రీనివాసాచార్యులు లోనగువారు ముద్రింపించుకొన్న యుత్తరములకు శాస్త్రిలవారు అముద్రిత గ్రంథచింతామణియందు ప్రత్యుత్తర మొసంగిరి ‡ ఇందుకు ఆసూరి శ్రీనివాసాచార్యులచే వేంకటరత్నము పంతులవారు మరల జవాబిప్పించిరి. ఇందు దూషణవాక్యములు ప్రయోగింపంబడినవి. కాని వేంకటరాయశాస్త్రిలవారు బదులు దూషింపక ఇట్లువ్రాసిరి "అముద్రిత గ్రంథచింతామణియందుం గడచిన యేప్రెలు, మే-సంచికలలో నాప్రకటించిన కొన్నిసవరణలను గూర్చి చర్చించుచుం గ్రొత్తగాం గొన్నియుదాహరణములంజూపి వానింగూర్చి నన్నుం బ్రశ్నలువేయునట్టి నైశాఖ

* అముద్రి-గ్ర-చిం. సం. 7. సంచి. 12

† అదే. సం. 8 సంచి. 1. పుట 19 ‡ అదే. సం. 8. సం 4.

జ్యేష్ఠమాసముల యాంధ్ర భాషా సంజీవనీ సంచికలయందు మూఁడుజాబులు ప్రకటింపఁబడినవి. ఆజాబులలో వ్రాయఁబడిన తిరస్కారమునకును ఛలాపలాపములకును, ప్రకటితపూర్వములయిన నాజాబులలోనే పూర్ణముగా దత్తోత్తరములయ్యును మరల నడుగఁబడిన యాక్షేపములకునుమాని విద్వద్వరేణ్యుల చిత్తమునడయ వేఁడి సుప్రసక్తములయిన విషయములకు మాత్రమే నానేర్చినకైవడి సమాధానములు వ్రాసెదను. ఇందలి గుణదోషనిర్ణయమునకై విద్యానికషపాషాణములయిన విద్వద్వరేణ్యులే ప్రమాణము'' *

ఇప్పటికి వేంకటరాయశాస్త్రులవారు ఎవరికిని ద్వేష్యులై యుండలేదు. పూర్వము వీరేశలింగము పంతులవారి వితంతువాదముల కెదురువాదములు సల్పినప్పుడు శాస్త్రులవారి పాండిత్యము లోకమునకు విదితమాయెను. వారిరువురకును అభిప్రాయభేద మేర్పడినదేగాని దూషణగ్రంథములవఱకును పోలేదు. కాని వేంకటరత్నము పంతులవారు మాత్రము, తమ గ్రంథములయందలి దోషములను వెల్లడిచేసిన పూండ్ల రామకృష్ణయ్యగారి యాక్షేపములు సాధువులని వ్రాసినందున వేంకటరాయశాస్త్రులవారిని వారి పాత్రోచితభాషను ద్వేషింప నారంభించిరి; దూషించి వ్రాయసాగిరి. కాని వేంకటరాయశాస్త్రులవారు బదులు దూషింపక సవిమర్శకములైన సమాధానముల వ్రాసిరి.

---

* అముద్రిత. సం. 8. సంచి. 10

## ౧౦-ప్రకరణము.

## *ఆంధ్రకవిపండితసంఘము-ప్రథమసమావేశము.

"ఏతన్నిర్మాత బళ్లారిడిస్ట్రిక్టు కోర్టుప్లీడరగు బ్ర. శ్రీ. ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు. వారే ప్రథమ ద్వితీయ సంఘములందు కార్యదర్శి. ప్రథమసంఘము బళ్లారిలో 1897 సం. ఏప్రిలు నెలలో ఈస్టరు సెలవులలో జరిగెను. అప్పుడు శ్రీమాన్ రాయబహదర్ పనప్పాకము అనంతాచార్యులు, బి. ఎల్. గారు. అగ్రాసనాధిపతులు... ..కృష్ణమాచార్యులవారు ఒకరొకరిని 'మీరేవిషయంబున ప్రధానోపన్యాసకులరయ్యెదరా' అనియు అట్లె సహాయపోషకోపన్యాసములకు యథోచితముగ నడుగుచుండిరి. పలువురు విషయములం గ్రహించుచుండిరి. వేంకటరాయశాస్త్రులవారు ఏవిషయంబును కోరలేదు. కృష్ణమాచార్యులవారు వారిని ప్రధానోపన్యాసమున కడుగక ద్వితీయమునకు తృతీయమునకును అడుగుచుండిరి. కొక్కొండ వేంకటరత్నము పంతులవారిని మాత్రము ప్రధానోపన్యాసమునకే అడుగుచుండిరి. ఇట్లుండఁగా నగ్రాసనాధిపతిగారు కార్యదర్శియైన కృష్ణమాచార్యులవారిని 'మీరేల వేంకటరాయశాస్త్రిగారిని వదలివేయుచున్నారు.' అని హెచ్చరికచేసిరి. అంతట కృష్ణమాచార్యులవారు తత్కాలవిచార్య

---

* కవిపండితసంఘ చరిత్రతత్త్వము—అను యొక చిన్నపుస్తకమును తృతీయాంధ్రకవిపండితసంఘసాంఘిక విజ్ఞాపనముగా శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు (కళావతీ సంపాదకులు నేఁడు మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు,) కొవ్వూరు సుబ్బరామయ్యగారు, గుండ్లపూడి సుబ్బయ్యగారు, సి. దొరసామయ్యగారు (సత్యసాధనీ పత్రికాధిపతి) అను నలువురు 1899 లో ముద్రించి ప్రకటించిరి. ఇందలి రచన కడుమనోహరముగా నున్నందునను ఈగ్రంథము ఇప్పుడు దొరకనందునను ఇది మరల అచ్చుకాదనుతలంపునను అందలిభాగములనే యిందుదాహరించుచున్నాఁడను.

మాణమైన 5 వ విషయమున వేంకటరాయశాస్త్రులవారిని సహాయోపన్యాస కులు గన్నాని యడిగిరి. శాస్త్రులవారు నిరాకరించిరి. 'అట్లైన నీరేమిచేయు దురు' అని కృష్ణమాచార్యులవారడిగిరి. '6 వ విషయము నాది' అని శాస్త్రుల వారు చెప్పిరి. కృష్ణమాచార్యులవారు ఇంచుకంత సంశయించుచు నంగీక రించిరి. శాస్త్రులవారి యొక్క యుపన్యాసముదక్క వేఱొకటి పూనుకొన లేదు. కడమ రెండు విషయములను ఇతరులు స్వీకరించిరి. పూర్వోక్త విష యాష్టకములో 5 వది వేంకటరత్నము పంతులవారిది. 'పండితులు గ్రామ్య మును భాషింపఁగూడదు; వ్రాయనుంగూడదు.' అనునది. వేంకటరాయ శాస్త్రులవారిదైన యాఱవ విషయము 'కవులు నూతనమార్గమున గ్రంథములు రచించుట మంచిది' అనునది. మఱునాఁడు పూర్వాహ్ణ మున నుపన్యాసములు ప్రారంభమైనవి. కాలము తెలియుటకై ప్రధానో పన్యాసకునికి 10 నిమిషములయినంతట హెచ్చరిక గంటను, 15 కాఁగానే విరామఘంటను వాయించునట్లును, ద్వితీయునికి 5 నిమిషములయినంతట హెచ్చరిక గంటను 10 ని. లయినంతట విరామగంటను, తృతీయునికి విరామగంటను మాత్రమే వాయించునట్లును నియమమేర్పడెను...... కొన్ని కారణములచేత అపూర్వాహ్ణాంతము వేంకటరాయశాస్త్రులవారిని 6 వ విషయముంగూర్చి యుపన్యసించునట్లుగా అగ్రాసనాధిపతిగారుకోరిరి. శాస్త్రులవా రుపన్యాసమొనర్చిరి. పత్రికోపలేఖకులు, కడమవారి యుపన్యా సములందుంబోలె శాస్త్రులవారి యుపన్యాసము ననుగమింప నేరక లేఖినులను క్రిందవైచి సామాజికపదవి నవలంబించిరి. అగ్రాసనాధిపతిగారును కడమ సకలోపన్యాసములకును వాయించినట్లు శాస్త్రులవారి యుపన్యాసమునకు హెచ్చరిక గంటను వాయింపకయు, విరామగంటను వాయింపకయు శాస్త్రులవారికి కాలప్రమాణ నియమములందొలగించి, శాస్త్రుల వారితో 'మీయుపన్యాసము నాపుట నాకిష్టములేదు.' అని నుడివిరి.

"రెండవపూట మరల నుపన్యాసము లారంభమయినవి. వేంకట రత్నము పంతులుగారి గ్రామ్యవిషయము మొదటిది. వా రుపన్యసించు

చుండఁగా సామాజికులు అగ్రాసనాధిపతిగారిని వేంకటరాయశాస్త్రిగారిచే నావిషయంబున మఱల నుపన్యాసము సేయింపుఁడని ప్రార్థించిరి. తదనుసారముగా నగ్రాసనాధిపతిగారు కోరఁగా వేంకటరాయశాస్త్రులవారు కాల నిర్బంధములేక ఆగ్రామ్యవిషయముననే ప్రసంగించిరి.

"'పంతులవారు చెప్పినట్లు ఎల్లవారితోను సర్వకాల సర్వావస్థలయందును వ్యాకృతభాషనే భాషింపసమకట్టిన వ్యవహారహాని కలుగునని యీ గ్రామ్యజనులతో వ్యవహరించునపుడు గ్రామ్యము, పండితులతో భాషించునపుడును వారికి వారియునపుడును వ్యాకృతభాషయునని వ్యవస్థ యేర్పఱచుకొనుట మంచిది.'

"అని శాస్త్రులవారి యుపన్యాససారాంశము. అట్లే ఆవిషయమంగీకృతమాయెను. కడమయుపన్యాసకులలో పూండ్ల రామకృష్ణయ్యగారిని మాత్రమే బళ్లారి సామాజికులు అగ్రాసనాధిపతి ముఖముగా పల్కుఱువేడి ప్రసంగింపించిరి. వారి వాగ్ఝరికి కడునలరిరి. అగ్రాసనాధిపతిగారు...... పండితులు వేదము వేంకటరాయశాస్త్రులవారి వంటివారుగా నుండవలయుననియు నట్టివారు అరుదనియు వక్కాణించిరి.

"కృష్ణమాచార్యులవారు శకటరేఫ అర్ధానుస్వారములు భాషనుండి తొలఁగింపఁదగినవని యుద్దేశ్యమును వెల్లడిచేసినారు. వేంకటరాయశాస్త్రులవారు నిషేధించినారు; కృష్ణమాచార్యులవారు నిషేధము నొప్పలేదు. అంతట శాస్త్రులవారు తమువంతుగా, 'ధ, ౄ, ౢ, శ,స-భేదము' వీనిం గూడ ఆరెంటితోఁ జేర్పుమనిరి. బహువర్ణ నాశోద్దేశమునకు సాహసింపక కృష్ణమాచార్యుల వారు నిజోద్దేశ్యమును త్యజించిరి.

"కృష్ణమాచార్యులవారుద్దేశించిన విషయములలో నిదియొకటి - యూనివర్సిటీవారు మెట్రిక్యులేషన్ పరీక్షకు ఆధునిక కవుల గ్రంథములను పెట్టునపుడు ఆకవులకు పారితోషిక మిచ్చుట లేదఁట. అట్టివారికి

పారితోషిక మీయవలసినదని యూనివర్సిటీవారికి ఈసంఘము వ్రాయవలసినదఁట. ఈసభ వారిట్టి పెత్తనము పెట్టుకొనుట అనుచితమని వేంకటరాయశాస్త్రులవారికితోఁచి, కృష్ణమాచార్యులవారిని "ఈరీతిని ప్రతారితులైనవారెవరు?' అని యడిగిరి. వడ్డాది సుబ్బారాయఁడుగారు' అని వారుత్తరమిడిరి. 'అట్లని సుబ్బారాయఁడుగారీసంఘమునకు వ్రాసినారా?' అని మఱల ప్రశ్న, లేదని యుత్తరము. 'కావున మన మిందు ప్రవేశింపఁగూడదు. సుబ్బరాయని వారికి ఇచ్చియేయుందురు. లేదా వారికి న్యాయస్థానములున్నవి.' అని శాస్త్రులవారు నిషేధించిరి. కృష్ణమాచార్యులవారు ఆయుద్దేశ్యమును త్యజించిరి."

---

౧౧-ప్రకరణము

**శారదాకాంచికలు-పూండ్ల రామకృష్ణయ్యగారి జాబులు.**

కవిపండిత సంఘ ప్రథమసమావేశము ప్రతాపరుద్రీయ ప్రకటనకుముందే జరిగినది. శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు శాస్త్రులవారికి ఆప్తస్నేహితులై గ్రంథరచనకు పురికొల్పుచుండిరి. ప్రతాపరుద్రీయమును రచించుచు శాస్త్రులవారు నెల్లూరిలోను మదరాసునందును తమ మిత్రబృందమునడుమ చదువుచునుండిరి.

తే 10-7-1897 పూండ్ల రామకృష్ణయ్యగారు 'ప్రతాపరుద్రీయమును అచ్చువేసికొండు. అది మీకు వెలగల యశస్సును సంపాదించుననుటకు సందియములేదు' అని వ్రాసినారు.

తే 6-11-1897 ది. ప్రతాప అచ్చైన యనంతరము, 'ప్రతాపరుద్రీయ నాటకముంజూచి బ్రహ్మానందముం జెందితిమి. నిన్నటి రాత్రి మా యిల్లంతయు దీని పఠనమువలన మన మిత్ర బృందముచే నిండిపోయినది...ఈగ్రంథమునకు మిగుల ఖ్యాతి వచ్చుననుటకు సందియములేదు.' అని వ్రాసినారు.

ఆర్యా, 11-11-97 నెల్లూరు.

నమస్కారములు. తాము దయతోనంపిన గ్రంథ త్రయము చేరి మిక్కుల సంతసించితిని. మీ యాజ్ఞానుసారముగఁ బుస్తకములఁ బుచ్చుకొంటిమి. తిక్కబొక్కలవిషయమై మీరు

వ్రాసినసంగతి వింతమైయున్నది. మీరు సాత్వికులు అందువలన నందఱుఁ దమమీఁద గనుసుందన ముపయోగింతురు. దానిని మీరు మార్చినఁగాని యికను వలనుపడదు. మీ గ్రంథమునకుఁ బ్రాశస్త్యము త్వరలో వచ్చుననుటకు సందియము లేదు. నేను నిచ్చట దానికి వ్యాప్తిగలుగునట్లుగఁ జదువుచున్నాను......

పూండ్ల రామకృష్ణయ్య.

ఆర్యా, తే 19-11-97 నెల్లూరు.

నమస్కారములు. తాము మొన్నటిదినమున వ్రాసిన కార్డు చేరినది అంతకుముందే తే 17 దిననే శశిలేఖను నేనును మన మిత్రబృందమంతయుఁ గని యలరితిమి. ఎన్నిమార్లు వారి వ్యాసమునుఁ గనినను విషయమును్న. ముం దేమియో చేయఁ బోవునట్లు గన్పట్టు. వారిచే నేమియుగాదు. పండితు లీగ్రంథ మును విమర్శింప నర్హులని వ్యాసమె యొప్పుకొనుచున్నది. ఇది నాటకలక్షణమునకు వెలియైనట్లు వారన లేదు...ఇట్టి తాటాకు చప్పుళ్లను మీరు లక్ష్యము చేయకుఁడు. అందరిని నమ్మకుఁడు. మీకు నెక్కువవ్రాయునంతటివాఁడను గానుగదా. ఎవరెన్ని పోకలపోయినను మన మేమిచేయవచ్చును, కాలము జరిగిన నొకందులకు మంచిది. అట్టి వారి సంశయములకు సమాధానము వ్రాయవచ్చును...

విధేయుఁడు.

పూండ్ల రామకృష్ణయ్య.

ఆర్యా, నమస్కారములు తే 22-11-97 నెల్లూరు.

శశిలేఖలోనిదగు విమర్శనము ద్రావిడప్రాణాయామము గాని వేరుగాదు....ఎట్లును వారియభిప్రాయము మన కనుకూల ముగరాదు. దానియందేమో ద్యోతకమగుచున్నది. పూ. రా.

శారదాకాంచిక — ప్రథమకింకిణి

నాటిస్థితి యీజాబులచే కొంత తెలియుచున్నది. ఈచిన్న పుస్తకమున నింతకన్నను పెంచివ్రాయుటకు లేదు. శాస్త్రుల వారికి ఇక నొకటేమార్గము. తమ్ము దూషించువారిని నిరుత్తరులం జేయుటయే. అన్నివైపుల నందఱును తఱుముచుండిన నెంతకాల మొకప్రాణి యూరకుండును.

శాస్త్రిగారు, కొణ్డ్ఱ్కండము వేంకటరత్నము పంతుల వారి మిత్రకోటిలోచేరిన శ్రీరాయసము నరసయ్య శాస్త్రి గారును కొమాండూరు అనంతాచార్యులవారును పరిష్కరింపఁగా ఆనంద ముద్రణాలయమువారు ముద్రించిన, జక్కన విరచిత విక్రమార్కచరిత్రమును విమర్శించి అముద్రితగ్రంథ చింతామణ్యనుబంధముగా ప్రకటించిరి. తమ్ము నిరంతరము దూషించి వ్రాయువారిని వెక్కిరించుకొరకు ఆడంబరముగా తమ విమర్శకు శారదాకాంచికయనియు ఈలఘుగ్రంథము అందు ప్రథమకింకిణియనియు, ఇందుచే నింకను పెక్కు కింకిణులు (అనఁగా విమర్శలు) వెలువడనున్నట్లును ప్రకటించిరి.

ఈ విమర్శయొక్క యవతారికలో శాస్త్రులవా రిట్లు వ్రాసిరి—

"శ్రీమన్మదరాసు రాజధానియందు మ-రా-రాశ్రీ, వేమూరు వేంకటకృష్ణమసెట్టిగారును తత్పుత్రులును ఆనంద ముద్రాక్షరశాల యనుపేర నొక యచ్చుకూటమును స్థాపించి యున్నారు. వీరు ముఖ్యముగా ఆంధ్రప్రబంధముల నభిమానించి ముద్రించుచున్నారు. వీరియుద్యమ మేమనిన — ఈభాష యందుఁ సద్గ్రంథములను లేఖకాది ప్రమాదజనిత దోషరహితముగాఁ బండితులచే శోధింపించి ముద్రణసేసి లోకోపకార మొసర్పవలయునని. ఈయుద్యమమును నెఱవేర్చుటకై వీరు శోధన దార్ఢ్యార్థము ఎంత ధనవ్యయమునకేసి వెనుదివిసిన వారు కారు. వీరి యీయుద్యమమునకు సంతసిల్లమి మూర్ఖత. వీరి యుద్యమము నెఱవేరి వీరికి కీర్తిగలుగుగావుత.

"ఇది సరియేగాని వీరికి గ్రంథములు శోధించుటకు వ్యుత్పన్నులు దొరకలేదు. కూలికిం జొరఁబడినవాఁడెల్లఁ బండితుండా? అచ్చుకూటపు మున్నానిసి కటాక్ష వీక్షణమునకుఁ బాత్రమయిన మాత్రాన నొకఁడు పండితుఁడా? వీరికై తోడ్పడినవారికి తెలివిచాలమిచే వీరు ముద్రింపించిన గ్రంథములు సీతారామాచార్య పండితవర్య ద్విరేఫమాలికా బాలచంద్రోదయమాత్రవిజ్ఞేయములగు శకటరేఫార్ధానుస్వారముల శోధనామాత్రమునం బరిఢవిల్లుచు, కడమవిషయములం గుంటువడుచు, వీరికి కీర్తికి బదులు అకీర్తిందెచ్చుచున్నవి. అచ్చుచక్కనిది, అట్టగట్టిది, తప్పులు మెండు అని యీముద్రణగుణమును నాలుగుమాటల సంగ్రహింపవచ్చును......

"ఈ లఘువిమర్శనచే నీగ్రంథమున జక్కనకవి

'ప్రతిపద్యముఁ జోద్యముగాఁ
గృతి జెప్పిన నొప్పుగాక కృతి నొకపద్యం
బతిమూఢుఁడైనఁ జిత్రతఁ
బ్రతిపాదింపడె ఘుణాక్షరన్యాయమునన్'

అని ప్రతిజ్ఞ చేసినట్లే ప్రతిపద్యరసాయనముగా నున్నదని చూపితిని. ఇట్టి యీగ్రంథమును ముద్రించుటకు ఈ శోధకు లెంత యసమర్థులో అది తెల్లముంగావించితిని. జక్కన కవనరసముం గ్రోలువారికి కొంతదారి చూపితిని."

ఈగ్రంథ ముద్రణానంతరము ప్రతిపక్షుల యాక్షేపము లెక్కువైనవి. ఈక్రింది జాబులంగనుఁడు.

ఆర్యా, నమస్కారములు. 2-7-'98 నెల్లూరు.

తాము వ్రాసినకార్డు చేరినది. విషయముంగని ముద మందితిని. ఏసెట్లును మిమ్మేమియుఁ జేయజాలరని దృఢముగా నమ్ముఁడు. సుబ్బరాయనింగారి యభిప్రాయము సరసమైనది. పద్మనాభశాస్త్రి సంధానకృత్యమునకై వచ్చియుండును. సందీయకుఁడు జ్యేష్ఠమాస సంజీవని వచ్చినది. దానిలోను పంతులుగా రొక కొన్ని పద్యములతో నేశ్చియున్నారు. అన్ని పద్యములును అన్యాపదేశముగా వ్రాసి నిందించినారు వానిలో మీకుఁ దెలుఁగుభాషలో బాండిత్యములేదని సూచింపఁబడి యున్నది. మీరు సంస్కృతపండితులేగాని యాంధ్రపండితులు

గారట. ఆ సంజీవనింజూచిన నన్నిపద్యములును విశదము లగును. జూలై యముద్రితగ్రంథచింతామణిం బంపినాను. చేరియేయుండును. దానిలో ముద్రణవిమర్శనమున్నది. వేంకట కృష్ణముసెట్టిగారు త్వరలోనే మీతో మాటలాడుదురని నాకుఁ దోచుచున్నది.........పూ. రా.

ఆర్యా, నమస్కారములు. తే 6-7-98 ది. నెల్లూరు.

తాము వ్రాసినజాబుంగని కడుమోదమందితిని. మీకింక మంచికాలము రానున్నది. మీ శత్రుసమాజమంతయు మీ కింక నైదుపది జేయును. విక్రమవిమర్శనమే యిందుకు సాక్షియై మీ పరాక్రమమును వ్యాపింపఁజేయుచున్నదిగదా. ఇఁకఁ బ్రసన్నము ప్రసన్నమగుట యరుదా. త్వరలో వ్రాతకు నారంభింపుడు. ఎన్ని పుటలు వ్రాసినది యీసారికార్డులో వినఁ గోరినాను. ఇట్లు వ్రాసినందులకు మన్నింపుడు......పూ. రా.

ఆర్యా, నమస్కారములు. తే 8-7-98 ది నెల్లూరు.

మొన్నటిరాత్రి ఆర్ వెంకటసుబ్బయ్యగారితో మాట లాడునపుడు వారు మిమ్ములఁ జులకనగా వాకొనుటయ గాక......పూ. రా.

ఆర్యా, నమస్కారములు. తే 15-8-98 నెల్లూరు,

తాము తే 12 ది వ్రాసినజాబు చూచితిని. మీయిష్టాను సారముగఁ జేయుటకు నేయాక్షేపణమును లేదు. శశిలేఖలో

నరసకవి వ్యాసముంజూచి నవ్వుచున్నారు:......మీరు జంక వలదు. వ్యాసమూర్తిగారికి మీరు వ్రాయవలదు. నేనే వ్రాయుచున్నాను....ఎట్లువచ్చునో చూతము. శశిలేఖలో వారివ్యాసమంతయు రానిండు. ఆవల బదులీయవచ్చును. ముందుగా మీరేమియు వ్రాయవలదు. మొదటిసంచికవలెనే యంతయు నుండును భయములేదు......ప్రసన్నరాఘవము మాత్రము మఱవకుఁడు. జంకకుఁడు. వెనుకంజవేయకుఁడు. మీకు జయకాలము వచ్చినది. సవ్యసాచిగా నిపుడుండవలెను....

ఇట్లు మీమిత్త్రుఁడు
పూండ్ల రామకృష్ణయ్య.

ఆర్యా, నమస్కారములు. తే 15-10-98 నెల్లూరు.

భాద్రపద సంజీవనిలోఁ బంతులవారు ప్రసన్నరాఘవ విమర్శనుగూర్చి వెక్కిరించియున్నారు. మఱియుఁ బ్రతాపరుద్రీయముంగూర్చి వ్రాసియున్నారు. ఆపద్యములలోఁ బ్రతాపరుద్ర యుగంధర వేషములూనినవారు చచ్చిరనియు నీకనినాటకము చెడినదని ఎగతాళిగ వ్రాసియున్నారు......

పూ. రా.

అంతట శాస్త్రులవారు శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులవారి యాంధ్ర ప్రసన్నరాఘవ నాటకమును విమర్శించిరి.

## శారదాకాంచిక—ద్వితీయకింకిణి.

వేంకటరాయశాస్త్రులవారు తమ విమర్శయొక్క అవతారికలో నిట్లు వ్రాసినారు:—

“ఈకాలములో ఆంధ్రభాషలో ప్రబంధములు పెచ్చు పెరుగుచున్నవిగదా. వానిలో అనేకములవలన భాషకు కడుం జెట్టుc గలుగుచుండుటంగాంచి, ఏదే నొకగ్రంథ మాధారముగా నిచెరుపు నెల్ల విద్యార్థి జనోపయోగమునకై భాషా రక్షకై వెల్లడిసేయc దలంపుగొన్నవాcడనై అట్టి యిప్పటి గ్రంథములలో నెల్ల మ. రా. రా. శ్రీ, కొక్కొండ వేంకట రత్నము పంతులవారు రచియించిన యాంధ్ర ప్రసన్నరాఘవము నాయుద్యమమున కత్యంతోపయుక్తముగా నున్నందున దానిని విమర్శింపదొరకొంటిని. ఉపయోగబీజము నించుక వివరించెద.

“కతిపయపదములకు సజీవనిర్జీవసాధనములచే అర మెఱుంగుట గ్రంథార్థ మెఱుంగుటగాదు. గ్రంథార్థములో అన్నిపదములయర్థము వాక్యములయర్థము కథాసందర్భము, రసంబును గూడcజేరును. వీనినెల్ల మాని దానిసమాత్రము పూని చేసిన తెనిcగింపునకు మూలగ్రంథ నామమిడుట సరిగాదు. ఈగ్రంథమందు భాషాంతరీకరణము ప్రాయికముగా తప్పుగానుండును. మూలమునకు ఇది మూలముగాను, దీనికది టీకగాను ఉండును. కొన్నిచోట్ల నిది మూలమునకుంగూడ నభేద్యమయిన వజ్రకవచముందొడిగి కూర్చుండును...... ఛందోవ్యాకరణాలంకారములకిది వేరుపురువు...రసము సున్న.

పూర్వులు చెప్పిన పాకము లిందు లేవు....కవనము-పెద్దయక్షరములవారికి కుదురకముందే వ్రాసినజిలుఁగుగోలును ఎట్లుండునో అట్లున్నది. పాదపూరణములవలన పద్యార్థము ప్రాయికముగా సభేద్యత్వముం బొరసియుండును. పాదపూరణప్రయోగమందును, అదియేసియు చక్కఁగ చేతగామియుండును, ఇంతటి కవి మఱిలేఁడు....అలంకారశాస్త్రమునఁ జెప్పిన దోషములలో ఇందు లేనిది లేదు. అందులేనివి ఇం దెన్నియేని గలవు. తప్పుయతులు, తప్పుగణములు, తప్పుసంధులు, అద్యంతసమాసములు, సరసవస్తుత్యాగము, ప్రాసపుసరులు, అంత్యాశ్చర్యములు, సముచ్చయములు, పౌనరుక్త్యము, ఉక్తానుక్తకావ్యదోషములు, ఇత్యాద్యపాయము లెన్నియేనియుండియు వీరు పద్యము కుదురక పడినపాట్లు అనుశోచనీయముగా నున్నవి. గద్యమందుఁగూడ ఆంధ్ర భాషాస్వభావోల్లంఘనములు తెనుఁగునఁ బనికిరాని సంస్కృత ఫక్కికలు గ్రంథమును చెఱిచినవి. వీరికి సంస్కృతమునందుఁగల లఘుపరిచయముతో ఇట్టి ప్రబంధముం దెనిఁగింప సాహసించుట గొప్ప పొరఁబాటు. తెనుఁగింపులో వీరికి అర్థము చెడినను తెలిసినదిగాదు, రసము చెడినను తెలియలేదు, కథ చెడినను తెలియలేదు, లోకస్వభావ విరోధము వచ్చినను తెలియలేదు. విభక్తిజ్ఞానముకూడ చాలక పెక్కుతావుల గ్రంథము చెడినది....

"సావధానముగా తత్త్వమరయువారు వీరికి సంస్కృతము తెలియదనియు; దేవనాగరలిపి తెలియదనియు, నాటకలక్షణము తెలియనే తెలియదనియు, ఆంధ్రభాషకు వీరు విషము పెట్టినా

రనియు, ఇతరుల గ్రంథముల గుణదోషములను చర్చించుటకు వీరు అధికారులు గారనియు, వీరిమతముచే భాష చెడుచున్న దనియు గ్రహింతురు.'' అని శాస్త్రులవారు నిరూపించిరి.

ఈవిధముగా శాస్త్రులవారు విమర్శలకుం బ్రారంభించి తమ గ్రంథములనేగాక తమ్ము వ్యక్తిపరముగా పత్రికలలో నేమి, మిత్రుల సమక్షమున నేమి, సందుదొరకినపుడంతయు దూషించుచుండిన కొక్కొండ వేంకటరత్నము పంతులవారిని వారిశిష్యులను నిరుత్తరులం జేయువారై గ్రంథములను ప్రకటింప నారంభించిరి.

ఈ గ్రంథముజూచి శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారు తమయభిప్రాయము నిట్లు తెలిపిరి......''ఆంధ్రప్రసన్న రాఘవ విమర్శము పఠించినాఁడను. అది కవికల్పద్రుమమనియు, నీషత్పరుషవచన సహితమయినను నిష్పక్షపాతబుద్ధితోఁ జక్కఁగఁ బరిశీలించి వ్రాయఁబడినదనియు, నట్టిపొత్తమును వ్రాయను సామాన్యపండితుల కలవిగాదనియు, నాయభిప్రాయము.'' అని. శాస్త్రులవారు ఇంతపరుషముగా వ్రాసినందులకు కారణములను తెలుపుటకే ఇంతవిస్తరముగా వ్రాయవలసివచ్చినది. 'శాస్త్రులవారూ! న్యాయమా యింత పరుషముగా పంతులవారిని తిట్టడము?' అని గిడుగు రామమూర్తిపంతులవారు తమ 'భాషాభేషజము'లో ప్రకటించినారు. న్యాయమే ఆకాలపుపరిస్థితుల నెఱిఁగినవారికి తెలియును.

---

## ౧౨- ప్రకరణము

## *కవిపండితసంఘము-ద్వితీయసమావేశము.

“దినచర్య సుబోధకమగుటకై లఘువుగా నుపోద్ఘాతము వలసియున్నది. వేంకటరాయశాస్త్రిగారి మూఁడు గ్రంథముల నీనడుమ వ్రాసిరి.

1 ప్రతాపరుద్రీయనాటకము— దీని నీచపాత్రములకు గ్రామ్యముపయుక్తమయినది.”

2 జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణవిగ్రహము—ఇది రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు శోధించినట్టి విక్రమచరిత్రమున వేంకటరాయశాస్త్రిగారు దోషములు మాపి దిద్దిపెట్టిన గ్రంథము.

3 ఆంధ్ర ప్రసన్నరాఘవ విమర్శ—వేంకటరత్నము పంతులవారి గ్రంథమునందలి దోషములను వేంకటరాయశాస్త్రిగారు వెల్లడిచేసినారు.

ఇందులో ప్రతాపరుద్రీయపద్ధతిని నీచపాత్రములకు గ్రామ్యమే లక్షణసమ్మతమైనచో కృష్ణమాచార్యులవారి చిత్రనళీయము, వేంకటరత్నము పంతులవారి ప్రసన్నరాఘవము, నరసయ్యగారి శాకుంతలము, ఇత్యాద్యనేక నాటకములు లక్షణవిరుద్ధములగును, కాన గ్రామ్యమే అపలక్షణమని సిద్ధాంతీకరించుట కృష్ణమాచార్య ప్రభృతులకు హితము.

విమర్శలు తలయెత్తినచో కవులకు స్వాతంత్ర్యముడుగును. అపండితులు గ్రంథరచనచేసి కవియశస్సును పొందుట కలవిగాదు. కాన విమర్శలకు అపండితకవులెల్ల ద్వేషులే యగుదురు.

ఈమూఁడు గ్రంథములును వెలువడకమున్న ఒకపరి బళ్లారిలో సరసవినోదిని సభవారు కృష్ణమాచార్యులవారితోఁగూడ కరతాళఘోషములతో వేంకటరాయశాస్త్రులవారిని ‘నిక్కంపుబండితులు. చొక్కంపువిమర్శకులు’ అనిపల్కిరని కృష్ణమాచార్యుల భావమంది బ్ర. శ్రీ. నృసింహాచార్యుల

---

* కవిపండిత సంఘచరిత్రతత్త్వమునుండి.

వారు శాస్త్రులవారికి జాబు వ్రాసినట్లు శాస్త్రులవారు వక్కాణించియున్నారు. ...ఇపుడు వెలువడిన పెద్దవిమర్శ నిజమిత్రులైన కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి గ్రంథముపయిది గాన, ఇపుడు కృష్ణమాచార్యులవారికి శాస్త్రుల వారివిమర్శలు పనికిరాకపోయినవి.

వేంకటరత్నముపంతులవారి ప్రసన్నరాఘవముపై విమర్శ వేంకట రాయశాస్త్రులవారు నిరుడు వేసవికాలముసెలవులలో వ్రాయుచుండిరి. నెల్లూరిలోని నిజమిత్రులకుం దెలుపుచుండిరి. ఈవృత్తాంతమును పంతులవారికి తన్మిత్రులు నెల్లూరినుండి తెలిపిరఁట. అంతట పంతులవారు నిజపత్రికలో 'భువనావళి' యనుపేర అతిహేయోపమలతో 14 పద్యములు వ్రాసి, అందు విమర్శకులు విమర్శలను లోకమునకుం బ్రకటింపక, రహస్యముగా కవికిం దెలుపవలయుననియు, అట్లు చేయువారికి కీర్తి కలుగుననియు, ప్రకటించినచో విమర్శకులు అకీర్తిపాలగుదురనియు, విశదపఱిచిరి. శాస్త్రుల వారు అందలి సూచనలు లక్ష్యపెట్టక గ్రంథమును ముద్రింపసాగిరి. ఆ విషయము పంతులవారికి తెలిసి వారు మఱల నిజపత్రికలో ప్రసన్నరాఘవ మును విమర్శచేయువాఁడు తత్క్షణము మృతినొందుననియును, ప్రకటించిరి. దానింగూడ శాస్త్రులవారు సరకుగొనక మూఁడ్రణము ముగించుచుండఁగా పంతులవారు ప్రదాపరుద్రీయమును కాల్చివేయవలసినదని పత్రికలో వ్రాసికొనిరి. విమర్శము గ్రిత్తపై వెలువడెను. వెలువడఁగానే వేంకటరత్నము పంతులవారును, వారికి ఆప్తులైన కోలాచలము శ్రీనివాసరావుగారును, వేంకటరత్నముపంతులవారికి శిష్యులనఁబడు ధర్మవరము రామకృష్ణమా చార్యులును, అట్లే పంతులశిష్యులైన వేంకటసుబ్బయ్యరుగారును అట్లే పంతులశిష్యులును వేంకటసుబ్బయ్యరుగారికి మిత్రులును అయిన వావిలి కొలను సుబ్బరావుగారును...విమర్శకులైన వేంకటరాయశాస్త్రులవారిని వారి గ్రామ్యమును విమర్శను ద్వేషింపసాగిరి.

మఱియు వేంకటరాయశాస్త్రిగారు తాము వ్రాసిన యాంధ్ర ప్రసన్న రాఘవనాటక విమర్శము ముద్రించుచున్నారని కొక్కొండ వేంకటరత్నము

పంతులవారి పత్రికలోని శాపనలు లోకమునకెల్ల విదితములయిన పిమ్మట నేయొకనాఁడు ద్వితీయసంఘము కూడుటకు ఇంక రెండు మూఁడు మాసములుండఁగా వేంకటరాయశాస్త్రులవారిని కృష్ణమాచార్యులవారు క్రిస్టియన్ కాలేజిలో దర్శించి, విమర్శల ప్రస్తావముందెచ్చి, 'ఇట్టివిమర్శలు మాత్సర్యముచే వ్రాసినవని లోకులు తెలంతురు.' అనిరి. 'కారణమేమని యెవరూహించిన నేమి, విమర్శలోని విషయము సాధువైన లోకులు హర్షింతురు. దానశ్రేయముం బొందుదురు. మాత్సర్యకారణమును తమ కనర్హమయిన కవిపండితకీర్తి నపేక్షించి గ్రంథరచనలు సేసి సద్విమర్శలచే భగ్నలయిన యపండితులు కల్పించుకొందురు గాక. ఇతరులకు కారణాన్వేషణము సేయునంత ప్రసక్తిలేదు.' అని శాస్త్రులవారు త్తరమిడిరి. అంతట కృష్ణమాచార్యులవారు 'ఇట్టివిమర్శలు వెడలకుండుటకై మేము కృతివిమర్శోపసంఘమొకటి నిర్మించెదము' అనిపల్కిరి. 'మనము నిర్మింతము' అనిపల్కలేదు. 'ఉచితమేని నెఱవేరును గాక' అని శాస్త్రులవారు త్తరమిడిరి. అంతట కృష్ణమాచార్యులవారు వెడలిపోయిరి.

విమర్శగ్రామ్యనాశోపాయములు - తత్సిద్ధ్యుపాయములు—ఇందులకై కృష్ణమాచార్యులవారు కృతివిమర్శోపసంఘమని యొక యుపసంఘమును నిర్మించుటయుపాయము గా నిశ్చయించుకొన్నారు. అట్టి యుపసంఘము నిర్మాతవ్యమని మహాసంఘములో నిర్ణీతమయ్యేనేని, అటుపిమ్మట ఆయుపసంఘము సాంఘికులను తనవారినిగానే చేయ్చుటయు, వారిచే గ్రామ్యవిమర్శనిరాసమాత్రమే గాక నిజేష్టసిద్ధాంతము చేయించుచుండుటయు నీషత్కరముగదా.

... ... ...

శ్రీ శేషగిరిశాస్త్రులవారు అగ్రాసన మలంకరించి యుపన్యాసమొకటిచేసిరి. అందు పండితులు జిజ్ఞాసువులై మెలఁగవలయునని హితోపదేశముచేసిరి. ఆంధ్రభాషోత్పత్తినిగూర్చి చిరపరిశీలనోపలబ్ధములైన తమ యమూల్యాభిప్రాయములను తెలుపందొడంగిరి....

కృష్ణమాచార్యులవారు కృతివిమర్శోపసంఘమొకటి నిర్మింపఁదగినదని యుద్దేశించిరి. వారి వారందఱును సరి యనిరి. వేంకటరాయశాస్త్రుల

వారు పనికి రాదనిరి. అంతట కృష్ణమాచార్యులవారు తెనుఁగును ఏటఁగలిపి ఇంగిలీషులో లైక్ బై లైక్ క్రిటిసిసమ్స్'అని వేంకటరాయశాస్త్రులవారి విమర్శలను గూలనాడిరి. వేంకటరాయశాస్త్రులవారు 'వరడ్ బై వరడ్ అండ్ సిల్లబిల్ బై సిల్లబిల్ క్రిటిసిసమ్స్, నాట్ లైక్ బై లైక్' అని బదులు నుడివిరి.

తర్వాత పూండ్ల రామకృష్ణయ్యగారు, 'నాటకములందు నీచపాత్రములకు గ్రామ్యముంచతగునా తగదా? అనువిషయము చర్చింపఁదగినది' అని నుడివిరి. వేంకటరాయశాస్త్రులవారామోదించిరి. తత్పూర్వము పత్రికలలో గ్రామ్యమును నిషేధించుచుండిన కొక్కొండ వేంకటరత్నము పంతులవారును, అట్లే గ్రామ్యనిషేధవాదులైన కృష్ణమాచార్యులవారును...... ఏవమాదులు ఆవిషయము చర్చకు రాఁగూడదని యాక్షేపించిరి. 'ఇది విద్యావిషయముగదా ఏలరాఁగూడదని' వేంకటరాయశాస్త్రులవారడిగిరి. అంతట కృష్ణమాచార్యులవారు, వేంకటరాయశాస్త్రులవారిని, 'తాత్పర్యము కొన్ని పద్యములుమాత్రము లక్షణభాషలో వ్రాసి కడమగ్రంథమెల్ల గ్రామ్యముగా వ్రాసిన పనికి వచ్చుననియా?' అని యడిగిరి. 'పాతివ్రత్యభంగమునకు ఎన్ని మారులు కష్టపడవలయునని ధర్మశాస్త్రము?' అని శాస్త్రులవారడిగిరి. ఎల్లవారును ఊరకుండిరి. శాస్త్రులవారు మఱల 'పుటకెన్నిపంక్తులు గ్రామ్యముండవచ్చునని మీయభిప్రాయము? పంద్రెండా పదమూఁడా?' అనియడిగిరి. అందులకును ఎవ్వరుంబలుకకుండిరి. అంతట కృష్ణమాచార్యులవారు 'ఈసభవారి సిద్ధాంతము ప్రకారము తాము నడుచుకొందురా?' యని శాస్త్రులవారినడిగిరి. ఈ ప్రశ్నలో ఎంత కుట్రకలదో యాలోచింపుఁడు. ఈ ప్రశ్న యడుగవలసిన ప్రసక్తియేమి? ఇతరులు తమతమ యుద్దేశ్యములం దెలిపినప్పుడెల్ల వారిని 'ఈ విషయమున సభవారి సిద్ధాంతముప్రకారము మీరు నడచుకొందురా?' అని అడిగినారా? వేంకటరాయశాస్త్రిగారిని మాత్రము ఈప్రశ్నయడుగనేల? శాస్త్రిగారు అట్లే నడచుకొనియెదనని చెప్పినయెడల, వెంటనే తొలుత ఆచర్చగూడదన్నవారెల్ల ఇపుడు కూడునని

రొప్పి పిమ్మట వోట్లబాహుళ్యముచే గ్రామ్యము కూడదని సిద్ధాంతీకరించి శాస్త్రులవారిని నిబర్హణ సేయుదురుగావలయు. శాస్త్రులవారు ఈసభకు దేశమందలి పండితులెల్ల రానందున ఈసభవారి సిద్ధాంతమునకు నెవ్వండును బద్ధుండుకానేరఁడనియు, చర్చించి యభిప్రాయము చెప్పు నధికారమే గాని బంధించు నధికారము ఈసభవారికి లేదనియు, అట్లు బద్ధులు కావలసినట్లు నిబంధన యేమియు లేదనియు, ఆహూతులై వచ్చిన పండితు లట్టి నిబంధన కొడంబఱుపఁబడలేదనియు కావున తానెంతమాత్రమును ఈసభవారి సిద్ధాంతములకు ఒడంబడననియు పల్కిరి. అంతట కృష్ణమాచార్యులవారు 'ఈవిషయము కృతి విమర్శోపసంఘమువారికి తెలియును గాన మనము చర్చింపఁబనిలేదు.' అనిరి. 'వారిలో వైమత్యము తప్పించుటకై మనము చర్చించి సిద్ధాంతముం దెలుపవలయును,' అని శాస్త్రులవారు నుడువిరి. అంతట వోట్లడిగిరి. ఇంతవివాదముపై కొందఱు ఈవిషయమును మఱునాఁడు ధ్వంసముచేయుదమని సంకల్పించి వోట్లిచ్చిరి......పిమ్మట అగ్రాసనాధిపతిగారు ఆగ్రామ్యవిషయము చర్చించుట తనకు సమ్మతముకాదని నుడివిరి. అంతట అగ్రాసనాధిపతిగారికిష్టముగని చర్చ యేల బలాత్కారముచేయవలయునని వేంకటరాయశాస్త్రులవారు తనవోటును ఉపసంహరించిరి. ఆ విషయము రేపు చర్చనీయము కాదని తీర్మానింపఁబడెను......

వడ్డాది సుబ్బరాయుఁడుగారు 'ఆంధ్రభాషకు లక్ష్యముగా ప్రమాణగ్రంథము లేవో తెలియవేని కృతివిమర్శోపసంఘసాంఘికులు విమర్శ యెట్లు చేయుదురు? ప్రమాణగ్రంథము లివియని యొక సిద్ధాంత మేర్పఱుపవలయును.' అని యుద్దేశించిరి. "ప్రమాణగ్రంథము లేవో తెలియరేని కృతి విమర్శోపసంఘసాంఘికులు గ్రంథవిమర్శ యెట్లు సేయుదురు? వారికా విషయము గ్రామ్యవిషయంబువోలె తెలిసియేయుండును, గాన నది యిట చర్చనీయము గాదు." అని శాస్త్రులవారు నిషేధించిరి. అదిత్యక్తమాయెను......

ఉపన్యాసక నియమనములో ...... వేంకటరాయశాస్త్రులవారికిని, పూండ్ల రామకృష్ణయ్యగారికిని తప్ప కడమయందరికిని ఉపన్యాసములు కుదిర్చిరి.......

౧౮౯౯ సం. జనవరి ౧ తే. 12 ఘం.లకు సభ యారంభమాయెను. కుప్పుస్వామయ్యగారు నూతనమార్గముల గ్రంథములు రచింపవలసిన దనియు, అన్యభాషాగ్రంథముల నాంధ్రీకరించుచో సాంకేతికపదములను గీర్వాణ భాషలో......నాటకములందు గ్రామ్యము ప్రయోగింపఁగూడ దనియు నుపన్యసించిరి. వేంకటరత్నము పంతులవారు ...... నాటకములలో గ్రామ్యముపయోగింపఁగూడదని నుడివిరి.

పిదప నాత్కూరు సంస్థానపు శ్రీనివాసాచార్యులవారు నాటకములలో గ్రామ్యముకూడుననియు కూడదనియు రసమునకు గ్రామ్యమే వలయుననియు నుడివిరి.......

ఈ యుపన్యాసము లిట్లు జరుగుచుండఁగా సామాజికులు అగ్రాసనాధిపతిగారికి ముమ్మాఱు ఒక విన్నపము, తొలుత ఒకరిద్దరి చేవ్రాలతోను, రెండవమాఱు మూఁడవమాఱును పలువురి చేవ్రాలతోను ఒనర్చిరి. విజ్ఞాపన నంగీకరించి అగ్రాసనాధిపతిగారు వేంకటరాయశాస్త్రిగారిని ఉపన్యాసార్థమై పిలిచిరి. శాస్త్రులవారప్పుడే యింటికి పోయివచ్చినందున, దేహమందారోగ్యము చాలనందునను, తన్ను మన్నించి యుపన్యాసము తప్పింప వలయునని అగ్రాసనాధిపతిగారిని యడిగిరి. 'మీరు నాలుగుమాటలుచెప్పిన చాలును. ఏవిషయముచెప్పినను సరియే'' యని రెండుమాఱులు అగ్రాసనాధిపతిగారు కోరఁగా మహానుభావులమాట నిరాకరింపఁజాలక యొడంబడిరి. అగ్రాసనాధిపతిగారు లేచి 'మహావిద్వాంసులైన వేదము వేంకటరాయ శాస్త్రిగా రుపన్యసించెదరు. సావధానచిత్తులరై వినుఁడు.' అని సభవారిని హెచ్చరించి పల్కిరి. శాస్త్రిగా రుపన్యాసపీఠము నధిష్ఠింపఁగానే సభ్యుల కరతాళఘోషములు 4-5 నిమిషములు మ్రోగుచుండినవి. (ఇట్టి గౌరవము, అగ్రాసనాధిపతిగారి చేత నేమి, సామాజికులచేత నేమి శాస్త్రిగారికిదక్క మఱియే యుపన్యాసకునికిం జరుగలేదు.) ఆఘోషలు నిలిచినతర్వాత, శాస్త్రులవారు అగ్రాసనాధిపతిగారిని ప్రకృతవిషయమేమని యడిగిరి. కృతి విమర్శోప సంఘనిర్మాణమని యగ్రాసనాధిపతిగారు చెప్పిరి.

శాస్త్రులవారు చిత్తమని దానింగూర్చి యుపన్యసింపం దొరంకొను చుండంగా కార్యదర్శిగారు మేల్కొని, ఆవిషయమున కుద్దేశకుండు తానసియు, తనయుద్దేశనోపన్యాస మయినతర్వాత శాస్త్రులవా రుపన్యసింప వచ్చుననియు నుడివిరి. శాస్త్రులవారీవిఘ్నమునకు పరమానందభరితులై తత్క్షణమే నగ్రియం దిగి సామాజికులందు గూర్చుండిరి......అంత కృష్ణమా చార్యులవారు కృతివిమర్శనోపసంఘ నిర్ణయమునుగుఱించి యొక యర టావుకాగితము రెండు ప్రక్కలను తాము వ్రాసికొని వచ్చినయుపన్యాసము మును అరగంటసేపు చదివిరి.

అంత అగ్రాసనాధిపతిగారు వేంకటరాయశాస్త్రులవారిని ఉపన్యసింపు మని కోరిరి. వేంకటరాయశాస్త్రులవారు మునుపటికంటె నధికముగా నభినం దింపంబడి 'పత్త్రికలలో విమర్శలు సరిగావనుట సరిగాదు. అముద్రిత గ్రంథచింతామణి శాస్త్రీయ విమర్శలకు బద్ధకంకణమై పండ్రెండు సంవ త్సరములనుండి కీర్తివడసియుండంగా, అట్టి పత్త్రికను బహూకరింపక ధిక్కరించుట పండితసంఘమునకుందగునా......కృతి విమర్శనోపసంఘము పనికిరాదు.' అని యీతీరున ఉపన్యసించిరి.

ఈ యుపన్యాసమధ్యంబున శాస్త్రులవారు గఘుప్రాసమున్నప్పుడు, కృష్ణమాచార్యులవారు లేచి అగ్రాసనాధిపతిగారి చెవిలో 'పెర్సనాలిటీ' అని యూదినారు. దానిని విని అగ్రాసనాధిపతిగారు శాస్త్రులవారికి హెచ్చ రిక సేయుటకు లేచుచుండంగా శాస్త్రులవారు వారరువురింగని 'I know better' (నాకంతకన్న బాగుగా తెలియును) అని పల్కిరి. దాన నా ప్రయోగము శాంతమాయెను.

శాస్త్రులవారి యుపన్యాసమున వాక్యములకును వాక్యాంతర్గత పదము లకును సామాజికులహర్షోత్కర్ష సూచకకరతాళఘోషముల చే వ్యవధానము కలుగుచుండినది. వారుపన్యసించిన కాలపరిమాణము 15 నిమిషములుండును. వారి యుపన్యాసమునంగలిగిన సామాజికాది చిత్తావస్థను 'రాజహంస'యిట్లు వర్ణించినది. 'వేంకటరాయశాస్త్రిగారు.........పునాదిలేని సౌధమువలె

నాంధ్రకవిపండితసంఘ మొక్కసారి నేలపడఁబోవుచున్నదా యనునట్లు సభ్యులయుల్లములు జల్లుమనునట్లు ప్రసంగించిరి. అగ్రాసనాధిపతిగారు సభ్యులవంకఁజూచిరి. సభ్యు లాచార్యులవంకఁజూచిరి. ఆచార్యులవా రాకాశమువంకజూచిరి....' అని రాజహంస కూజితము. 'శాస్త్రులవారి వలన మనభాషకు ముప్పు తప్పినది, భాషకింకను మంచికాలము కొంతవఱ కున్నది' అని దేవరాజపెరుమాళ్లయ్య లోనగు నాంధ్రపండితులు సంఘ మందు మిత్రులతో వక్కాణించిరి.

శ్రీశాస్త్రులవారి యుపన్యాసముగుఱించి. బ్ర. శ్రీ. కొక్కొండ వేంకటరత్నముపంతులవారు విళంబిపుష్యసంజీవనిలో నీవిధముగా నిందించి యున్నారు.

'బ్ర. వేదము వేంకటరాయశాస్త్రులవారును, బ్ర. పూండ్ల రామ కృష్ణయ్యగారును ఝంఝామారుతమువలె మారుకొన్నందునఁ, బ్ర. శ్రీ మచ్ఛతావధాని ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి కృతి విమర్శనోప సంఘవిషయమైన వాదమను నొక యాకాలమున సంగభంగభయమను సముద్రమునఁ మునిఁగె. ఆనావ వెండియు లోనుండి వెలువ రించుటకొకసంవత్సరము పట్టునని తెలియవచ్చె. వేయేల? ఈమోలగము యొక్క ముఖ్యోద్దేశము చక్కఁగా నెఱవేఱమి కిత్తఱి బ్ర. వేదము వేంకటరాయశాస్త్రిగారును, బ్ర. పూండ్ల రామకృష్ణయ్యగారును నను నీయిరువురే కారణభూతులని యందఱుందలంచిరి. మఱి వచించిరి. ఈ యాంధ్రకవిపండితసంఘ మహాసభ భవిష్యద్వర్షమున నెల్లూరులో జరుగునట్లు నిష్కర్షింపఁబడియెను.ఇఁక నిది యక్కడ నెక్కరణింజరుగునో? ఎందుకుగాని యీయిరువురుం జతపడుదురేని కృతివిమర్శనోప సంఘ ప్రతిష్ఠాపనాశయును ద్రాక్షాలత నిష్ఫలమేగాని సఫలముగా నేరదు. చిలు కకు తనముద్దేగాని యెదుటిముద్దెఱుఁగదు నావినమే? ఒరులమాట యేటికి. ఆయిరువురలోనే యాంధ్రగ్రంథవిమర్శనాధి కారమునకు మేమేయర్హు లముగాక యన్యులుగారని వారివారి యభిప్రాయముండఁబోలును. కాన వీరిని మానఁజాలమేలు.'

... ... ...

ఆంధ్రపండితులారా, ఆంధ్ర భాషాభిమానులారా!......... మేము మీకు నివేదించిన యీవిషయములనెల్ల మీరు చక్కఁగవిచారించి పూర్వోక్తప్రకారము సంఘమును సంస్కరింతురుగాత.

ఇట్లు పండితజనవిధేయులు.
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
కోపూరు సుబ్బరామయ్య
గుండ్లపూడి సుబ్బయ్య
సి. దొరస్వామయ్య.

ఈవిధముగా నాంధ్రకవిపండితసంఘము తుదముట్టెను. శాస్త్రులవారు మరల తమ బొందిలో నూపిరియుండఁగా నీ సంఘము లేఁదని వచించిరి. ఆవెనుక శాస్త్రులవారు వీరిలో రఘునాథపురం వెంకటసుబ్బయ్యగారును మఱియొకరును ప్రకటించిన కాళహస్తిమాహాత్మ్య ముద్రణమును విమర్శించి దానిని శారదాకాంచిక తృతీయకింకిణియని పేర్కొనిరి. 1900 సం. పాత్రోచితభాష ఆవశ్యకమని సంస్కృతాంధ్రగ్రంథములనుండి ఆధారములు చూపి 'గ్రామ్యభాషా ప్రయోగనిబంధనము'ను రచించి శారదాకాంచిక నాలుగవకింకిణిగా ప్రకటించిరి.

తమ పాండిత్యాతిశయములను సమకాలికులు గ్రహింపలేదనియో లేక నిరంతరము తమ్ము దూషించువారికి దెబ్బగానో ఏకారణముచేతనో శాస్త్రులవారు ప్రతాపరుద్రీయములో నటిచే నీపద్యముం జెప్పించిరి.

ఉ. అంకెకుఁదార్చె నేరసికు నంగలభారతి ప్రౌఢనీతి, నా
కింకిరి నాంధ్రి ద్రావిడియుఁ గేరుచు వైవియుఁ గూడిరెవ్వనిన్,
జంకు కళంకు లేనికవిచంద్రుఁడు తోషితకోవిదేంద్రుఁ డా
వేంకటరాయశాస్త్రికృతి వెంగలిమూఁక కెఱుంగ శక్యమే?

ఇంతవఱకును తమ జీవితములో జరిగిన విశేషముల నెల్ల శాస్త్రులవారు తమ యుషానాటకమున నీక్రిందిపద్యమున మనోహరముగా వర్ణించినారు.

సీ. ఛాత్రసాహస్రప్రచారంబుగా నాట
కములుఁ దన్నిగమంబుఁ గఱపినారు,
సర్వజ్ఞసింగమ సార్వభౌముని గద్దె
యెక్కిన దొరమది కెక్కినారు,
హూణరూపకరసం బుదరంబునిండారఁ
ద్రావిగట్టునఁ ద్రేఁచి తనిసినారు,
టాటోటుగవులు పటాపంచలై మాయఁ
గాంచిక వాణి కర్పించినారు,
బళ్లారిభవ కవిపండితసంఘంబు
మదరాసులో రూపుమాపినారు,

తే. కాళిదాసుశకుంతల నేలినారు,
మించిన ప్రతాపకృతిని నిర్మించినారు,
తగదొకో శాస్త్రిగారి గ్రంథమును గోర
మహితవస్తుపరాయణమానసులకు.

---

## ౧౩-ప్రకరణము

### ఆంధ్ర భాషాభిమాని సమాజము.

ఆంధ్ర నాటకరంగమును అభివృద్ధికిఁ దెచ్చుటకు అత్యుత్తమకృషి గావించినవారు మన శాస్త్రులవారే. శ్రీ శాస్త్రులవారి జీవితము భాషాసేవకే అర్పితము. అందొకభాగము మొదటి నుండియు భరతసూత్రానుసారులగు నాటక ప్రయోగములకే ధారవోయఁబడినది. శాస్త్రులవారు దాదాపు ముప్పదిసంవత్సరములు సంస్కృతాంధ్ర నాటకములను తమశిష్యులకు తాము స్వయముగా నేర్పి ప్రదర్శింపించుచుండిరి. క్రిశ్చియన్కాలేజిలో ప్రవేశించిన కొలఁది దినములకే సంస్కృతాంధ్ర నాటకములను తమ విద్యార్థులచేత నాడింపించుటకు మొదలిడిరి. మదరాసులోని సంస్కృతవిద్వాంసులు, సుప్రసిద్ధన్యాయవాదులును బహుగీర్వాణనాటకకర్తలును నైన శ్రీ టి. ఎస్. నారాయణ శాస్త్రిగారి వంటి వారనేకులు మనశాస్త్రులవారి శిష్యులై ఈ నాటకములలో పాల్గొని పాత్రధారణమొనర్చుచుండువారు. కాలేజిలో ప్రతి సంవత్సరాంతము ఆయాసంవత్సరము చదివిన నాటకము నాడుట ఆచారమై యుండెను.

ఇతరులచే ప్రదర్శింపించుట కసాధ్యమైన కష్టతరనాటకములను సయితము శాస్త్రులవారు జనరంజకములం గావించుచుండిరి. ఉత్తరరామ చరిత్రనాటకమును ఎల్లవారును ప్రదర్శనీయముకాదని వదలివేయుచుండిరి. దీనిని శాస్త్రులవారు ప్రదర్శింపించినారు. వారే తను యుత్తరరామచరిత్రయొక్క యుపో

ఘాతమున నిట్లు వ్రాసియున్నారు. "ఈలోకోత్తరనాటకము శ్రవ్య ప్రబంధముగా రంజించునేగాని దృశ్యముగా రంజింపఁ దని పాశ్చాత్య సంస్కృతపండితులును నూతనమతప్రియులగు నస్మదీయులే కతిపయులును పలికిరి. కాని ఇది దృశ్యముగా నత్యంత రంజకమగు నని ఆబాల్యము నాతలంపుగానుండెను. మదరాసు కృస్టియన్కాలేజి సంస్కృతప్రధాన పండితుఁడ నైనంతట బి. ఏ, పరీక్షకు ఉత్తరరామచరిత్ర పఠనీయము కాఁగా నాశిష్యులకుం బై మతభేదమును నామతమునుం దెలిపి తదీయస్థాపనార్థము వారిచేత ఈనాటకమును మదరాసు పౌర సౌధములో ఆడించి, ఇది రంగమందు అత్యంతరంజకంబనియు, అతి శాకుంతలమనియు క్రిక్కిఱిసిన వేవురు రసికవిద్వజ్జనులకు ప్రత్యక్షముం గావించినాఁడను. ఆ ప్రయోగముజరిగి ఇప్పటికి (1920 నాటికి) ముప్పది సంవత్సరములయినను ఆ శంబూకదివ్య పురుషుని నామస్తుత్యాది పద్యంబులు ఇప్పటికిని నావీనులలో అనురణనముం గావించుచునేయున్నవి. సీతాదిసకలపాత్రము లును వారివారి చర్యలును కన్నులయెదుర ఇప్పటికిని మెలఁగు చున్నవి. అనంతరము ఎన్ని నాటకములు చూచినను ఈవిధ ముగా డెందము కు బందిగొన్నట్టిది లేదు." అని

శాస్త్రులవారి శిష్యకోటిలోనివారు కొందఱు నెల్లూర నౌకసంఘముగా చేరి ఆంధ్రగీర్వాణ నాటకములను శాస్త్రుల వారికడనేర్చి ప్రదర్శింపఁదలంచియుండిరి. వారి యీయుద్దేశము నెఱింగి శ్రీయుత పూండ్ల రామకృష్ణయ్యగారును, శ్రీయుత

గునుపాటి ఏనాదిరెడ్డిగారును, మఱికొందఱు నెల్లూరి పెద్ద లునుచేరి ఆంధ్రభాషాభిమాని సమాజమును ౧౮౯౯ సం. ప్రాంతమున స్థాపించిరి. పూండ్ల రామకృష్ణయ్యగా రొక కార్డులో వేంకటరాయశాస్త్రులవారి కిట్లు వ్రాసిరి.

ఆర్యా, నమస్కారములు. తే 1-5-'99 నెల్లూరు.

సంఘము నిన్నటిదినమున నేర్పాటైనది. పదముగ్గురు వచ్చిరి. ఇంకను రాఁగల యాదిత్యవారమునకు మఱికొందఱుఁ జేరగలరు ఇపుడు పరగ్రామములకుఁ బోయియున్నారు. "ఆంధ్ర భాషాభిమాని సమాజము" అని పేరిడినారు....

విధేయుఁడు

పూండ్ల రామకృష్ణయ్య.

ఆర్యా, నమస్కారములు. 8-2-1900 నెల్లూరు.

...ఉష నేమిచేసినారు. హనుమంతరావు రామానుజా చారి మొదలగువా రచ్చటికే వత్తురు. శ్రీనివాసఁ మార్చి నెలలోఁ జేరును. అందఱును మీదృష్టిపథమున నేయుందురు. బహుశ్రద్ధతోనున్నారు......ఏనాదిరెడ్డికిని నొకజాబు వ్రాసి నాను.

పూ. రా.

నెల్లూరు. 22-5-1900

బ్రహ్మశ్రీ మహారాజశ్రీ వేదం వేంకటరాయశాస్త్రుల వారి సముఖమునకు పూండ్ల రామకృష్ణయ్య అనేకసాష్టాంగ

నమస్కారములుచేసి చేయంగలవిన్నపములు — ......
ఇచ్చట మననాటకసభవారు శాకుంతలమును యించుమించుగా పూర్తిచేసి యుపకు చూచుచున్నారు. రెండునాటకములు వేసినగాని ఖర్చులు కట్టిరావనియు నుప క్రొత్తదిగానుండుట చేత కొంత లోకరంజకముగా నుండుననియు వారి యభిప్రాయము ...... మీరు యెప్పుడు వత్తురో దానిని వ్రాయవలయును ...

పూ. రా.

వేంకటరాయశాస్త్రులవారు సర్వాధ్యక్షులుగా రామకృష్ణయ్యగారు ప్రారంభించిన యాంధ్రభాషాభిమాని సమాజము ఇరువది యైదేండ్లు చక్కగాజరిగినది. శాస్త్రులవారు సమాజమువారి ద్రవ్యవిషయమునందుమాత్రము ప్రవేశించువారు కారు. ఈసమాజమువారు శ్రీ శాస్త్రులవారి నాటకములందప్పనితరాంధ్రనాటకములను ప్రదర్శింపరాదనియు, ఇతరుల నాటకములు నాటకములే కావనియు, శాస్త్రులవారికడ సంపూర్ణముగా శిక్షనొంది, ఒద్దికలుకుదిరినవని శాస్త్రులవారు తలంచువరకును నాటకములం బ్రయోగింపరాదనియు కట్టుదిట్టములతో సమాజమును జరుపసాగిరి.

శాస్త్రులవారును ప్రతిసంవత్సరమును వేసవికాలము సెలవులలో నెల్లూరికేగి తమశిష్యులకు తాము స్వయముగా నేర్పి ప్రదర్శింపించుచుండిరి.



౧౪-ప్రకరణము.

## పితృ మిత్ర వియోగము.

శాస్త్రులవారికి చిరకాలమువరకు పరీక్షాధికారము రాలేదు. ఎవరెవరో అడ్డుతగులుచుండిరి తుదకు 1900 సం. మున నాంధ్రమునకు పరీక్షకులైరి. పూ. రామకృష్ణయ్యగారు ఒకజాబులో తమసంతసము నిట్లు వెలిబుచ్చిరి.

తమయెగ్జామినరుషిప్పు విషయమై యిచ్చట మేమొక పబిలికుమీటింగు చేయవలయునని యెంచి కొంతపనియుచేసి యుంటిమిగాని గజటులో అది ప్రకటింపఁబడు నంతదనుక యేమిచేయుటకును వలనుపడదని తొందరనినందున నిలిపించి నారము. అది యెప్పుడు బయటపడును? యీమహాయుద్ధములో మిమ్మునాంధ్రమునకే యేర్పాటుచేయుట కొంత సుగుణమని యు విమతులకు శృంగభంగమనియు తలచెద. ఇచట మాకందరికి తమకు యగ్జామినరగుట బ్రహ్మానందముగా నున్నది......... చిత్తగించవలయును.

ఇట్లు విధేయుఁడు

పూండ్ల రామకృష్ణయ్య.

కవిపండితసభ కగ్రాసనాధిపత్యము వహించినవారు శ్రీ శేషగిరిశాస్త్రిగారు 'అష్టాదశ భాషాలక్ష్యలక్షణాభిజ్ఞ సార్వభౌములు ప్రెసిడెన్సీకాలేజీ సంస్కృత మహోపాధ్యాయులు, ప్రాక్తనఫైలాలజీ ప్రథమ ప్రవర్తకులు' వేంకట

రాయశాస్త్రులవారికి వారి పాండిత్యము కతంబున పరమ మిత్రులైరి. మదరాసులో వీరిరువురును ప్రతి సాయంకాలమును కలసికొనుచుండెడివారు; సకల విద్యావిషయములందును సంప్రతించుకొనుచుండెడివారు. వేంకటరాయశాస్త్రులవారిని తను పుదూరు ద్రావిడసంఘమునకు చెందినవారనియేగాక (శేషగిరిశాస్త్రులవారును పుదూరు ద్రావిడులు) ముఖ్యముగా వారిపాండిత్యముపై నభిమానముంచి వారిగ్రంథములను పాఠ్యములగునట్లు ప్రయత్నించుచుండు వారు. నాగానందనాటకమును పాఠ్యముగా వీరి ప్రోత్సాహము చేతనే పెట్టినారు; పరీక్షాధికారమును వీరివలన వచ్చినదే "శ్రీమంతులు అష్టాదశ భాషాధురంధరులునగు ప్రొఫెసరు శేషగిరిశాస్త్రిలవారు నన్ను ఎఱుకచేసికొని నాకు మిత్త్రిధేయమై తామునగా యత్నించియు, శ్రీ మిల్లరుదొరగారిని హెచ్చరించియు యూనివర్సిటీ పరీక్షాధికారమును నాకు ఇప్పించినారు"*

వెనుక శాస్త్రిలవారొకసంవత్సరము తమిళమునకు పరీక్షకులైరిగాని తమిళముపై నభిమానములేనందున దానిని మానుకొనిరి. తర్వాత బహుకాలము తర్క వేదాంతమన స్తత్వ శాస్త్రాదికములకు పరీక్షకులుగానుండిరి. కళాశాలలో కొంతకాలము పై శాస్త్రములను బోధించుచునుండిరి.

ఈకాలముననే (1900 సం) శాస్త్రిలవారితండ్రిగారు వేంకటరమణశాస్త్రులవారు నిర్యాణముందెందిరి. శాస్త్రులవారికి తండ్రిగారిమరణము హృదయమున ఆరని వ్రణముంగావించి

*శ్రీ వేంకటగిరిరాజాగారికి శాస్త్రిలవారు వ్రాసినజాబునుండి.

నది. బాల్యమున వారికడ తామేమియు పఠింపకపోయినను ఆకొఱంతను తీర్చుకొనునట్లు తామేచదువుకొనిరి. తండ్రిగారి శ్లాఘనందిరి. శాస్త్రిలవారి స్త్రీపునర్వివాహ దుర్వాదనిర్వాపణమును వారు కని శాస్త్రిలవారి తమ్ములతో 'మీయన్న చక్కగానే వ్రాశాడోయి' అని చెప్పునఱకు శాస్త్రిలవారికి తృప్తి కలుగలేదు. అట్లే ప్రతాపరుద్రీయమునుగని తండ్రిగారు హర్షించినందులకు శాస్త్రిలవారు లోకము హర్షించినదానికన్న నెక్కుడుగా నానందించిరి. మనశాస్త్రిలవారికిని వారి తండ్రిగారికిని జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములలో కొన్నిజాబులు సంస్కృతమునందే గలవు.

శాస్త్రిలవారు ఈదెబ్బనుండి కొంచెముకొంచెము తేరుకొనుచుండఁగా వారియాప్తమిత్రులు శేషగిరిశాస్త్రిలవారు హఠాత్తుగా, వారముదినముల జ్వరముచే, తమ 52 యేట, పరమపదించిరి. ఇది వేంకటరాయశాస్త్రిలవారికి పిడుగుదెబ్బగా తగిలినది. అప్పుడు వారు 'సిద్ధసుధాప్రవాహము'ను ఉపనాటకమును స్వతంత్రరూపకమును రచించుచుండిరి. ముద్రితమైన వెంటనే దానిని శ్రీ శేషగిరిశాస్త్రిలవారి కీర్తి మూర్తి కంకితము గావించిరి. శ్రీయుత శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలవారును (నేఁడు మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు) తమ గౌతమీమాహాత్మ్యమును వారి కంకితమొనర్చిరి.

శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారును ఎక్కుడుకాలము జీవింపలేదు.



Prof: T. M. Seshagiri Sastry, M.A.

ఆర్యా, నమస్కారములు. తే 22-3-'02 నెల్లూరు.

......నేనురోగినై నాఁడను. దూరమునడువలేను. ఎండ సోకఁగూడదు. ఎట్లుజీవించఁగలనో దిగులుగానున్నది: రాజైశ్వర్యములు వలసియున్నవి. ఆర్జనసున్న....కుదురుపాటు చిక్కలేదు. చిత్తచాంచల్యము మెండుగానున్నది. ఇందుచేఁ బక్షవాయువు వచ్చునట్లు తోఁచుచున్నది ఏదివచ్చినను ననుభవింపక తీరదుగదా. విశేషములులేవు. మీావిధేయుఁడు

పూండ్ల రామకృష్ణయ్య.

శాస్త్రులవారికి వీరువ్రాసినజాబులు దాదాపు రెండువందలు. వానిలో కడపటిది 30-4-'03 తారీఖున వ్రాయబడినది. తర్వాత జాబులేదు. పూండ్ల రామకృష్ణయ్యగారు శాస్త్రులవారికి ఆప్తమిత్రులై తమపత్రికను వారిపత్రికగానే జరిపి అనుక్షణము సలహాలను పొందుచుండినవారు. ఆంధ్రకవిపండితసంఘ సమరమున శాస్త్రులవారికి తోఁడునీడగానుండిరి. పెక్కు అముద్రితగ్రంథములను చక్కఁగా సంస్కరించి బహుగ్రంథ పరామర్శ పూర్వకములైన విపుల మర్శలతో ముద్రింపించిరి. 1904 సం. సెప్టెంబరు 1 తేదినాఁడు నెల్లూరఁ, స్వర్గస్థులైరి. అముద్రిత గ్రంథచింతామణియు నిలిచిపోయినది.

ఆప్తమిత్రునిమరణము శాస్త్రులవారికి చాలహృదయావేదనకు కారణమైనది. కాలము గడువసాగినది. శాస్త్రులవారును ఐహికచింతలం మఱచుటకై గ్రంథపఠన రచనలలో మునిఁగిపోయిరి.

---

## ౧౫-ప్రకరణము

## క్రిశ్చియన్కాలేజి సంస్కృతపండితపదవినుండి విరామము.

శ్రీ శాస్త్రులవారు మదరాసు క్రైస్తవకళాశాలలో సంస్కృత ప్రధానపండితులుగాను, శ్రీ సమర్థి రంగయసెట్టిగారి మరణానంతరము కాలేజిలో ప్రాచ్యభాషా ప్రవచనాధ్యక్షులుగాను (Superintendent of Vernacular studies), దాదాపు ఇరువదినాలుగు సంవత్సరములుండి 1910 సంవత్సరమున జనవరి నెలలో విరమించిరి. ఈ ఇరువదినాలుగు సంవత్సరములలోను మదరాసు రాజధానిలో సుప్రసిద్ధు లెందరో వారికడ సంస్కృత మభ్యసించిరి. శాస్త్రులవారు మొదట మొదట కళాశాల ప్రవేశించినకాలమున, మా నెల్లూరునగర న్యాయవాది శిఖామణులలో నొకరును చరిత్రపరిశోధకులు నగు శ్రీ వంగవోలు వేంకటరంగయ్య పంతులవారు ఆకళాశాలలో నింటర్మీడియేటు మొదటితరగతియందు చదువుచుండిరి. శాస్త్రిలవారు వచ్చినవెంటనే శుక్రనీతి మొదలైన పలు విషయములంగూర్చి చెప్పవలసివచ్చినదట. తరగతికి వలసిన విషయములను పూర్వపరిశోధనలేకయే శాస్త్రిలవారు, చాల సులువుగా, ఆయాగ్రంథభాగములను, తమకు ముందే కంఠస్థములైనవానింబోలె చెప్పుచు విద్యార్థులకు తొలిదినముననే తమయందు ఆశ్చర్యగౌరవములం గలిగించిరని శ్రీ పంతులవారే నాకుచెప్పియున్నారు. అప్పటికే శాస్త్రిలవారికి గీర్వాణ వాఙ్మయమున పెక్కువిషయములు కంఠస్థములు. కళాశాలలో

ఆంధ్రులు ద్రావిడులు కర్ణాటకులు కేరళీయులు, హిందువులు మహమ్మదీయులు క్రైస్తవులును సంస్కృతవిద్యార్థులుగా నుండిరి. శాస్త్రిలవారు ఆంగ్లమున పాఠ్యములను వివరించుచుండిరి. శాస్త్రిలవారు బి. ఏ. పూర్తిచేసిరో లేదుగాని ఆంగ్లమున మంచిపాండిత్యము నార్జించిరి.

శాస్త్రిలవారికడ విద్యార్థులుగానుండి అనంతరము ప్రసిద్ధికివచ్చినవారు-శ్రీ జగన్నాథపురి శంకరాచార్యస్వాములవారైన భారతీ కృష్ణతీర్థులు (పూర్వాశ్రమమున వేంకటరమణ సరస్వతి యని ప్రసిద్ధులు), మైసూరులో దివానుగానుండిన రాజబంధువు శ్రీ లేటు కాంతరాజఅరస్ గారు, కీ. శే. శ్రీ సత్యమూర్తిగారు, శ్రీయుత నాగేశ్వరరావు పంతులుగారు, మా పుదూరు ద్రావిడసంఘమునకు చూడామణులు దివాన్ బహదూర్., సర్., అల్లాడి కృష్ణస్వామిగారు, మద్రాసు విశ్వవిద్యాలయ చరిత్రాచార్యులు శ్రీ కే. ఏ. నీలకంఠశాస్త్రిలవారు, ప్రస్తుతము భరత్పూరు దివానుగారైన శ్రీ వీ. వి. రామనాథన్ గారు, ఇంక ననేకులు.

కళాశాలలో నున్నంతకాలము ఆంగ్లేయులు ప్రొఫెసర్లేమి, ఇతరాధ్యాపకులేమి శాస్త్రిలవారియందు గౌరవప్రపత్తులతో మెలఁగిరి. శాస్త్రిలవారు తమవిధిని అసడ్డచేసి యెఱుఁగరు. ప్రిన్సిపాలు మొదలగు నధికారులకు ఒగ్గితగ్గి తిరుగలేదు.

ఒకదినము విస్తారము వర్షముకురియుచుండెను. శాస్త్రులవారు ఒక పెట్టెలో వస్త్రాదికములుంచుకొని, ఈకువు ధరించి

జోరువర్షములో గొడుగున్నను, తడిసి, కళాశాలచేరి, ఆ తడిసిన దుస్తునుతీసి, పెట్టెనుండి వేఱుదుస్తుధరించి తరగతికి పోయిరి. ఆదినము అనేకులు అధ్యాపకులు రాలేదు.

ప్రిన్సిపాలుగారు, దొర, శాస్త్రిలవారితో నిట్లనెను. "శాస్త్రిగారూ, చూచారా, ఏవిధంగా వర్షం కురుస్తున్నదో! ఫలానివారు రాలేదు. వారిపనికూడా తాము చూడగలరా." శాస్త్రిలవారికి నాఁడు విస్తారము పనియుండెను. పైగా శాస్త్రిలవారికే ఎక్కువపని తగులుచుండెను. అధికారులకును ఇతరాధ్యాపకులయందు పక్షపాతముండినది. వెంటనే శాస్త్రులవారు "వర్షమే ఒకకారణంగా తాము భావించే పక్షములో నేనుకూడా రాక ఇంటనే ఉండునే" అని బదులుపలికిరి.

ప్రిన్సిపాలుదొరకు బదులుచెప్పుటకు ఏమియు తోఁచలేదు. 'సరే, శాస్త్రులవారూ, అయితే మీపని మీరుచూచుకొండి.' అనెను.

శాస్త్రులవారు తమపనికి తాము పోయిరి.

వేసవికాలమున నొకదినమున తరగతిలో విద్యార్థియొకఁడు, శాస్త్రులవారు పాఠముచెప్పుచుండఁగా నిద్రఁబోవుచుండెను. దొర ఎచటినుండియోవచ్చి, శాస్త్రులవారి యనుమతిలేకయే వారిగదిఁజొచ్చి, ఆవిద్యార్థినిలేపి, శాస్త్రులవారిని చూచి Do you allow the boys to sleep in the class? అని యడిగెను. (విద్యార్థులను తరగతిలోనే నిద్రఁబోనిచ్చెదవా? అని యర్థము.)

శాస్త్రులవారికి కోపమువచ్చినది. తరగతిలో తాము పాఠము చెప్పునప్పుడు తమ యనుజ్ఞ లేకయే లోన ప్రవేశించుట మర్యాదగాదు. వెంటనే వారు 'I do my duty' (నేను నాధర్మమును నెఱవేర్చుచున్నాను). అని బదులిచ్చిరి.

ఈదెబ్బకు ఏమి బదులు చెప్పుటకును తోచక దొర వెడలిపోయెను.

కళాశాలలోని యధ్యాపకులలో నొకరు దూషణగా నేదో యొక పురాణాంతర్గత విషయమును చెప్పనారంభించి, సరిగా తెలియక, తుదకు 'Here the rascality is...' అని చెప్పనారంభించెను. శాస్త్రులవారు వెంటనే Keep it to yourself అని బదులిడిరి. అచ్చట నుండినవా రందఱును గొల్లున నవ్విరి. ఆక్షేపకుఁడు మఱి మాటాడలేకపోయెను.

విద్యార్థులకు శాస్త్రులవారియందు గౌరవమును ప్రేమయు నుండినవి. మైసూరులో రెండవమంత్రిగానుండి ప్రస్తుతము భరత పురమునకు దివానుగానున్న శ్రీ ఏ. వి. రామనాథన్‌గారు, 1938 సం. జనవరి 13 తేది జరిగిన క్రైస్తవకళాశాలా పురాణ శాలసంఘ సమావేశమునాఁడు ఇట్లు నుడివిరి. "The great Andhra patriot and scholar, Vedam Venkataraya Sastriar, was not only an erudite Sanskrit teacher, but a great friend and GURU to every student. He instilled in us a genuine love of Sanskrit and an appreciation of the beautiful and the lofty in our ancient literature."

శాస్త్రులవారు తరగతిలో పాఠము చెప్పునప్పుడు విద్యార్థులు తదేకతానులై పాఠము గ్రహించువారు. శాస్త్రులవారు ఒకమారు చెప్పినది మరల చెప్పరు. విద్యార్థులు గట్టిగా చెప్పుఁడని యఱచినచో మఱింత మెల్లగా చెప్పువారు. తరగతిలో నుండు నంతసేపు వారనిన విద్యార్థులకు భయము. ఇవలికివచ్చిన చాల చనువుగానుండువారు. వారు మధ్యాహ్నము తెచ్చుకొను కాఫీలను వారితోకూడ విద్యార్థులును గ్రహించువారు. మందమతులను వారివారి చిత్తవృత్తుల కనుగుణముగాబోధించి పైకి తెచ్చుచుండిరి. శిష్యులను లాలించుటలో నగ్రగణ్యులు. కళాశాలలలో విద్యార్థులు సమ్మెకట్టుట పరిపాటి. క్రైస్తవకళాశాలలో వారిదినములలో నెట్టి విద్యార్థులసమ్మెయైనను శాస్త్రులవారు క్షణము సంభాషించినచో మరల నావిద్యార్థులు తరగతులకువచ్చి చదువుకొనవలసినదే. అట్టి సన్నివేశములలో దొర శాస్త్రులవారినే నియోగించుచుండువాఁడు. కళాశాలను వదలిన యనంతరము సయితము విద్యార్థులు వారిని విశేషముగా నాశ్రయించుచుండువారు. వారితో చెలిమిచేసి వదలిపోయిన వారులేరు. ఇతర కళాశాలలలోనుండి విద్యార్థులు సంస్కృతమునకును శాస్త్రులవారి బోధనుపొందుటకును వారి కళాశాలకే వచ్చుచుండువారు. శాస్త్రులవా రుండిన యీ యిరువది నాలుగు సంవత్సరములలో నొక మహమ్మదీయవిద్యార్థి యొక్కఁడే వీరికళాశాలను వదలిపోయినవాఁడు. ఆతనిని ప్రిన్సిపాలు, మిల్లరు దొరగారు "సంస్కృత విద్యార్థు లందఱును,

ఎచటెచటినుండియో మాకళాశాలకు వెదకుకొని వచ్చుచుండఁగా, నీవేల మాకళాశాలనువదలి పోవుచున్నావు'' అని యడిగెను. అందుల కాతఁడేమియు సమాధానము చెప్పలేకపోయెను.

శాస్త్రిలవారికి ఎక్కుడుపని తగులుచుండెడిది. ఆవిషయమును తెలుపుటకై వారు అప్పుడప్పుడు ఇట్లడుగువారు. Who is the only christian in our college ? అని. అందులకు విద్యార్థులు మిల్లరనియు, కాక మఱియొకరనియు చెప్పువారు. శాస్త్రిలవారు 'No ! It is myself. I live by the sweat of my brow.' అని బదులుచెప్పువారు. మధ్యాహ్నము కార్యాధిక్యముచే వారిమొగమంతయు చెమటచే నిండిపోయెడిది.

శాస్త్రిలవారు సంస్కృతనాటకములను పాఠముచెప్పునప్పుడు ఆయాసంవత్సరము విద్యార్థులకు పాఠ్యమైన షేక్స్పియరు నాటకముతో దానినిపోల్చి ప్రాచ్యపాశ్చాత్య రూపకసామాన్యలక్షణములను బోధించువారు. ఒకప్పుడు విద్యార్థులు మిల్లరు దొరవారి తరగతిలో ఈవిషయములే వచ్చునట్లు ప్రశ్నించిరఁట. మిల్లరు ఆశ్చర్యపడి ఈప్రశ్నలను ఎవరు నేర్పిరని యడిగి శాస్త్రిలవారని తెలిసికొని 'అవును ఆయన గొప్ప సంస్కృతపండితుఁడు' అనిచెప్పెను,

శాస్త్రిలవారికి ఈనౌకరిలో పెన్షనురాదు. కళాశాలవారు మొత్తముగా కొంతద్రవ్యమొసంగు నేర్పాట్లేవో చేసియుండిరి. శాస్త్రిలవారికి సంస్కృతాంధ్ర గ్రంథములను పెక్కింటినిశోధించి ముద్రింపవలయునని కోర్కెయునుండినది.

మరల నచ్చాఫీసును ప్రారంభించుటకై తమకు పరీక్షకాధికార ములచేత నేర్పడిన ద్రవ్యములనుచేర్చి దాదాపు మూఁడువేల రూప్యములను ఆర్బత్ నేటుబ్యాంకిలో వేసియుండిరి. ఈ డబ్బున్నదను ధైర్యముతో అచ్చాఫీసు ప్రారంభింపఁదలంచి ఒకప్పుడు తాముద్యోగమును వదలుకొనెదమని తమ ప్రిన్సిపాలుతో చెప్పఁగా నాతఁడు అంతగొప్ప సంస్కృతపండితుఁడు మరల తమకు దొరకఁడనియు, శాస్త్రులవారిని అంతత్వరగా పంపివేయుట తమకిష్టములేదనియు ఇంకను కొంతకాలముండ వలసినదనియు కోరిరి. శాస్త్రులవారు రాజీనామా కొసంగెద మని ఎంతచెప్పినను దొరలు ఒప్పుకొనలేదు. ఆదినము సాయంకాలము శాస్త్రులవారు ఇంటికి వచ్చుచు మార్గమున ఆర్బతు నేటుబ్యాంకి మునిఁగిపోయినదని తెలిసికొనిరి. రాజీనామాను దొరలొప్పుకొనకపోయినది మంచిదే యైనదనితలంచి కొంత కాలము ఆపనియందే యుండిరి.



## ౧౬-ప్రకరణము.

## మరల జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల.

శాస్త్రులవారు కాళిదాసుని మేఘసందేశమునకు పద ప్రయోజనికయను వ్యాఖ్యను రచించి ౧౯౦౭ సం. మే లో ప్రకటించిరి ఇయ్యది మల్లినాథవ్యాఖ్యతోను పెక్కు ఆక్షేపములకు సమాధానములతోను, ఎల్లవారును ఉపాధ్యాయ నిరపేక్షముగా చదువుకొనుట కనుకూలముగా ముద్రింపబడి ఆంధ్రదేశమున ప్రచారమునందున్నది. ఇదేవిధముగ టీకలతో సంస్కృతాంధ్ర గ్రంథములను ముద్రించుటకు అచ్చాపీసు లేనిచో జరుగదని, ఎట్లో ద్రవ్యమును గూర్చుకొని జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను తిరుగ 1908 సం, అక్టోబరు నెలలో ప్రారంభించిరి. ఒకవైపు అచ్చాపీసు జరుపుచు నింకొకవైపు కళాశాలయుద్యోగమును నిర్వహించుచు రెండేండ్లు గడపి 1910 సం. కళాశాలనుండి విరమించుకొని అచ్చాపీసునే జరుపుకొనసాగిరి. ఈవిధముగా ప్రకటనంగావించిరి ——

"హిందువులకెల్ల నైహికాముష్మిక సర్వశ్రేయః ప్రదయగు సంస్కృతభాష వారిచేత ఈకాలమందు ఉపేక్షితప్రాయయు తిరస్కృతప్రాయయునై జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లండు, రష్యా, యూనైటెడ్ స్టేట్స్, జపాను, లోనగు దేశాంతర ఖండాంతర ద్వీపాంతరములకు వలసపోయినవిషయము జగద్విదితముగదా. మనదేవతలభాషయు మనకర్మభాషయు మన

'యెల్లభాషలకుం దల్లి'యు నగు నీసరస్వతిని వెండియుం దెచ్చి కొని హృదయాలయములందు ప్రతిష్ఠించికొని యుపాసించి తత్ప్రసాదంబున సంస్కృతభాషలో కావ్యనాటక కథాప్రబంధంబుల రసంబును ధర్మయోగ పురాణేతిహాస వేదవేదాంతాది విషయంబులను గ్రహించి సర్వశ్రేయంబులం బొందం గోరిక, ఇతర విద్యాభ్యాస ప్రయాసచే బాల్యమందు ఈవిద్యను నేర్వని సజ్జనులకు పలువురకు చిత్తమందు ఉదయించుచున్నది. కాని, అట్టివారికి అనేకులకు ఉపాధ్యాయులు దొరకమిం జేసి ఈ యభీష్టము నెఱవేఱకయున్నది మఱియు నిపుడు హూణాది భాషాంతర ప్రసిద్ధ విద్యాకలావిశేషములనేమి స్వతంత్రకావ్య నాటకాది గ్రంథములనేమి ఆంధ్రంబున రచియింప ననేకులు కోరుదురు. వారి యుద్యమములకును సంస్కృతపరిచయము ఆవశ్యకముగదా. అట్టివారికొఱకును కేవల బాలురకొఱకును ఉపాధ్యాయునితోఁ బని లేకుండ స్వయంబోధకములుగా పెక్కు సంస్కృతగ్రంథములను, తెనుఁగున, టిప్పణముతో కొన్నిటిని, సంపూర్ణటీకతో కొన్నిటిని, ప్రకటించియు ప్రకటించుచును ఉన్నాఁడను. కారణ విశేషములచే నడుగంటుచున్న మన భాషలకొఱకై యీ యుద్యమమని విన్నవించుచున్నాఁడను."

వేదము వేంకటరాయశాస్త్రి.

ఈమాఱు శాస్త్రులవారు మునుపటివలెగాక పెక్కు గ్రంథములను ముద్రింపఁగల్గిరి. ౧౯౧౦ సం., అమరుకావ్య, పుష్పబాణవిలాస, రసమంజరులను తెనుఁగు సంపూర్ణటీక

తోను, భర్తృహరిశతకత్రయమును సంపూర్ణాంధ్రవ్యాఖ్యతోను తెనుఁగుపద్యములతోను ముద్రించిరి. రఘువంశ కుమారసంభవముల తొలి యాఱుసర్గలను తెనుఁగు టీకాతాత్పర్యాదులతో ముద్రించిరి. శాస్త్రులవారు ప్రకటించిన సంస్కృతగ్రంథములలో నొక విశేషముగలదు. ఉపాధ్యాయునితో పనిలేకయే నాటకాంతము సంస్కృతమందు సాహిత్య మలవరచుకొనవచ్చును. తొలుత అమరము శబ్దమంజరులను ముద్రించినారు. వీనిచే నొకపాటి యర్థజ్ఞానమును శబ్దజ్ఞానమును కలుగును. బిల్హణచరిత్ర ఏపాటి శబ్దజ్ఞానము కలవారైనను చదువవచ్చును. దీనికి లఘుటీకను శాస్త్రులవారు ముద్రించినారు. వెనుక చదువఁదగినవి రఘువంశ కుమారసంభవములు. వీనికి టీకాతాత్పర్యాదులు చేర్చినారు. ఆవెనుక మేఘసందేశము. ఇవిగాక భోజవిక్రమార్కచరిత్రములను పూర్వము ముద్రించినవానిని మరల టీకలతోముద్రించిరి. ఇవి సులువైన వచనగ్రంథములు. హితోపదేశ దశకుమారచరితములను తెనుఁగు తర్జుమాలతో ముద్రించిరి. తర్వాత నెవరిసాయమును లేకయే చదువఁగలుగు ప్రజ్ఞకలుగును గాన పంచతంత్రమును, మూలముమాత్రము, ముద్రించిరి. వెనుక రసమంజరీ అమరుకావ్యములు-శృంగారరసమయములు. నాటికలలో సులువైన ప్రియదర్శికను, ఒకపుటయందే ఒకవైపు అనువాదము, మఱియొకవైపు సంస్కృతమూలము, అడుగున నాటకలక్షణాది సకలవిషయంబులును తెలియునట్టివ్యాఖ్య, మొదలైనవానితో పుష్కలముగ ముద్రించిరి.

ఈ గ్రంథముల నన్నిటిని చదువునప్పటికి సంస్కృతమందు మంచి పాండిత్య మలవడును. విద్యార్థికి ఏ గ్రంథముగాని స్వయముగా చదివి గ్రహించుశక్తి యలవడును.

శాస్త్రులవారి సంస్కృతనాటకముల యనువాదములు మూలమునకు చేరువగానుండును కొన్నివిషయములలో నీ యాంధ్రీకరణములు మూలమునకు వ్యాఖ్యాప్రాయముగా నైతముండును. సంస్కృతనాటకముల నాంధ్రీకరించుటకు ముందుగా వానింబఠించి భిన్నదేశముల ప్రతులను తెప్పించి పాఠనిర్ణయముచేసికొని ఆవెనుక అనువదించుచుండిరి. ఈవిష యములంగూర్చి వారి విమర్శవినోదమను వ్యాసమునందు వివ రము చూడవచ్చును.

ఆంధ్ర గ్రంథములలో శాస్త్రులవారు పారిజాతాపహర ణము, బిల్హణీయము, గౌరనమంత్రి ప్రణీత హరిశ్చంద్ర ద్విపద, బాణాలశంభుదాసుఁడను విశ్వకర్మమతస్థుని సారంగధర ద్విపద, కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రమును ఈ సంవత్సరమే (1910) ప్రకటించిరి. పారిజాతాపహరణమున శాస్త్రులవారు కొన్ని సవరణలంగావించిరి. వానిని గ్రహించియే శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు దీనికి వ్యాఖ్యరచించి నారు. బిల్హణీయమున శాస్త్రులవారు ఒకటి రెండు పద్యములను తీసి ముద్రించినారు. "పుణ్యావిశేషలబ్ధ మృదుమధుర వాగ్వై భవంబున చేమకూర వేంకటపతి యమృతంపుఁ గూరగా రచి యించిన" సారంగధరచరిత్రను లఘుటీకతో శ్రీ శాస్త్రులవారు

౧౯౧౧ సం॥ ముద్రించినారు ఆపై నెలలోనే "అద్దములోని లిబ్బివలె రసికులకు నబ్బియు నబ్బని యర్థములచే నబ్బురమొసంగుచు, కాకలీగీతముంబోలె మధురంబయ్యు నస్ఫుటంబై, రసికగోష్ఠులయందు సందేహాంతచర్యలకుం గారణంబైన కాకిమొలకువలతో నిండి సంపూర్ణానుభవమునకు రాకయున్నట్టి రసోత్తర ప్రబంధమును" విజయవిలాసమును, ఎల్లవారికిని సుబోధంబుగా సటీకముగా ప్రకటించినారు. ఈ గ్రంథములను శాస్త్రులవారు ప్రకటించి నేటికి ముప్పదిరెండు సంవత్సరములైనవి. ఈలోపల పెక్కు తాళపత్రములును దొరకినవి చారిత్రకపరిశోధనయు జరిగినది. కాని ఇట్టి వ్యాఖ్యమాత్రము వెలువడలేదు.

ఈ జ్యోతిష్మతీముద్రాక్షరశాలలో శాస్త్రులవారి గ్రంథములేగాక ఇతరుల గ్రంథములును అచ్చగుచుండినవి. ఆంధ్రవిజ్ఞానచంద్రికామండలివారి గ్రంథములును, చన్నంవారి వైదికగ్రంథములును, రామా అండ్ కంపెనీవారి ప్రచురములును, ఇంకను అనేకుల గ్రంథములు అచ్చగుచుండినవి. వేంకటరాయశాస్త్రులవారును వారి కుమారులు వేంకటరమణయ్యగారు (రాజన్న)ను చూచుకొనుచుండుటచే గ్రంథములు సుందరములుగాను నిర్దుష్టములుగాను ముద్రితములగుచుండినవి. వేంకటరాయశాస్త్రిగారు నిరంతరము గ్రంథములు పఠించుచు, రచించుచు, ప్రూఫులు దిద్దుచును, వారికుమారులు అచ్చాపీసు వ్యవహారములను చూచుచునుండిరి.

## ౧౭-ప్రకరణము

## గ్రామ్యవాదము-గురుజాడ అప్పారావుగారి జాబులు.

ఇక్కాలమునకు సరిగా నాంధ్రదేశమున వ్యావహారిక భాషావాదము బయలుదేరినది. శ్రీ కీ. శే. గిడుగు రామమూర్తి పంతులవారు ఉపన్యాసము లీయసాగిరి. వీరికి శ్రీ కీ. శే. గురుజాడ అప్పారావుగారు సహాయులైరి.

వేంకటరాయశాస్త్రులవారు నూతనమార్గప్రియులే యైనను వ్యావహారిక భాషావాదమును ఎంతమాత్రమును ఒప్పుకొనలేదు. ఏమార్గమునుగాని స్థాపించుటకుగాని, తప్పించుటకుగాని సమర్థులును పాండిత్యమునందును వాదపటిమయందును ఎల్లవారిని మించియుండినందున వ్యావహారికవాదులకు మేరుపర్వతమువలె నడ్డుతగిలిరి. శాస్త్రులవారి నూతనమతము నొప్పుకొన్నచో నికదీనికి ఏ భయము లేదు. శాస్త్రులవా రొప్పనిచో వ్యావహారికభాషను సర్వజనాదరణీయముగా నొప్పించుటకు భగీరథప్రయత్నము చేయవలసియుండును. శాస్త్రులవారు తామే పద్ధతి నవలంబించినను నెగ్గించుకొను శక్తిగలవారు తమది క్రొత్తమార్గమే యైనను కొంత పూర్వసాంప్రదాయము ననుసరించియు ప్రమాణపూర్వకముగా నుండునట్లు చేయుస్వభావముకలవారు. ఆంధ్రవచనమున పూర్వమార్గమును తొలగించి సులువుగా వ్రాయసాగిరిగదా. నాటకములు లోకస్వభావము ననుసరించి యుండవలయునని పాత్రోచితభాషం దెచ్చి

నారు. గ్రామ్యరీతులను సయితము ప్రతాపరుద్రీయమున చూపి నారు. మఱి యీ క్రొత్తవాదమువచ్చినంతనే విసంధినిగూర్చి యొక యుపన్యాసమొసంగిరి. "సంహితఏకపదమందు నిత్యము (ఉ వనేన ఇచ్చెను) ధాతూపసర్గలకు నిత్యము (ఉ ఉపాస్తే అభ్యేతి); సమాసమందు నిత్యము (ఉ. రాజాజ్ఞ. ఇల్లాలు); వాక్యమందైననో వివక్షాధీనము (దధి అత్ర, పెరుగు ఇక్కడ). సంహితయనఁగా అర్ధమాత్రాకాలమాత్రవ్యవధానము, రెండక్షరములకు అర్ధమాత్రావ్యవధానము తప్పదు, తావన్మాత్ర వ్యవధానము సంహిత, అంతకన్న హెచ్చువ్యవధానము సంహితకాదు......విసంధి సహ్యముగాను సుఖముగాను ఉన్నది. అట్లే 'అతఁడు అప్పుడు అక్కడఉండెను' అను వాక్యమును సులువుగా నుచ్చరించిన సుఖముగానేయుండును" అని దానిసారము. అట్లే తమ గ్రంథములయందు విసంధిని పాటించిరి.

ఈకాలమున మదరాసునందును ఆంధ్రదేశమందు పలు తావులను గ్రామ్యదేశ నిరసనోపన్యాసములు జరుగుచుండినవి ఆసభలలో శ్రీ శాస్త్రులవారును అప్పారావుగారును కలసికొనుచుండెడివారు. పచ్చయప్ప కళాశాలాసౌధమున నొక సమావేశము జరిగినది. ఆవెంటనే శ్రీ గురుజాడ అప్పారావుగారు వేంకటరాయశాస్త్రులవారికి వ్రాసిన జాబు—

2nd June 1912.

*Dear and respected friend,*

I was very much gratified when you told me at the Madras conference that you went with

me a long way though you differed with me on some points. Though there may be difference of opinion on the practical solution of prose diction it would be impossible for us to differ on questions of authority. We go to the same original sources. That is why I admire you You generally exhaust any subject which you discuss. But I cannot say the same thing of Pandits generally. Judgments are, in their case, a matter purely of sentiment, and they do not take the trouble to examine the genuine Sanskrit tradition. I was amused to read in దేశమాత (......................'s paper) a sentence whose meaning I put into English

"One or two persons advocated the use of గ్రామ్య in Dramas, but pandits have condemned the practice. Where are the Pandits? I should like to see them. Of the persons who assembled at Pachayappa's I wonder how many deserve that name.

It appears you spoke at length at the Nidadavolu conference. I am anxious to learn what you said, at least your chief arguments and general conclusions Unfortunately your speeches are not reported in the Madras papers. Only ఆంధ్రపత్రిక gave a report of the meeting at which you spoke of Sandhi. The one or two sentences in which your views were given, were written in a Telugu which I did not understand. I shall feel obliged if you publish your Nidadavolu speech in some Telugu weekly—at least the gist of it. I value your opinions highly. Sir, please take some trouble

for my sake and the sake of Telugu and write to me brieflly what your views are, how far we concur, and where we differ

*Yours very sincerely,*
**G V. Appa Rao.**

P: S................ 2nd June 1912.

*Dear & respected friend,*

In continuation of my letter of this morning:—

Which prose works and poems of the present day do you offer as standards? May we take your కథాసరిత్సాగరము as a standard and your dramatic verse for poetry, say Usha?

How far have you deviated from the rules and precedents of the language of the older poets? What is your test of correctness? Do you think it possible, I mean is it a practical measure, to secure a fairly common standard of correctness among prose writers. What is your opinion of the solution of ***Mr. Veeresalingam Pantulu*** of a prose diction for Telugu? Do his followers follow any intelligible fairly uniform standard? Granting that to scholars accustomed to literary forms, serious writing in the spoken dialect, sounds undignified, does not the popular prose of the present day with Veeresalingam at its head, offend the sense of propriety of both the Pandit and the western scholar?

*Yours very sincerely,*
**G. V. Appa Rao.**

నిడుదవోలులో 1912 సం మున గ్రామ్యవాదమును ఖండించుటకును, గవర్నమెంటువారికి నిర్బంధగ్రామ్యమును తొలగించుట కొకవిన్నపము కావించుటకును, ఒక సభకూడినది. ఆ సభలో శాస్త్రులవారు ఇట్లుపన్యసించిరి.

*గంగాదేవి నారాయణపాదమందు జనించి పరమశివునిచే మూర్ధంబున లాలితయై నగాధిరాట్ఛృంగంబున విలసిల్లి దిగివచ్చి హరిద్వార వారణస్యాదులమీఁదుగా నానాదేశములం బవిత్రీకరించి కడపట సకలకశ్మల సమృద్ధయై సముద్రమునంబడి తన్మయత్వముంబొంది అస్పృశ్యయై అపేయయై నష్టరూపయైపోయినట్లే వాగ్దేవియు పద్మజాతమనోజాతయై చతుర్వేదీమహితములయిన యాచతుర్ముఖుని ముఖంబులందు విలసిల్లి వాల్మీకివ్యాస కాళిదాసాదులవదనంబులం బరిఢవిల్లి మనయాంధ్రదేశంబునకుందిగి తెలుఁగై రాజరాజనరేంద్ర కృష్ణరాయాదుల యాస్థానములయందు మహితయై నానాదిగ్దేశంబులం బవిత్రీకరించి కడపట నీకాలంబునం బ్రాయికంబుగా తెగులై సకలకశ్మలసమృద్ధయై గ్రామ్యప్రాయతంజెంది అనుచ్ఛారణీయయు అనాకర్ణనీయయునై రూపహానిం జెందుచున్నది.

చిరకాలము ఆంధ్రవాగ్దేవిని సంస్కృతాంధ్రోభయ భాషాప్రవీణులైన వాగనుశాసన సోమయాజి పెద్దనార్య ప్రభృతులు మహోన్నతదశయందయుంచి పూజించిరి. ఇటీవల రాఁగారాఁగా ప్రాయికముగా సంస్కృత మెఱుఁగనికవులు, చదువనికవులు, సమాస మొల్లనివారు, అలంకారము నొప్పనివారు, యతిప్రాసల హితశత్రువులు, అక్షరద్వేషులు, ఔచిత్య బాహ్యులు—ఏవమాదులు వాగ్దేవికి ఈచరమదశను సాధించినారు.

ఈదశలో... భావివాఙ్మయమునెల్ల గ్రామ్యతంబొరయింప నొక యుద్యమము తలసూపియున్నది. ఆగ్రామ్యవాదుల వాదసారము ఇదిగా కానిపించుచున్నది.—

---

*గ్రామ్యాదేశ నిరసనము.

"వ్యాకృతభాషకఠినము; దానివ్యాకరణము దుర్బోధము; తదీయ శబ్దజాలము బహుళముగా గ్రంథమాత్ర ప్రసిద్ధము. వ్యాకరణము వ్యావహారిక భాషానుగుణముగాదు, అంగులకు కర్త్రర్థక భవిష్యదర్థక పడుకలానుబంధములు ఉదాహరణములు.

గ్రామ్యమన్నచో, సులువు. సర్వజనవిదితము.—

ఇటలీలో డాంటిమహాకవివ్రాసిన 'డివైన్ కామెడీ'ని ఉదాహరణముగాఁ గనవచ్చును. గ్రామ్యములో ఇప్పుడు రచితములయిన యేతన్నత నిర్వాహార్థ పత్రికావ్యాసములను, పఠనీయపుస్తకసభవారు (Text-book Committee) పాఠశాలలకు నిర్ణయించినట్టి కొన్నిగ్రామ్యగ్రంథములను, ఉదాహరణముగాఁ బరికింపవచ్చును."

ఇందులకు సమాధానము.—

అగ్రామ్యవాఙ్మయము కఠినమనుట యిప్పుడుపుట్టినమాట, పూర్వులు దీనిని కఠినమనలేదు, లెస్స'యనిరి.

'ఎల్ల భాషలందు నెలుఁగ వేబాసాడి
దేశభాషలందుఁ దెలుఁగులెస్స.'

... ... ...

మఱి యిప్పటికాఠిన్యమునకుం గారణము తెలిపెద.

ఆంధ్రభాషాప్రవచనమందు.—

(1) ప్రాచీనమార్గము (2) నవీనమార్గమును అని రెండు. ప్రాచీనమార్గమును, అనులోమమార్గ మనందగును. అమరము, ఆంధ్రనామసంగ్రహము, సంస్కృతశబ్దమంజరి, సంస్కృతపంచకావ్యములు, నన్నయభట్టీయము, ఆంధ్రపంచకావ్యములు ఈవరుసప్రవచనము ప్రాచీనమార్గము. ఇందలిక్రమము—శబ్దము లక్షణము లక్ష్యమునుంగా నుండును. నవీనమార్గము రాజకీయవిద్యాంగ నిర్ణీతమార్గమే; ఇది ప్రతిలోమ మనందగినది; ఇందు వరుస—లక్ష్యము లక్షణము శబ్దమునుగానుండును.

ఈనవీనమార్గము మనభాషకుపనికిరాదు.

.....ఇందు దృఢపాండిత్యముకై అనులోమమార్గమే అనుకూలముగానున్నది. దీనివలన క్లేశమును కాలమును కరము సంక్షిప్తములగును. ఈ గుణముంగాన నేరక విద్యాధ్యక్షులు ఈమార్గముందొలఁగించి ఈభాషకు అసమగ్రమయిన యేతద్విపరీత నవీనమార్గమున ఈభాషం జెప్పించుటచేత ఇది ఆదినుండియు కఠినమే అగుటయు, ఎన్నాళ్లుచదివినను పాండిత్యము సున్నయే యగుటయు...సంభవించుచున్నవి.

మఱియు......తెలుఁగులో జయ మొందమి నైతరగతికిపోవుటకు ఆటంకపడమిచేతను, ఇంగ్లీషుఁ బ్రాఁకఁగా ప్రాఁకఁగా యూనివర్సిటీ పరీక్షల యందు తెలుఁగులో జయము అతిసులభమగుటచేతను, అందులకై యీ యధమ విద్యార్థులుకూడ చదువనే అక్కఱలేమిచేతను, విద్యార్థుల వ్రాతఁ లెట్లున్నను జయములో మామూలు 'పర్సెంటేజి' ప్రతివర్షము తప్పనందునను, పాఠగ్రంథ ప్రశ్నపత్రమునకు (Text paper) యథాశక్తి ఇంచుకంత యుత్తరమువ్రాసి భాషాంతరీకరణ ప్రశ్నపత్రము (Translation paper) నకు మాత్రము ఉత్తరము విపులముగానేనియు లేక, ఆంధ్రీకరణ మాత్రమయినను వ్రాసి, పరీక్షయందు జయమొందుట ప్రాయికమయి యుండుటవలనను, సర్కారుకొలువునకు తెలుఁగులోని తెలివితోపనిలే నందునను, తెనుఁగు చక్కఁగా తెలిసినచో మునిషీలమైపోదుమేమో అని విద్యార్థులకును అట్లయిపోదురేమోయని వారితండ్రులకును దిగులుకలిగి యుండుటచేతను......ఈభాష యిప్పుడు కఠినమయినది.

ఆంగ్లభాష సులువనుట దానినిసాధించుటకై తాముపడిన ప్రయాసను మఱచుటచేత.

పరీక్షాగ్రంథములలో పదిపద్యములైనను చదివినాఁడా—పదచ్ఛేద విధానమయిన నెఱుంగునా—పదిపద్యములకైనను లక్షణావిరుద్ధముగా అర్థము చెప్పఁగలఁడా—లక్షణగ్రంథము ఏమైన చదివినాఁడా—అనువిష యములను మూలంద్రోచి—ఒజ్జలు నేర్పుజిత్తులచేత అర్థకల్పముగా నుత్త

రము వ్రాయందగు ప్రశ్నపత్త్రముల నిచ్చుచుండుటచేతను, ఎట్లు వ్రాసినను 100 కి 80-90 మందికి జయము తప్పనంగునను, ఈ కాఠిన్యముకలిగినది.

కావున పైపొరబాటులను సవరించుకొనినయెడల ఈమిథ్యా కాఠిన్య మిథ్యాసౌలభ్యములు తొలంగును.

లాటినుమాని డాంటి ఇటాలియనులో వ్రాయుట మనపూర్వులు సంస్కృతమునుమాని యాంధ్రములో గ్రంథములను వ్రాయందొడంగుట వంటిదిగా గ్రహింపవలయునుగాని అగ్రామ్యస్థానమున నిర్బంధపూర్వక ముగా గ్రామ్యము పెట్టుటవంటిదిగా నెన్నదగదు. ఏలయన రసజ్ఞులు కారణవిశేషములంబట్టి గ్రామ్యమందు గ్రంథములను వ్రాసికొందురుగాక. బొబ్బిలిపాటయు దేశింగురాజుపాటయు గ్రామ్యములేగదా. ఆరాధ్యమల్లన రచించిన జంగాల బొబ్బిలిపాటలోని రసములో శతాంశమయినను రంగరాట్చరిత్ర పద్యకావ్యమునలేదు.......అట్లే గ్రామ్యమున సుద్దులును కథలును గద్దెలును రసవంతములు గలవు. 'వాక్యం రసాత్మకం కావ్యమ్మ'ని గదా విశ్వనాథకవిరాజు అనుశాసించినాడు. అది హృదయంగమముగాని, బాలురపాఠపుస్తకములను గ్రామ్యమున వ్రాయుటయు, ఆగ్రామ్యపుస్తకములను దొరతనమువారు నిర్బంధపూర్వకముగా పాఠశాలలలో చదివించుటయు, అసమంజసము.

... ... ...

ప్రతిగ్రామ్యమును సర్వజనీనమనుట సరిగాదు. గ్రామ్యములు పెక్కు తెఱంగులు. గంజాంజిల్లాయోఢ్రగ్రామ్యము, విశాఖపట్టణ రాజమహేంద్రవరాది హిందూస్థానీగ్రామ్యము, నెల్లూరు కడపజిల్లాల శుద్ధగ్రామ్యము, మదరాసు చిత్తూరు తంజావూరు సేలము తిరుపత్తూరు మధుర తిరుచనాపల్లుల యఱవగ్రామ్యములు, బల్లారి బెంగుళూరుల కన్నడగ్రామ్యము, కర్నూలు హైదరాబాదుల తురకగ్రామ్యము, ఇంక ధార్వాడ బెల్గాముల కన్నడ మరాటి గ్రామ్యము, ఈతూర్పునాటి మనకు గోడవలెనుండు

హైదరాబాదు పశ్చిమోత్తరపుజిల్లాలగ్రామ్యములు పెక్కులుగలవు. ఒక జిల్లాగ్రామ్యము మఱియొక జిల్లావారికి తెలియదుసరిగదా అసహ్యముగాఁ గూడనుండును. ఇవిగాక యిన్నిజిల్లాల నానాజాతుల గ్రామ్యములుకలవు. అందులో మనజిల్లావే అనేకములు మనకే తెలియవు.

... ... ...

నిర్బంధగ్రామ్య ప్రాబల్యముచే అగ్రామ్యగ్రంథములు మూలఁబడును. మనపూర్వులమహిమ, వారుమనకై గ్రంథరూపమున నిక్షేపించి పెట్టి పోయిన ధర్మనీతిజ్ఞాన విజ్ఞానములు, వారికవనములసొంపు, రామకృష్ణాద్యవతారమూర్తుల దివ్యచరిత్రములు, కృష్ణరాయాది మహాపురుషుల వైదుష్యాది విశేషములు, సర్వమును ఆంధ్రులకు అబ్బని లిబ్బియగును. ఆపారంపరిచే ఆంధ్రులకు, గీర్వాణ గ్రంథములుకూడ మూలఁబడును.

......ఆంధ్రమహాజనులు దొరతనమువారికిని విన్నవించుకొని ఈ నిర్బంధగ్రామ్యమును వెంటనే తొలఁగించి మఱి తలచూపకుండం జేసికొనవలయుననియు హైస్కూలు ఫారములకును ఇంటర్మీడియేట్ బి. ఏ., పరీక్షలకును ఏదేనొక దేశభాష (వర్నాక్యులరు) మునుపటివలె అవశ్యపఠనీయముగాఁ జేయించుకొనుఁడనియు మహాజనులకెల్ల మదీయవిజ్ఞాపనము.

ఈయుపన్యాససారముకొఱకే మరల గురుజాడ అప్పారావుగారు ఇట్లువ్రాసిరి.

12th June 1921.

*Dear friend*,

Please accept my sincere thanks for your kind note of the 9th inst. I have the first edition of Kathasarithsagara at home. Please order your publisher to send me a copy of the new edition when it is out by V. P. P. I have not yet received the booklet which you promised to send as a specimen.

Your remarks about yourself show your modesty. None of us can altogether shake off the habits and sentiments of a lifetime, but original thinkers like you who combine real scholarship with literary power are able to chalk out new paths to meet new conditions and to save the literature from stagnation. So I want to study your writings. Your poetry is qute in the grammar and diction of the old poets. In prose you have certainly deviated, but what I fail to understand is how you can make common cause with persons like ***Mr. Vavilikolanu-Subba rao*** who takes on one hand an extreme position in prose and reflects a decadant taste in poetry and with writers of the ***Viresalingam*** School on the other from whom there is greater danger to the old literary dialect than from persons who advocate cultivation of spoken dialects. I think as a leader it is your duty to examine the merits and defects of that school of prose which is in greater vogue than the classical style that you advocate.

I await with interest your pamphlet on Gramya...........I hope you have recovered from the fatigue of the journey to Nidadavolu.

*Yours very sincerely,*

***G. V. Appa Rao.***

P. S. I just now received your pamphlet. Please accept my best thanks for it. I wanted to read the best presentation of the opposite views. I shall try to meet your objections. We

differ little on questions of authority. I am afraid I did not make myself sufficiently intelligible at the conference You meet contentions in a shape in which I did not raise them.

I admire you for many things especially for the atmosphere of historical romance and literary patriotism with which you have developed the story of Prataparudra. Perhaps those times were as prosaic as ours as all present is for a present generation; but you have succeeded in idealising characters and institutions Few so called critics understand the merits of the drama Telugu critics grovel in the mud of grammatical accuracy and the minutia of artificial art. Admiring you as I do, I should be loth to cross swords with you. But you have left us no alternative. Therefore I crave your permision, as Pandavas craved that of Bhishma. If I succeed in convincing you even to less than least extent, it can be only with your help.

*With kind regards*

*I remain*

*Yours sincerely,*

*G. V. Appa Rao.*

అప్పారావుగారు శాస్త్రులవారికి జాబులు వ్రాయుచునే యుండిరి. తా మెంత వ్యావహారిక భాషావాదులైనను వేంకటరాయశాస్త్రులవారివంటి వశ్యవాక్కులను తమ మతమునకుత్రిప్పిన ఎల్లవారికిని అనుకరించుటకు తగిన వ్యావహారికము వారు వ్రాయుదురనుతలంపే కారణము గావలయును.

ఏభాషయైనను వేంకటరాయశాస్త్రులవారు వ్రాయగలరను గట్టి నమ్మకము అప్పారావుగారి కేర్పడియుండినది. ప్రతాపరుద్రీయమును రచించిన ప్రతిభాశాలి ఎట్టి శైలియైనను వ్రాయసమర్థుఁడనియు వ్యావహారికభాషాశైలి వారికడ నాంధ్రులు నేర్చుకొనవలసిన దేగాని ఇతరత్ర అసాధ్యమను నుద్దేశముతో కాఁబోలు 8-జన-1914 తేది యొకజాబులో నిట్లు వ్రాసియున్నారు.

"I have to ask you one question. You used in your plays various class dialects on the ground of ఔచిత్యము. Why did you omit the best of them, *i. e.*, the language of the cultured Brahmans. Is there no use for it anywhere? Does not the same ఔచిత్యము repuire that characters of a certain social standard use it?" అని.

ఈజాబులకు శాస్త్రులవారేమి జవాబువ్రాసిరో తెలియదు. శాస్త్రులవారి జాబులు దొరకిన నదృష్టవంతులమే. కాని అప్పారావుగారు కోరినపనిమాత్రము వారు చేసినట్లులేదు. భాషను సులువుపఱచనగును; ఆయావిషయములకు తగినట్లు ఔచిత్యముంజూచుకొని వ్రాయవచ్చునని యే శాస్త్రులవారి యభిప్రాయము. ఎవరికితోచినట్లు వారు 'ఎల్లామాట్లాడుతామో అల్లావ్రాయాలి' అనుమతమును శాస్త్రులవారు ఎంతమాత్ర మొప్పుకొనలేదు. మఱి శాస్త్రులవారి యభిప్రాయ

మేమనఁగా శబ్దస్వరూపములు చెడక రసవంతముగా నెవరికి తోఁచినట్లు వారు వ్రాసికొనవచ్చును. రసము ప్రధానము. కాని చదువుకొను విద్యార్థులకు మొదటమొదట సాధువాఙ్మయమునే నేర్పవలయును - అని. భాషలో. ఈవిధముగా వ్రాయవలయును, ఈవిధముగాకూడదు' అను నేర్పాటులు జలలిపి వంటివని వారి యభిప్రాయము.



౧౮-ప్రకరణము

## శృంగారనైషధవ్యాఖ్య - శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు.

శ్రీ శాస్త్రులవారు అచ్చాపీసు ప్రారంభించినప్పుడే ఆముక్త మాల్యదకు వ్యాఖ్య వ్రాయసంకల్పించి తమ ప్రచురణముల జాబితాలో నియ్యది సిద్ధమగుచున్నదని ప్రకటించిరి. కాని యందులకు విశేషగ్రంథావలోకనము వలసియుండినందున అది వచ్చులోపల నైషధమునకు వ్యాఖ్యవ్రాయుట సులువని దానిని ప్రారంభించి కృషి సలుపసాగిరి. శృంగారనైషధ ముద్రణోపో ద్ఘాతమున శాస్త్రులవా రిట్లువ్రాసినారు. "ఈవ్యాఖ్యను రచించుటకై పూర్వముద్రణములో ఇంచుమించుగా 2000 తప్పులను దిద్దవలసివచ్చినది. అందు రమారమి 1100 అనుబంధమున సూచించియున్నాఁడను. దిద్దుటకు ఊహయు సంస్కృతమూలంబును అలవడిన తాళపత్ర పుస్తకంబులును కావ్యాంతర సంవాదికంబులును సాధనములు. వ్యాఖ్యరచియించుటకన్న పాఠ నిర్ణయము చేసికొనుట కడునెక్కుడుపనియైనది పెద్దలకు పరితోషార్థమును పరీక్షార్థమును విద్యార్థులకు బోధనార్థమును సవరణలకెల్ల ఉపపత్తిని చూపితిని. అంతియగాక ఎల్లవారును తమతమ యిచ్చవచ్చినట్లు పాఠస్వీకరణము చేసికొందురుగాక యని పూర్వపాఠములను అచ్చుఁదప్పులని నాతలఁచిన వానిని సయితము వ్యాఖ్యలోను అనుబంధములలోను చూపినాఁడను" అని*

---

* వేంకటరాయశాస్త్రులవారు ప్రాచీనగ్రంథములను సంస్కరించుటలో ననుసరించిన పద్ధతులంగూర్చి ప్రత్యేక మొకగ్రంథము వ్రాయుటకవకాశము గలదు.

ఈ శృంగారనైషధ వ్యాఖ్యంగూర్చి మదరాసులోను నెల్లూరిలోను శాస్త్రులవారు కొన్ని యుపన్యాసముల నొసంగిరి. ఆయుపన్యాసములలో నొకదానిని వినుటకు 'శ్రీ విక్రమసింహ పురీ పౌరవతంసులు, శ్రీయుత రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు విజయంచేసి విని తత్ప్రబంధప్రౌఢికి కరమూసందించిరి. అప్పటి సన్నివేశమును ఆ. మాల్య. ఉపోద్ఘాతమున తాతగారిట్లు తెలిపి యున్నారు. అనంతరము, "శ్రీ గునుపాటి యేనాదిరెడ్డిగారు మన్నిత్త్రిలు నాకు ముప్పదియేండ్లుగా ప్రతివర్షకుటుంబ పర్యాప్తధాన్యదాత—మదీయ శృంగారనైషధ వ్యాఖ్యా ముద్రణార్థమై ధనముం గూర్చుటకు సమకట్టి, శ్రీయుత రేబాల లక్ష్మీనరసారెడ్డిగారితో 'అయ్యా, రెండుమాసములు నేను మీసన్నిధింబాసి యీ జిల్లాలో సంచరింపవలసియున్నది.' అని నుడివిరి. అంతట శ్రీ రెడ్డిగారు 'ఏలసంచారమేఁగెదవు?' అని యడిగిరి. 'వేదము వేంకటరాయశాస్త్రిగారి శృంగారనైషధ వ్యాఖ్యాముద్రణార్థము ధనమార్జించుటకు' అని ఏనాదిరెడ్డి గారు బదులుపలికిరి. 'నీవు మత్సన్నిధానవర్తివై యుండి బిచ్చ మునకుపోయెదవా?' అని రెడ్డిగారు నవ్వుచుంబలికిరి. 'నాకై యాచించిన, నది బిచ్చమగును గాని, నా గురువుగారిపుస్తకము ముద్రించుటకై యడుగుట బిచ్చమేలయగును?' అని యేనాది రెడ్డిగారు వచించిరి. అంత ఆదొడ్డదొర సుగృహీతనాములు లక్ష్మీనరసారెడ్డిగారు 'సరిలేవోయి దానిని మేమును విని యున్నాము, దానిని ముద్రించుటకు ఏపాటిపైకముపట్టును?'

అని ప్రశ్నించిరి. 'సుమారు రెండువేలు పట్టును' అని వీరు వక్కాణించిరి. 'మఱి, లే, శాస్త్రిగారి దర్శనమునకుంబోవుదము.' అని ఆయుదారులు బండి కాజ్ఞాపించిరి. ఏనాదిరెడ్డిగారు 'నేను పోయి శాస్త్రిగారిని ముందు హెచ్చరించివచ్చెదను.' అనిరి. 'అట్లేచేయుము' అని వారు ఆనతీయఁగా ఆబండిలో ఏనాదిరెడ్డిగారు మాయింటికివచ్చి నన్నుం గని వృత్తాంతము వచించి, నేను ఇప్పుడేపోయి వారిని తెత్తునా, యనిరి. 'అయ్యా, నాబోంట్లు ఎందఱు వారిని నిత్యము దర్శింపరు ? ఆక్షేపము లేదేని నేనేవచ్చెదను. నాకుటీరమునకు వారేలరావలయును ?' అంటిని. అంతట ఆబండిలోనే వారికడ కేఁగి సందర్శింపఁగా, వారు మదీయవ్యాఖ్యానముంగూర్చి నిజాభినందనముం దెలిపి, ముద్రణార్థము ఏపాటియగునో అడిగిరి. ''సుమారు రు. 2000 కావచ్చును' అని చెప్పితిని. అంతట రు 1000 ల నోటొకటి ఫలసహితముగా నాకొసంగి 'మీరు మదరాసున కెప్పుడుపోయెదరు ?' అని యడిగిరి. 'ఈమధ్యాహ్నపుబండిలోనే ఏఁగి సాయంకాలమున ఇల్లుచేరెదను' అని యుత్తరము చెప్పితిని. 'మీరు ఇల్లుసేరునప్పటికి మాకార్యస్థుఁడు వచ్చి మీకు రు 1000 లు అందఁజేయును' అనిరి. అంతట నేను నాకృతజ్ఞతంబలికి నాఁడేతరలి సాయము మదరాసులో నిల్లుచేరునప్పటికి రెడ్డిగారి కార్యస్థుఁడు పైకము తెచ్చి నాకై యెదురు సూచుచుండెను. దానింగైకొని ఆగ్రంథముద్రణమును నెఱవేర్చుకొంటిని. ఔదార్యమన నిట్లుగదా యుండవలయును.''*

---

*ఆముక్త-ఉపోద్ఘాతమునుండి.

శాస్త్రులవారి శృంగారనైషధవ్యాఖ్యను పలువురు విద్యావంతులును పండితులును కొనియాడిరి. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఇట్లు వ్రాసిరి. 'I suppose it is beyond question that yours forms the greatest commentary that has so far appeared in Telugu and that it will be probably a unique one of its kind for all time to come...........to-day the Telugu world could boast that a modern scholar has beaten the ancients at their own game in a most decisive fashion.'

గురుజాడ అప్పారావు పంతులవారు - I congratulate you on the completion of the work. It is invaluable to the student of the Telugu literature Naishadham cannot be understood by average scholars without such a gloss as you have given. You have done what nobody else could have done so well. I am sorry that the gentlemen with whom you have chosen to throw in your lot (though you have more in common with us than with them) decided not to print my minute of dissent. Therein I gave a critical estimate of the prose writers of the day and distinguished your work from that of the illiterate rabble. Your friends are never tired of singing the praises of two inferior artists like ***Veeresalingam Pantulu*** and ***Chilakamarti*** - and it is only recently there is a halting acknowledgement of your claims. For the first time I boldly showed up the utter worthlessness of the prose which uncritical and unscholarly persons were blindly holding up as a

model. Your friends never did you ordinary justice. An old friend, from the opposite camp, that is, your humble servant, has given you your due as a scholarly writer·

If you glance through my minute of dissent you will find what I said of you. *Mr. Lakshmana Rao* once said that I flattered you. It is he who flatters for his own purposes. I proclaim my views from house tops and they are always my honest convictions.

Why dont you do one service to Telugu? May I request you to write the story of the Mahabharata in a blend of old and new forms such as is used in commentaries, tales etc. You may say in your preface that the book is not meant for school boys, that it is meant for the illiterate or whatever you please. I shall print it.

*Yours very sincerely,*

***G. V. Appa Rao***

శృంగారనైషధమును గురించి ఇంక నెందఱో వ్రాసిన జాబులుగలవు. వానిని శాస్త్రులవారిజీవితచరిత్రసర్వస్వమున ప్రకటింపఁదలంచితిని. ఈగ్రంథముద్రణము పూర్తియైన వెంటనే శాస్త్రులవారు మరల ఆముక్తమాల్యదపై కృషిసలుప నారంభించిరి. నైషధమున ముఖపత్త్రిము వెనుక నీపద్యమును ముద్రించిరి.

ఉ. వ్రాసితిముఁ 'బ్రతాపుఁగృతిఁ' బండితమానసులగుండె నీఱుగా,
వ్రాసితి వెన్కన 'య్యుషవివాహము' సిద్ధసుధాప్రవాహముఁ,
వేసరకాంధ్ర 'నైషధము' విప్పినిధుల్ నెఱమూఁటలిచ్చితిఁ,
జేసెదనింకఁ దత్పరత సేవలు చూడికుడుత్తదేవికిఁ.



## ౧౫-ప్రకరణము.

## శ్రీ వేంకటగిరి మహారాజా

## కీ. శే. శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్ర బహద్దరువారు.

శాస్త్రులవారికి నెల్లూరిపై నభిమానము మెండు. శృంగార నైషధ ముద్రణానంతరము నెల్లూర నివాసమేర్పఱచుకొని తమ్ము ఆదినుండియు నాదరించుచున్న శ్రీ వేంకటగిరి ప్రభువు లేమి, శ్రీ లక్ష్మీనరసారెడ్డిగారివంటి పోషకులేమి, గునుపాటి యేనాదిరెడ్డిగారివంటి మిత్రరత్నములేమి ఇంకను శిష్య సమూహమేమి బంధుకోటియేమి నిండియున్న తావున స్వజనము నడుమ నుండఁ దలంపుగొనియుండిరి. ఇట్లుండఁగా 1914 సం. న ఐరోపీయమహాసంగ్రామము ప్రారంభమాయెను. మదరాసునకు సమీపముగా పోవుచుండిన జర్మనునౌక ఎండెన్ అనుదాని నుండి శత్రువులు చెన్ననగరముపై మూఁడుగుండ్లను పేల్చిరి. మదరాసు అపాయకరమైన ప్రదేశమనితలంచి శాస్త్రులవారు, ఎట్లును నెల్లూరికేఁగ దలంచియుండిరిగాన, అంతపెద్ద యచ్చాపీసును నెల్లూరికి మార్చుకొనిరి. ఈమార్పుచే వారికి నష్టమే వచ్చినది. గుమాస్తాలుగా చేరినవారు పలువురు వంచకులై ద్రవ్యమునేమి, పుస్తకములనేమి, యంత్రభాగములనేమి, పనిముట్లనేమి, పెక్కింటిని హరించిరి.

కుటుంబమును వృద్ధియైనది. శాస్త్రులవారికి వేంకటరమణయ్యగారు ఏకైకసంతానము. వారికి తమమిత్రులు కీ. శే. శ్రీ శేషగిరిశాస్త్రులవారి కడగొట్టుకొమార్తె సరస్వతమ్మను వివా

హాముంగావించిరి. శృంగారనైషధ ప్రకటనకాలమునకు 1913 సం. జనవరికి, ఏతజ్జీవితచరిత్రరచయితను నేను జనించి రెండు మూఁడు నెలలై యుండినవి. శాస్త్రులవారికి అఱువది సంవత్సరములై యుండినవి. తాతగారైరి కాని మంచి యారోగ్యమునందుండిరి.

1914 సం. నవంబరు 18 తారీఖున నెల్లూరు, మూలపేటలో సొంతగృహమున నచ్చాపీసును స్థాపించిరి. మదరాసులో నున్నంతకాలము అచ్చాపీసు ఎట్లట్లో జరుగుచుండెను. ఆంధ్రదేశమందలి విద్వాంసులెల్ల తమతమ గ్రంథములను జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందే ముద్రింపించుకొనుచు వచ్చుచుండిరి. నెల్లూరికి వచ్చినంతనే ఆపని దొరకదాయెను. సొంతగ్రంథములకు మాత్రమేయైనచో ఆయచ్చాపీసు చాలదొడ్డది. వ్యాపారస్థులవలె కనఁబడిన గ్రంథములనెల్లను తాతగారు ముద్రింపరు. తాముపరిష్కరించి సరిజూచిన గ్రంథములే తమ పేరిట నచ్చు కావలయునని నియమము. ఈకారణముచే సొంతప్రచురణముల సంఖ్య తక్కువగానేయుండెను. వాని విక్రయముచే నచ్చాపీసంతయు జరుగునంత వ్యాపారము లేదాయెను. ఇది మొదలు చిక్కులు ప్రారంభమైనవి. పెద్దయచ్చాపీసునకు పని పెట్టవలెను, తగిన పరుంబడిలేదు.

వేంకటరాయశాస్త్రులవారు ప్రారంభించిన గ్రంథముద్రణ వ్యవసాయమునకు ఆటంకము లెట్లువచ్చినవో చూడుఁడు.

ఇట్టిసమయమున శాస్త్రులవారికి, వారిపోషకులును బహుకాల మిత్త్రులునునైన, శ్రీ వేంకటగిరి మహారాజా, కీ. శే. శ్రీ రాజ గోపాలకృష్ణయాచేంద్ర బహద్దరువారు సాయపడిరి.

కథాసరిత్సాగరమును తొలుత ముద్రించినకాలముననే (1891 సం.) శాస్త్రులవారికి శ్రీ మహారాజావారి యాదరము లభించినది. అదిమొదలు ఒక్కొక గ్రంథము ముద్రితమైన వెంటనే శాస్త్రులవారొక ప్రతి శ్రీ మహారాజావారికి పంపుటయు శ్రీ వారు వానింబఠించి సవిమర్శకాభిప్రాయములను తెలుపుటయేగాక పారితోషికములంగూడ పంపుచుండిరి.

శ్రీ శాస్త్రులవారి శాకుంతలముం గాంచి శ్రీ రాజాగారు వీరిని సన్మానించినవిధము శాస్త్రులవారి వాక్యములలోనే ముద్రించుట మనోహరము. "నేను నాయాంధ్రాభిజ్ఞాన శాకుంతలమును ప్రకటించి వారికి ఒక ప్రతి పంపితిని. అంతటవారు నాతో సమావేశముంగోరి మదరాసు మౌంటురోడ్డు మోతీమహాలులో నాకు దర్శనమొసంగి సల్లాపానంతరము నాకు కొంతధనము పారితోషికమొసంగవచ్చిరి. నేను వారిని ఇట్లు ప్రశ్నించితిని. 'ఈగ్రంథము ముద్రితమైనది. దీనికై యిపుడు నేను అధమర్ణుండనుగాను. జీవనముకై నాకు క్రిశ్చియన్కాలేజిలో కొలువున్నది. ఏల ఏలినవారు నాకు ఈధనమీయవలయును. ఏల నేను కైకొనవలయును?' అంతట వారు సెలవిచ్చిరి, 'మీకు కాలేజిలో జీతము స్వల్పము. అదిమీకు కుటుంబభరణమునకే

చాలదు. మీరు వ్రాయవలసినది, మేము ముద్రింపవలసినది. మన మిరువురము పరస్పరసాహాయ్యముతో ఈతీరున లోకోపకారము చేయవలసినది. కావున మీరు ఈలేశమును గ్రహించుట యుక్తము.' ఆమాటకును ఆప్రసాదమునకును నేను అత్యంతము సంతుష్టుడనై ఆపైకమును గ్రహించితిని. అప్పటి నుండి నేను ప్రకటించిన ప్రతిపుస్తకమునకును, పుస్తకాది నిమిత్త నిరపేక్షముగా సయితము, వారు అప్రార్థితముగా నాకు మెండు ధనమిచ్చుచుండిరి,''

ఈప్రభువు విద్వత్పోషకుడేగాక స్వయము విద్యావంతుడు.

శాస్త్రులవారి యాంధ్రాభిజ్ఞాన శాకుంతలముపై వారి యభిప్రాయము:—''ఆంధ్ర గీర్వాణములయందు తమకుగల సరసపాండిత్యము స్ఫుటంబయ్యె. మూలగ్రంథభావము పోకుండ నున్నయది. ఒకానొకచోట భావభేదంబున్నను దెనుంగున కయ్యది మెఱుంగు పెట్టినట్లే కానంబడుచున్నది.''

ప్రతాపరుద్రీయము వీరికే అంకిత మొసంగబడినది. దీనిం గూర్చి వీరియభిప్రాయము, కొన్నిపుటలు, అముద్రిత గ్రంథ చింతామణియందు ప్రకటింపబడినది. ఇయ్యది పలినవారి వైదుష్యమును చాటుచున్నది. అందలి వాక్యములు రెండుదాహరించెద.

''తమరంపిన ప్రతాపరుద్రీయనాటకము తెనుగుచూడబడియె. మిగుల రసవంతముగా నున్నది....కథాసంవిధాన

చతురతయందు అష్టమాంకము...చూడఁగా లక్షణవేత్తృతయు రసికవిద్వత్కవితయు భోధ్యమానము లగుచున్నవి.''

ఉషానాటకముంగూర్చి—''ఉషానాటకము సాంగముగా చిత్రగింపఁబడియె. అందు ప్రథమాంకములో ౨౧ వది 'సరవిఁ బేడికిడస్సి' యనుపద్యము షడృత్వాభివ్యంజక శబ్దజాలంబుతో నుత్తరాంకార్థసూచ కాంకాస్యనామకసూచ్య లక్షణత్వ సంపన్నంబై యత్యంతరసవంతంబై యపూర్వకల్పనాకల్పంబయి యున్నయది. తృతీయాంకమందున్న పద్యము 'సంజవేళ లేఁత జాజొంది'యనునదియు 'చందునకాత్మ బింబసదృశంబుగ' అనునదియు నీరెండు పద్యములును నసంభూతోపమాలంకారము గల్గి యస్మద్దేశ కవికల్పనా సంప్రదాయానురూపములై పాశ్చాణ కవీశ్వర షేక్స్పియర్ ప్రముఖ వర్ణనాస్వభావ సంపన్నంబులై సొంపుగ సహృదయహృదయానందంబుగా నున్నయవి.''—

శాస్త్రులవారి శృంగారనైషధవ్యాఖ్యను వారు చిత్రగించినవిధముంగూర్చి శాస్త్రులవారే యిట్లు తెలిపియున్నారు. ''మదీయ శృంగారనైషధవ్యాఖ్యను ఆదార చిత్రగించి దాని నిస్తనశల్యపరీక్షగావించి చదివి శోధించి, తమ్ముదర్శించుటకు నాకు నాలుగుమాసములు తీఱినందున ఆనాలుగుమాసములును వేచియుండి, అనంతరము మాంటురోడ్డు మోతీమహాలులో దర్శనమనుగ్రహించి, రెండుగంటలకాలము ఆగ్రంథమునందలి మదీయసంస్కరణ విపరణాదులను పెక్కింటిని ఉద్ఘాటించి ఉగ్గడించి, తుదకు నాకు రు 400 లు పసదనమొసంగిరి అందులకు

నేను వారితో 'ఈగ్రంథమును ముద్రించుటకు నాకు ధనము రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు దయచేసినారు. గ్రంథము ముద్రితమైనది. ఏల ఏలినవారు నాకు ఈధనమిప్పుడీవల యును?" అని యడిగితిని. అంతటవారు "మీరు, గురువులు, మేముశిష్యులము, శూన్యహస్తముతో గురుదర్శనము చేయఁ గూడదని మీరే ధర్మమేర్పఱిచితిరి. మీయనుశాసనమును మీయెడనైన మేము నెఱవేర్పవలదా? అందులకై ఇది ఆచారము జరుపుట గాని యొండుగాదు" అనిరి. ఆ ప్రతిభకును ఆప్రసన్నతకును సంతుష్టుఁడనై కృతజ్ఞతాపూర్వకముగా ఆధనమును స్వీకరించితిని."*

శ్రీ మహారాజావారి యౌదార్యముంగూర్చియు, పాండిత్యాతిశయములంగూర్చియు లెక్కలేని యుదంతములను శ్రీ తాతగారు చెప్పఁగా వినియున్నాఁడను. నైషధాది గ్రంథములలోని సంస్కరణములంగూర్చి వారడిగిన ప్రశ్నలును తాతగారొసంగిన యుత్తరములును వినోదముగానుండును. విద్యావిషయములయందు వారికి వీరే ప్రమాణము. తాతగారికి వారు రచించిన జాబులతో నొక ప్రత్యేకగ్రంథము వ్రాయఁదగును.

తాతగారు ఆర్థికదురవస్థపాలైన కాలమున తమ ప్రాపకవరేణ్యులైన యావిద్వత్ప్రభువున కొకజాబు వ్రాసిరి. ఆ జాబులో తమజీవితచరిత్రము సంగ్రహముగా వ్రాయుచు తమ

---

*ఆముక్త — ఉపోద్ఘాతము.

క్లేశములను ప్రభువునకు తెలుపుకొనిరి. ఆజాబునుండి కొంత యుదాహరించుచున్నాఁడను.

"నా వేతనము గ్రంథక్రయమునకును జీవనమునకును రెంటికిని చాలకున్నందున అపరిత గ్రంథ సంపాదనార్థముగాను వైద్యార్థముగాను ధనాపేక్షినై ధనములవడునను నభిలాష చేతను విక్రమార్కాది పురాతన రాజర్షి చరిత్రాభిమానిత చేతను తచ్చరిత్ర పుస్తకములను సంస్కరించి సటిప్పణము లనుగా ముద్రించితిని. ఇట్టి యుద్యమమువలన మున్నున్న లేమికి తోడు ఋణములు సయితము సంభవించినవి.

"వానిని శమమొందించుటకై ముద్రాక్షరశాల నొక దానిని నిర్మించుకొని కథాసరిత్సాగరమును కొంత ముద్రించితిని. కొంతఋణమును వెంటనే ముద్రాక్షరశాలా సామగ్రీ సర్వస్వవిక్రయముచేత తీర్చి, శిష్టఋణమును క్రమక్రమముగా నాజీతమువలననే తీర్చుచుంటిని......

... ... ...

"ఆయతి చాలనందునను తదర్థమై యూనివర్సిటీ యాశ్రయముంగోరి నాగానంద శాకుంతలాది నాటకాంధ్రీకరణముంగావించితిని. ఒకానొక కారణంబున నాగానందము ఎఫ్. ఏ. పరీక్షకిడియు ఒకానొకరి కారణంబున పరీక్షా గ్రంథ నియమనాధికారులు కడమ మదీయ గ్రంథములను పరీక్షలకిడ

కుండిరి. ఇప్పటికిని నా గ్రంథముల నిడుటయరుదే యని శ్రీ శ్రీ యేలిన వారికి విశదమే.

... ... ...

"ఇట్లుండఁగా శ్రీమంతులు అష్టాదశ భాషాధురంధరులు నగు ప్రొఫెసరు శేషగిరిశాస్త్రులవారు నన్ను ఎఱుక చేసికొని నాకు మిత్త్రిధేయమై తాముగా యత్నించియు శ్రీ మిల్లరు దొరవారిని హెచ్చరించియు యూనివర్సిటీ పరీక్షాధికారమును నాకు ఇప్పించినారు. ఆమూలమున నాకు ప్రతివత్సరము కలిగిన యాయతిచేత పూర్వఋణములను దీర్చికొని మిగత ఆర్బతునట్టు నిధిలో వైచుచుండి క్రమక్రమముగా రు ౨౭౫౦ (2750) ల మొత్తముకాగానే నిధిమునుకలో దానింగోల్పోయితిని. ఆ మొత్తము మూలధనముగా అచ్చుకూట మేర్పఱచుకొనను వార్ధకమున పెన్షను నొసంగని యానౌకరిని మానుకొనను సంకల్పించుచుండఁగానే ఆధనము నష్టమయినందున నౌకరి యందే నిలిచి కాలక్షేపము చేయుచుంటిని.

... ... ...

"ఇట్లెల్ల కాలమును తత్తత్కాలదీనతం దొలఁగించుకొను యత్నములచేత వ్యాపృతుఁడనైనందున భూలోకావతీర్ణ యుష్మద్రూపవిద్వత్కల్పకముయొక్క కరుణామరందలహరీ బహుళమైన కాదంబర్యాంధ్రీకరణాజ్ఞప్తి పుష్పము మచ్చిరము ననే వ్రాలినను దానిని కైసేసికొనలేకయు ఫలమును తలయెత్తి చూడలేకయునుంటిని. ఇందఱుండఁగా నన్నే చేయుమని సర్వజ్ఞ

సింహాసనము నధిష్ఠించియున్న పుంభావరూప భారతి మొదల యిచుటకన్న నాకు మహాభాగ్యమొండు గల్గునా ? అంతకన్నను భాగ్యముండునేని అది యీమొదల నెఱవేర్చుటయేగాని యొండుగాదు.

... ... ...

అర్ధకృతములైన పనులనుమందముగా నేనియు సమాప్తి కావించుకొనుటకై చేయుచున్న ప్రయత్నములలో ఊబిలోc బడిన యేనుఁగు చందమున మఱియుమఱియు నిమజ్జింబాలను ననేమునింగి, ఋణములపాలై రోగపీడితుఁడనై తుదకు ఎమ్పర్ నాకవలసి యత్యాహితసమయంబున కష్టకరులు కొలఁది దినములు పలాయితులగుడు తద్వ్యాజమున ముద్రాక్షరశాలను మూసినైచితిని ......ముద్రాక్షర వ్యాపారముకన్న జీవనాంతరము లేనివాఁడను, తద్వ్యాపార సాధనముకూడ కోలుపోవలసిన దశ ఈనెలలో ప్రాపించియున్నది. ఇంకనుం గ్రంథములు రచింపందలఁపులుంగలవు.

ఈసమయమున నన్ను శ్రీశ్రీశ్రీ యేలినవారు నిలువం బెట్టి కడచినసంవత్సరము నామీఁద మదరాసులో దర్పణ ప్రాసాదమందు, పాలయించిన వాక్ప్రసాదమును చిత్తమున నవధరించి, నాకు కొంచెముఋణమును రూప్యపంచసహస్రీపరిమితమును వృద్ధిరహితముగా సముచిత ప్రత్యర్పణకాల నిర్దేశపూర్వకముగా దయచేసిన నాకుంగలిగియున్న యీ సకలక్లేశ

ములనుం దొలంచుకొని, ఇదిమొదలుగా మూఁడుమాసములకు కాదంబర్యాంధ్రీకరణమునకు ధృతదీక్షుండనై అవిలంబితముగా దానిని ముగించి జగద్విశ్రాంతమయిన భవత్కీర్తిచంద్రికను సాంద్రతరీకరించెద.

(1) ఈభాషకు సమగ్రమైన వ్యాకరణములేదు.

(2) అట్టి యలంకారశాస్త్రమునులేదు. ఉన్నట్టి యలంకారగ్రంథములు ధనార్థులచే దొరలం బొగడుటకు సాధనములుగా వ్రాయఁబడినవేగాని విషయమునెల్ల విపులముగా సుబోధముగా చర్చించి విశదీకరించుటకు వ్రాయఁబడినవి కావు.

[ఈచోట ప్రసక్తానుసారము స్మృతిగోచరమయిన విషయమొకటి విన్నవించెద,—ఈనడుమ బ్ర. శ్రీ. వెల్లాల సదాశివశాస్త్రులవారును శేషశాస్త్రిగారును నరసభూపాలీయమునుగూర్చి వ్రాఁతమూలకముగా కాఁ చిన చర్చలో ఆచర్య ముగింపునకు రాకముందే మదరాసులో వారితోడి సంభాషణలో నాకుందెలియవచ్చిన దేమనఁగా,-వారు మత్కృతాక్షేపములను మదీయసిద్ధాంతములుగా భావించి అట్లే శ్రీమత్సన్నిధిలో ప్రకాశపఱిచిరనువిషయము. నాసిద్ధాంతమని వారు తలంచినది నాసిద్ధాంతముగాదు. ఆయాతావుల వారు అవలంబించిన మార్గమువలన వాస్తవసిద్ధాంతస్థానమును ఆపాదించునట్టి తద్విపరీతమును నేను హెచ్చరించితిని. వారావిషయమును ఒండుగా భావించినందున ఆచర్చను వారి యిచ్ఛచేత అంతటితో విరమించితిని. ఈవిషయము శ్రీమత్సన్నిధిని విన్న

వించుటకు నాకు అవకాశములేనందున ఇచ్చోటం దెలుపు కొంటిని.]

(3) మన్ముద్రితగైర్వాణ ప్రియదర్శికానాటికా ముద్రణ మార్గమున సంస్కృతనాటకములను పెక్కింటిని శాకుంతల మాలతీమాధవ మహావీరచరి త్రోత్తరరామచరిత్రాదులను మూలవిరుద్ధార్థముగా నాంధ్రీకృతములైనట్టి వానిని—వాస్త వార్థబోధకముగా వ్యాఖ్యాసమేతముగా ... ప్రకటింపవలసి యున్నది.

(4) వ్యుత్పత్తులనొసంగునట్టి నిఘంటు వొకటి నిర్మింప వలసియున్నది.

(5) శ్రీమదాంధ్రమహాభాగవతముం* సాధుపాఠ నిర్ణయ పూర్వకముగాను గూఢార్థబోధనపూర్వకముగాను ప్రకటింపవలసియున్నది.

(6) ఇంకను ఎల్లవారికిం బఠనీయముగా సకలనాటక కథావళి రచింపవలసియున్నది. ఇప్పుడున్ననాట కాంధ్రీకరణ ములలో కథయుం జెడియున్నది.

(7) శిశుపాలవధాది కావ్యములను సంస్కృతాంధ్ర వ్యాఖ్యా నాంధ్రటీకాసమేతముగా ముద్రింపవలయును.

(8) అమరకోశమునకు ఆంధ్రగైర్వాణమయమైన సుబోధ వ్యాఖ్య రచింపవలయును.

(9) కాశీఖండ సోమహరివంశ పాండురంగమాహా త్మ్యాది దివ్యప్రబంధములను, విషమపదటీకలతో సుముద్రిత

* భారతముగానుండు నా?

ములంజేయవలయును.—ఇత్యాదికృత్యము లెన్నియోకలవు. ఆయుశ్శేషమును వీనిచే కొంత సఫలీకరించుకొనుట యొప్పును. అప్రాప్తి నేను పైని నివేదించిన మదీయమనోరథము శ్రీమత్కటాక్షాంకితమయినం గలుగును. ముందుగా కాదంబరి నాంధ్రీకరించెద; నా వేడినఋణమును మదీయ బహుగ్రంథసంచయ విక్రయముచేతను, పయి నేనువ్రాసిన గ్రంథరచనలచేతను ఇట నాకు అచ్చుపనులను మన్మిత్రు లనేకులు సమకూర్పం గడంగియున్నారు. కావున ఆపనుల యాయతిచేతనుందీర్చెదను. నావ్యాపారము ప్రకృతమున నదీమాతృకమయిన సుకృష్ట సుక్షేత్రము విత్తనములేక చల్లకము మానినందున కంపతంపరయయిన రీతింబొందియున్నది.

శ్రీ శ్రీ యేలినవారు పరిషత్తునకు మహాధనమొసంగియున్నారు. నెల్లూరు హైస్కూలు నిర్వహించుచున్నారు. ఆంధ్రదేశమందు ఎచటివారు రచించినదైనను ఆ నూతనగ్రంథమునకు పోషకులరై యున్నారు. నాకు నిరంతరము ఏకాశ్రయులు......పరిషదాదులు ఏమిచేసినవో ఏమిచేయగలవో దివ్యచిత్తమునకు విశదమైయేయున్నది. శ్రీశ్రీశ్రీ యేలినవారు అనుగ్రహించు ప్రత్యుత్తరమును ఎదురుచూచుచున్నాఁడను.

... ... ...

వేదము వేంకటరాయశాస్త్రి.

[జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల, నెల్లూరు.]

ఈజాబునకు శ్రీమహారాజావారు, హృదయము కరఁగి, 1915 సం. ఏప్రిలునెల 25 తేది వేయిరూప్యములు బహుమతిగాను రెండువేల యైదువందలరూప్యములు అప్పుగాను నొసంగిరి. శాస్త్రులవారు శ్రీ మహారాజావారికి కృతజ్ఞులై తమ చిక్కులను సడలించుకొని వ్యాపారమును సాగించుటకు ప్రారంభించిరి.

ఇక్కాలమున శ్రీ మహారాజావారి చిత్తము రంజింపగోరి వెలమవీరుల గొప్పతనమును ప్రకటించునదైన బొబ్బిలి యుద్ధనాటకమును వ్రాసిరి. అందు సూత్రధారునిచే శ్రీ మహారాజావారిని ప్రశంసింపించిరి. ఈగ్రంథము ప్రకటించుటకు కొంతముందే శాస్త్రులవారు సూర్యరాయాంధ్రనిఘంటు సంపాదకులగుటయు, తన్మూలమున మరల నచ్చాపీసుతోఁగూడ శాస్త్రులవారు చెన్నపట్టణమునకు నివాసము వచ్చుటయు జరిగినవి. శ్రీ మహారాజావారు కోరిన కాదంబర్యాది గ్రంథముల రచనసాగుటకు కొంతయాలస్యము కాఁజొచ్చెను. శాస్త్రులవారు నిఘంటు సంపాదకత్వము నంగీకరించుటకు ప్రోత్సహించిన వారిలో శ్రీ రాజాగారు ప్రధానులు.

ఈవిధముగా కొంతకుదురుపాటుతో శాస్త్రులవారుండిన కాలమున శాస్త్రులవారి కొక పిడుగుదెబ్బ తగిలినది; వారికి ఆధారముగానుండిన కల్పవృక్షము కూలిపోయినది; శ్రీ మహారాజావారు ఆకస్మికముగా పరమపదించిరి. శాస్త్రిగారికి కొంతకాలమువఱకును ఇతికర్తవ్యతాజ్ఞానము లేకయుండినది. అట్టి విద్వత్ప్రభువును పోఁగొట్టుకొనినందులకు చింతింపనివా

రుందురా? ఆముక్తమాల్యదను ప్రకటించు సందర్భమున వారిని స్మరించుచు నిట్లు శాస్త్రులవారు వ్రాసిరి "వారు జీవించి యున్న నాకేమియు కొఱంతయుండదు. దిగులులేక గ్రంథములు రచించుచు, ప్రకటించుచు, ఈయంత్యకాలమున లేమికి బొమ్మ గట్టి ఋణమన్నమాట యెఱుఁగక సంపన్నుఁడనై నిశ్చింతుఁడనుగా నుందును. ఈ యల్పపుణ్యునికి అట్టి యదృష్టము ఏల కలుగును!"

శ్రీ గునుపాటి యేనాదిరెడ్డిగారు ఆంధ్రప్రకాశికలో శ్రీ రాజాగారింగూర్చి ఇట్లు వ్రాసిరి—"ఈమహారాజుగారి పరిచయము ఇరువది సంవత్సరములుగఁ గలిగియుంటిని. విద్యావిషయముగ నే నెపు డేమి వ్రాసినను వెంటనే సాదరముగ సమాధానము వ్రాయుచుండిరి......వీరు సంస్కృతాంధ్రములయందు అసదృశపాండిత్యము కలవారయి రసౌచిత్యగ్రహణమునందు నిపుణులయి విద్వద్వరేణ్యుల ప్రశంసాపాత్రులయి యుండిరి. మహాకవుల నెక్కువగ గారవమున ఆదరించుచుండిరి. ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రధాన పోషకులయియుండిరి. ఇట్టి భాషాపోషకులు మన దేశమున అరుదుగాఁగలరనుట సాహసము కాదు.

వీరు రచించిన త్రైర్థికవినోదిని మొదలగు గ్రంథములం జదివిన వీరికల్పనావైదగ్ధ్యము విశదమగును......" అని.

వీరి యకాలమరణముచే బాధితులైన వారలలో శ్రీ శాస్త్రులవా రొకరు.

'చింతిలనేమిగల్గు విధిచేఁత బలీయము.'

---

౨౦–ప్రకరణము

## సూర్యరాయాంధ్ర నిఘంటువు.

సూర్యరాయాంధ్ర నిఘంటు సంపాదకత్వము శాస్త్రుల వారిజీవితమునం దొక విషాదఘట్టము. వార్ధిక క్లేశములలో నుండి శ్రీ వేంకటగిరిమహారాజావారి సాయ మపేక్షించు చుండినకాలమున శ్రీ రాజాగారి సహాయముతోపాటు ఈసం పాదనాధికారము శాస్త్రులవారికి వాడినచేనికి వర్షమువలె నైనది. శ్రీయుత గుమ్ముడూరి వేంకటరంగరావుగారు శాస్త్రుల వారిని పలుమార్లు ఈవిషయమై హెచ్చరించిరి. శ్రీ రాజా మంత్రి పెగడ భుజంగరావుగారు నిఘంటు సంపాదకత్వము వహింపవలసినదని శాస్త్రులవారికి లెక్కలేని జాబులు వ్రాసిరి. పరిషత్తువారును ఈనిఘంటువునకు శాస్త్రులవారే ప్రధానసంపా దకులుగా నుండవలయునని కోరిరి. ప్రతిష్ఠాపకులలో నొకరైన శ్రీ వేంకటగిరి మహారాజాగారన్ననో శాస్త్రులవారుతప్ప నితరు లాపదవికి అనర్హులని తమయభిప్రాయముం దెలిపి వారే సంపాద కులుగా నుండవలయుననిరి. అంతట శాస్త్రులవారు నిఘంటు సంపాదకత్వమును, నెలకు రు. 250 వేతనముపై, వహించిరి. ఇయ్యది శాస్త్రులవారిని వేదిక.—

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

### శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు కార్యనిర్వహణము.

తొలిరెండు సంవత్సరముల పనిం గూర్చిన నివేదనలేశము

ప్రధానసంపాదక కృతము.

ఆంధ్రసాహిత్యపరిషత్తుయొక్క మంత్రిసభవారు ప్రధానసంపాదకునకు తదీయనియోజనమును తెలిపిన పత్త్రములో ఇరువురను సహాయసంపాదకులను నూఱేసిరూపాయల మాసవేతనములపై నియోగించెదమని వ్రాయించినారు. కాని, అట్టి సహాయసంపాదకులను నియమింపలేదు. ఆదిలో ఆయనకు ఇరువురు లేఖకులు ఉండిరి. ప్రధానసంపాదకుఁడు అతివేగముగా నిఘంటు ప్రకారనివేదన గ్రంథకమును రచించునప్పుడు ఆయిరువురును తదర్థమై కొన్నిపుస్తకములనుండి కొన్నివిషయములను వెదకుటయందు సాయపడిరి. అనంతరము త్వరలోనే ఆయన వారితోడ్పాటును కోలుపోయెను. నాఁటినుండి ప్రధానసంపాదకుఁడు ఎవరిసాయమును లేకయే విషయసంకలనార్థమై ఆలోకనీయములైన పుస్తకములను ఎత్తియిచ్చు పరిచరుఁడైనను లేక ఏకకుఁడుగానే పాటుపడవలసియుండెను.

కార్యస్థానము పుదుపేటలో నున్నంతకాలము, దానికి దాపున ప్రాగ్దక్షిణదిశలయందు మునిసిపాలిటీవారి నగరజన పురీష నిర్హరణ శకటవ్రాతముల నిలువరపుతావులగుటంబట్టి, ప్రధానసంపాదకుఁడును ఆ లేఖకులును మఱియొక లేఖకుఁడును మఱుఁగుఁబెరటిలో కట్టివైవంబడిన జనులయొక్క దుర్దశను అనుభవించుచుండిరి. మఱియు కార్యస్థానమైన గృహమందు మఱుఁగుఁబెరడు లేనందున ప్రధానసంపాదకుఁడు బహిశ్శంకకు పోవలసివచ్చిన సమయములయందు మునిసిపాలిటివారి సార్వజనిక పురీషాలయములకు పోవుటయు, అందు వర్ణనకు మనస్సొప్పని దుఃఖకర ఘోరానుభవములకు పాలగుటయు, సంభవించుచుండెను. కార్యస్థానమున వాయుమార్గములను మూసినచో ఊపిరిసలుపదు. తెఱచినచో పురోక్తములైన మునిసిపాలిటీబండ్ల దుర్గంధము అలుగులు తెంచుకొని వెల్లువపాఱి ప్రధానసంపాదకుని ప్రాణవాయువును ముంచి కొట్టుకొనిపోవును. ఇప్పుడుసయితము చింతాద్రిపేటలోని కార్యస్థానాలయమునందు అన్నిగదులలోను మేలయిన ప్రధానసంపాదకుని గదియు ఇంచుక తక్కువగా ఉక్తదుర్గంధదశకే లోనయియున్నది.

ఆంధ్రభారతగత సర్వపదములను అకారాదిక్రమమున అర్థవిహీనముగా నొకగ్రంథముగా వ్రాయుట యనుపని యొకటి ఆదినుండి యీనిఘంటు నిర్మాణకార్యములలో నొకభాగముగా నిరూపింపఁబడినది. కొంతకాలమైన తర్వాత ఆపనికి ప్రత్యేకముగా నొకపాఠకుఁడు రు 30 నెలజీతమున కేర్పఱుపఁబడియెను. ఆతఁ డిప్పటికి సుమారు సంవత్సరమునుండి ఆపని చేయుచున్నాఁడు; దానిని ముగించుటకు ఇంకనుం గొన్నిసంవత్సరములు పట్టును. సిద్ధమయినప్పుడును దానివలన నిఘంటు సంపాదనకృత్యమునకు ఏపాటియు నుపయోగముండదు. మఱియు నిఘంటుగ్రంథలేఖన ప్రారంభమునకు ముందుగా ఈ భారతపదసూచియేమో సిద్ధముకానేరదు.

ఈభారతపదసూచియే గాక ఇట్టివే ఒకవత్సరమునుండి మఱియైదు గ్రంథములకు వ్రాయఁబడుచున్నవి. ఆఱుగురు పాఠకులు ముప్పదేసిరూపాయల జీతాలవారు వ్రాయుచున్నారు. అవి యింకను భ్రూణదశలోనే యున్నవి. పూర్తిచెందుటకు సమర్థతముల చేతులలో ఇంక నొక సంవత్సరము పట్టును, సిద్ధమయినను నిఘంటుకార్యమునకు అవి ఇంచుకేనియు పనికిరావు.

ఈపదసూచికలకై, నిఘంటుకార్యముపేర సంవత్సరమునకు రు. 12×30×6=రు. 2160 ల ధనమును ఇంక లేఖనసాధనములును వ్యర్థముగా వ్యయింపఁబడుచున్నవనుట స్పష్టము. పరిషత్తువారికి ఇవి కార్యాంతరమునకై వలయునేని వీనికై నిఘంటుకార్యార్థ ముద్దేశింపఁబడిన ధనమునుగాక వేఱుధనమును వినియోగించి వేఱువిచారణలో రచియింపించుకొనుట యుచితము. పాఠకులను నియమించుటకు నిఘంటు నిర్మాణసభవారు నిశ్చయించుకొనునప్పుడు ప్రధానసంపాదకుఁడు ఆయుద్యమమును మాన్పుటకై సభలో మాత్రమేగాక సభ్యులను కొందఱను ప్రత్యేకముగా సందర్శించి వేఁడియుం గూడ యత్నించెను. కాని యాతనిమాట నెవ్వరును పాటిసేయరైరి.

పాఠకులకు బదులుగా నలుగురైదుగురు పండితులను ఎక్కువ తెలివిగలవారిని రు. 40 ల పాటి జీతములకు, శబ్దరత్నాకరములో లేనివియు అందున్నవే

అయినను అందుచెప్పని యర్థములలో ప్రయుక్తములును అగు పదములను గ్రంథములనుండి వెదకి సమకూర్చుటకై నియమించుట మంచిదని ప్రధాన సంపాదకుఁడు బోధించెను. ఆపనిని నిఘంటు సభవారు చేసినవారుకారు. ఆ పని చేసియుండినయెడల ఇప్పటికి పదాన్వేషణకార్యము సమాప్తిఁ జెంది యుండును.

పదాన్వేషణనిమిత్తమై అథమపక్షము 200 పుస్తకములను పఠింప వలయునని నిబంధించినారు. అందులకై 110 పుస్తకముల జాబితాను ప్రధాన సంపాదకుని కిచ్చినారు. వానిలో అతఁడు స్వయముగా భారతాది కములగు పుస్తకములనుచదివి వానినుండి పదప్రభృతులను సంకలించి యున్నాఁడు. ఆ 20 గ్రంథములెవ్వియన:—

| | |
|---|---|
| 1 ఆంధ్రభారతము | 11 నిర్వచనోత్తరరామాయణము |
| 2 కాశీఖండము | 12 ఉత్తరహరివంశము |
| 3 లక్ష్మీనరసింహపురాణము | 13 కళాపూర్ణోదయము |
| 4 నన్నెచోడుని కుమారసంభవము. పూర్వభాగము. | 14 ఆముక్తమాల్యద |
| 5 అదే ఉత్తరభాగము | 15 రామరాజీయము |
| 6 కృష్ణరాయవిజయము | 16 శృంగారనైషధము |
| 7 భీమఖండము | 17 యాజ్ఞవల్క్యస్మృతి |
| 8 కేతనదశకుమారచరిత్రము | 18 వేంకటపతి విజయవిలాసము |
| 9 వేంకటపతి సారంగధరము | 19 ఎఱ్ఱనహరివంశము పూర్వభాగము |
| 10 హరవిలాసము | 20 అదే ఉత్తరభాగము |

ఇందు భారతేతరములగు 19 గ్రంథములను చదువుటకు ప్రధాన సంపాదకునికి 4 నెలలు పట్టినవి. ఇచ్చట అనుషంగికముగా ఈక్రిందివిష యము చెప్పవచ్చును. ప్రధానసంపాదకుఁడు స్వతంత్రముగా కైకొన్న కార్యవిరామ మాసములలో వినోదార్థముగాను అలసతాపనోదార్థముగాను స్వబోధార్థముగాను ఈక్రింది 9 గ్రంథములనుంబఠించి వానిపై ఆ 20 టి పైనింబోలె జ్ఞాపికాపుస్తకములను వ్రాసినాఁడు ఆ 9 ఎవ్వియన:—

1 మనుచరిత్రము
2 పారిజాతాపహరణము
3 పరమయోగివిలాసము
4 పాండురంగమాహాత్మ్యము
5 భోజరాజీయము
6 శ్రీ కాళహస్తిమాహాత్మ్యము
7 నరసరాజీయము
8 కవికర్ణరసాయనము
9 గౌరనహరిశ్చంద్ర ద్విపద

నిఘంటుసభానియమములవలనను తత్కార్యాలయములవలనను సంభవించిన యిబ్బందులు లేక పగటివేళ చల్లనిసమయములలో, కంపు, శ్వాసనిరోధము, కన్నులయెదుట మింటి యుగ్రదీప్తి, ఎండవడయు, లేనితావులయందు, కాలనిర్బంధములేక, పనిచేయుచో తాను ఏపాటిపనిచేయగలఁడో చూచికొనవలయునను నుద్దేశ్యముతో ప్రధానసంపాదకుఁడు అవిరామమాసములో ఆగ్రంథములను పఠించినాఁడు. ఆదినములలో అతనికితోడుగా నొక పండితుఁడుండెనేని, 9 కి బదులు 18 గ్రంథములను చదివియుండును. ఇందువలన పరిషత్కార్యస్థానములో అతనిపని కేర్పడిన సంవిధానములు శీఘ్రకరణమునకు ప్రతికూలము లగుట తెలియనగుచున్నది.

ఈ రెండుసంవత్సరములలో రు 50, 40, ల జీతగాఁడు ఒకపండితుఁడు సాయముగా నీయఁబడియుండినయెడల, ప్రధానసంపాదకుఁడు తనకావించిన పనికి రెండింతలుచేసియుండును. అట్టి పండితుని ఇచ్చుట ఆవశ్యకమని అతఁడు ఒకటియునర సంవత్సరమునకు పైగా విసువక నిరంతరము హెచ్చరింపఁగా, 5 నెలలక్రిందట రు 35 ల జీతమున నొకనిని నియోగించినారు.

నిఘంటుకార్యస్థానములో జరుగుచున్నపనులలో నిఘంటువు నిమిత్తమై ప్రయోజనపడునట్టిది—ఇంతకాలము అసహాయుఁడుగాను, ఇప్పుడు ఆ సహకారితోను ప్రధానసంపాదకుఁడు చేయుచున్నపని యొక్కటియే.

ప్రధానసంపాదకుఁడు చేయుచుండినపనియొక్క గుణమును రీతిని బోధచేసికొనక నిఘంటుసభవారు ఒకప్పుడు కొందఱు సభ్యులయుత్సాహముచే అతనియందు అలసతాదోషమును ఆరోపింపనెంచిరి. అంతలో మరల,

అతఁ డొక్కఁడు జేయుచున్నదిమాత్రమే కార్యస్థానమందలి కార్యము లన్నిఁటిలోను నిఘంటూపయోగియని తెలిసికొనిరి.

ఇట్లుండఁగా వెండియు సందేహము కలిగినవారై అతనిని పదసంగ్రహణరూపమైన మంచిపని మానిపించి అంగులకుబదులుగా తనజ్ఞాపికలను ఎవ్వఁడేనియు ఏపాటివాఁడేనియు నిఘంటువులో ప్రవేశపెట్టుటకు తగిన యట్లుగా విస్తరింపుమని యాజ్ఞాపించిరి. అంతట సంపాదకుఁడు జ్ఞాపికలను విస్తరింపవలసినతీరును ఏర్పరించుటయనెడి యుత్కృష్ట (సంపాదక) కృత్యమును, దానితోఁగూడ ఆవిస్తరములు తానే వ్రాయుటయనెడి నికృష్ట (లేఖక) కృత్యమును, రెంటిని తానొక్కఁడే చేయఁగలసినవాఁడాయెను. అతఁడు పలుమాఱు 'తెలుపుడుచేసికొనఁగా, తుదకు, పూర్వోక్త నికృష్టకృత్యమును గావించుపనికి ఒక పాఠకుని రు. 35 లు జీతముచేసి నియమించినారు.

సంపాదకుఁడు 1½ సంవత్సరము తావ్రాసిన 19 జ్ఞాపికాపుస్తకములలో భారతమునకు సంబంధించిన 8 పుస్తకములను ఇప్పటికి విస్తరలేఖనమునకు తగినతీరున పునఃపరిశీలనచేసినాఁడు, పూర్వోక్తపాఠకుఁడు వానిని విస్తరించుచున్నాఁడు. సంపాదకుఁడు కోరినప్రకారము ఆదినుండియు ఇరువురు సహకారులను ఆతనికిచ్చియుండిన ఈ పునఃపరిశీలన ము అనావశ్యకమగును. జ్ఞాపికలును సగముకాలములో నే వ్రాయఁబడియుండును.

పాఠకులకు ఇంకను పదసూచికలు వ్రాయుటకు అముద్రితగ్రంథము లీయఁబడలేదు. ఉన్నముద్రణములు పదసూచికాలేఖనమునకు అర్హమగు నట్లు శుద్ధముగానున్నవని తలంచుట యొక పొరఁబాటు.

సంపాదకుఁడు నిఘంటుసభవారికి వారమువారము తాఁజేసిన కార్యమును నివేదనచేయవలసినట్లుగా నిబంధన యొకటికలిగినది. అందువలన ఆతని పని కంటితో కొలువఁదగినదిగాను కాగితముల సంఖ్యచే తెలియవలసినదిగాను ఏర్పడినది. ఈనియమనముమూలముగా అతనిపనికి మిక్కిలి ఆటంకముకలిగినది.

అతఁడు ఎప్పుడును నిఘంటుపని త్వరలో ముగియు నుపాయములను పన్నుచుండెను. వానిని వేనిని సభవారు కైకొనక వానికిబదులుగా ధన

మును మంచికాలమును పాడుసేయునవైన యసాధ్వాసంభావ్యోద్యమము లను కల్పించుచుండిరి.

ఈనడుమ నిఘంటుసభవారు పదసంగ్రహణార్థమై బయటి పండితు లకు కొన్నిగ్రంథములను నియమించుచు వానిలో ఇంతకుపూర్వమే ప్రధాన సంపాదకుఁడు పఠించి జ్ఞాపికలు వ్రాసినపుస్తకములలో నాలుగింటిని.—

1 నన్నెచోడుని కుమారసంభవము 3 కేతనదశకుమారచరిత్రము

2 శ్రీనాథుని హరవిలాసము 4 రామరాజీయము

అనువానినిచేర్చిరి. ఇందుల కాతఁడు ఆశ్చర్యపడియు తాఁజేయుపని కిని బయటి పండితులుసేయుపనికిని గలుగు తారతమ్యము తనకును నిఘంటు సభవారికిని ఆయేర్పాటుమూలముగా బోధపడునుగాక యనుతలంపున దానిని ఆక్షేపింపక యూరకుండెను.

సభ్యులు కొందఱు కొకతాళీయముగా ప్రధానసంపాదకుని వ్రాఁత లందు ఏపుటలోనేని ఏపంక్తినేని తిలకించి అందలి సూక్ష్మవిషయములం గూర్చి 'ఈపదమువ్రాసియుండవలసినదిగాదు; ఈపదము అనావశ్యకముగా వివరింపఁబడినది; ఈయర్థమునకు ప్రమాణములు అనావశ్యకముగా వ్రాయఁ బడినవి!'' అని యీతీరున నభిప్రాయములను అసాధువులనే వ్రాసిరి. అతఁడుచేయుచున్న పనిలోని గుణమును విశేషజ్ఞులుమాత్రమే గ్రహింపఁ గలరు. వారేనియు కాలము వినియోగించి యవధానమొసంగిననేగాని యెఱుంగ నేరరు. సాధుత్వమునకు ప్రామాణికత్వమునకును వలసినంతయాద రమును సభవారు వహింపలేరని సంపాదకుఁ డభిప్రాయపడుచున్నాఁడు.

నిఘంటువును ఒక్కటేకట్టడముగా సమకట్టుటకును, దానిభాగము లను యోగపద్యమునంగాని, యథాక్రమమునంగాని, ఏవరుసనరియో యావరుసను, కట్టించుటకై సంవిధానముసేయుటకును, సభవారు సంపాద కునికి అవకాశ మిచ్చుటలేదు. పునాదికంటె ముందుగా గోడలను లేపు మందురు, గోడలకంటె కంబములకంటె ముందుగా మిద్దెకట్టుమందురు. అత

నిని తనపద్ధతులనే అవలంబించి పనిచేయనిచ్చియుండిన ఇప్పటికి గ్రంథములనుండి శబ్దాన్వేషణమయినను ముగిసియుండును.

నిఘంటుసభ కార్యసాధకము గాదు.

సంపాదకుఁడు ఇట నుదాహరించుటకు తాను ఇచ్ఛగింపని కొన్ని ప్రబల కారణములచేత ఈయనంతరవిషయమును రూఢిగా జెప్పుచున్నాఁడు:— నిఘంటుకార్యస్థానమును, పరిషత్కార్యస్థానమునఁ గాక దానితో నెట్టిసంబంధమునులేనిదిగా దానికి కడుదూరముగా వేఱొకగృహములో, ఉంచి, నిఘంటుసభయొక్క సమావేశములును దానిచర్చలును ప్రధానసంపాదకునికిందక్క కడమ నిఘంటుకార్యస్థాన నియుక్తులకును, పరిషత్కార్యస్థాన నియుక్తులకును బొత్తిగా తెలియకయుండునట్లు సాధించియుండిన యెడల, ఈజరిగిన నిఘంటుకార్యము ఇంతకన్న మిక్కిలి చక్కఁగా నెఱవేఱియుండును.

మదరాసు. 1-11-17 } ప్రధానసంపాదకుఁడు,
వేదము వేంకటరాయశాస్త్రి.

అయ్యా, ఈక్రిందిపంక్తులను సానుగ్రహులై చిత్తగింపఁ బ్రార్థించుచున్నాఁడను.

ఈనివేదనమును నేను విశదీకరణార్థమై మొక్కపాటి సుబ్బారాయఁడు గారికి పంపితిని. ఆంధ్రసాహిత్యపరిషన్మంత్రిసభలో తామొకసభ్యులైన సుబ్బారాయఁడుగారు, 3-11-1917 తేదిలో ఆసభలో దీనిని మదనుమతిం జెంది పఠించి యిందులవిషయములకు తమయంగీకారముం దెలిపిరి. అందఱు నంగీకరించిరి. అగ్రాసనాసీనులైన శ్రీయుత జయంతి రామయ్యపంతులుగారు మాత్రము ఇందుపన్యస్తములయిన కాయిక క్లేశములు నా కొక్కనికే చెందినట్టివని వక్కాణించిరి. అందులకు నేను "నేనిపుడు పనిచేయఁగూర్చుండుచోట ఇంచుక సేపు కూర్చుండువారికెల్ల ఆబాధలెల్ల సంభవించును." అని వచించితిని.

శ్రీ పిఠాపురము రాజాగారు తమకోరినప్రకారము నిఘంటునిర్మాణ కార్యమును మదరాసునుండి కాకినాడకేని పిఠాపురమునకేని కొనిపోయి తమ సమీపముననే, తమయాధ్యక్ష్యముననే, అట్లయినను, ఆంధ్రసాహిత్య

పరిషత్తు వారి పరామరిక క్రింద జరుపుకొనవచ్చుననియు, మదీయ సంపాద కత్వము 4-11-17 తేదినుండి మూఁడు నెలలకు మదరాసులోనే నివర్తిల్లు ననియును ఆసభలో నిర్ణయములు సేయఁబడినవి. పరిషత్తువారి పరామరికం గూర్చి నాతోఁగూడ శ్రీయుతులు వేమవరపు రామదాసుపంతులు బి. ఏ., బి. ఎల్., గారును, నాగపూడి కుప్పుస్వామయ్య బి. ఏ., గారును "ఈ నిఘంటుకార్యము మనచేతినుండి తొలఁగి దూరదేశమునకుపోయిన పిమ్మట దీనిపై మన పరామరిక యేల." అని యాక్షేపించిరి. ఆయాక్షేపము రామయ్యగారికి అసమ్మతముగా నుండినది. సభలో అది నెఱవేఱలేదు.

నిఘంటు సభాసమ్మేళకులయిన శ్రీయుత గుమ్మడూరి వేంకటరంగ రావు ఎమ్. ఏ., గారు, 1914 సం. లో మదరాసులోను, 1915 సం, లో నెల్లూరిలోను, నాతో "మీరు ఏతన్నిఘంటుసంపాదనాధికారమును వహింప వలయునని పరిషత్తువారి యభిమతము; దానిని మీరు నెఱవేర్చిన ఆంధ్రలోక మునకు ఉపకారమును మీకు కీర్తియును గలుగును; కావున మీరీయధి కారము నంగీకరింపఁదగును." అని బోధించిరి. వెంటనే నెల్లూరిలో మద రాసులోని యొకానొక పరిషత్సభ్యుని బంధుమిత్రులవలననుండి పారంపరీణ ముగా "ఈయధికారమున ఈయనను రెండుసంవత్సరములే యుంతురు. అప్పటికి ఫవానివారలు రాజకీయోద్యోగవిరతులై స్వయముగానే దీనిం బూనుదురు." అని యొక కింవదంతి కలిగినది. అనంతరము నేను మద రాసులో వేంకటరంగరావుగారిని దర్శించి ఆకింవదంతిని నివేదించి "ఏమట్లు జరుగునా? అట్లైజరుగు నేని, ఈయుద్యోగంపు జీతముపాటి యాయతిని నా కొసంగందగిన ముద్రాశాలా వ్యాపారమును దీనికై మానుకొని ఇదివిరమించి నంతట నిరాధారుఁడనగుదునే!" అని యడుగఁగా, వారు "నేను సమ్మే ళకుఁడనుగా నుండఁగా అట్లు జరుగనేరదు." అని వాక్రుచ్చిరి. ఆమాటపై ఈపనిని 5 ఏండ్లనియోజనమును, 2 ఏండ్లకనంతరము ఇరుపక్షములను 3 నెలల హెచ్చరికచే విరామనియమనమును, గైకొంటిని. ఆరెండేండ్లునయి నవి, కింవదంతియు నొకవిధముగా నెఱవేఱినది.

ఈయుద్యోగమున్నంతకాలము నాయచ్చుకూటంపుఁ బనులం జూచుచుండినవారు వంచకులై నష్టములుకల్పించి ఈరెండేండ్లు మదీయసంపాదకవేతనమును ఇంకనధికమును హరించిరి. అందువలన నాకు సంభవించిన యొడుదొడుకులను దిద్దుకొనుటకై అచ్చుకూటంపు సామానులను నిశ్శేషముగా విక్రయించి ఆవ్యాపారమును త్యజించి తాను మిగిలియున్నాఁడను.

లోకక్షేమదీక్షితులైన మీహృదయమందలి పరమాత్మ ఈవృత్తమును అవధరించును గాక.

ఇట్లు విన్నవించుకొనువాఁడు
దేశక్షేమపరాయణుల విధేయుఁడు.
వేదము వేంకటరాయశాస్త్రి.

నిఘంటుసంపాదకత్వ మీవిధముగా తేలిపోయినది. శృంగారనైషధ ముద్రణానంతరము శాస్త్రులవారికి చిక్కులు వచ్చినవి. మదరాసునుండి నెల్లూరికి అచ్చాఫీసునుమార్చినది ప్రారంభమైనది. వ్యాపారము చెడినది. ఇంతలో ఆశ్రిత కల్పవృక్షము శ్రీ మహారాజావారు సాయపడిరి. కాని అసహాయము యొక్క ఫల మనుభవించులోపల నిఘంటూపద్రవము వచ్చినది. ఇంతలో ఆప్రభువు నిష్క్రమించెను. నైషధవ్యాఖ్యానకృతిపతి శ్రీ లక్ష్మీనరసారెడ్డిగారును గతించిరి. శ్రీనాథుని చరమదశవలె నేర్పడినది. నిఘంటువైనను తమపేరిట వెలయునుగదాయని మనశ్శాంతి చేసికొనుటకు లేక అసంపాదకత్వము చాలించుకొనవలసివచ్చినది. శాస్త్రులవారికి మరల నచ్చాఫీసే గతియైనది. నిఘంటువు శాస్త్రులవారి చేతినుండి తప్పిపోయినదిగదా యనుచింత శాస్త్రులవారి స్నేహితులకే గాక ప్రతివాదులకును ఏర్పడినది.

---

౨౧-ప్రకరణము

## జ్యోతిష్మతీ విక్రయము.

సూర్యరాయనిఘంటువును వదలిన వెనుక రెండుమూడు సంవత్సరములు తాతగారికి గ్రంథరచన కవకాశము దొరకలేదు. బొబ్బిలియుద్ధనాటకమును 1916 సం మున ప్రకటించిరి. దానిని శ్రీ మహారాజావారికి పంపుకొనుభాగ్యము వారికి లభింపలేదు. ఆ వెనువెంటనే 1918 సం ఫిబ్రవరి నిఘంటువుతో సంబంధము వదలిపోయినది. వెంటనే జబ్బుపడి సెప్టెంబరు నెల వరకు ఆరోగ్యము తప్పియుండిరి. అప్పులవారు చుట్టవేసికొనిరి. శ్రీ మహారాజావారికడ నప్పుగాతీసికొనిన ద్రవ్య మింకను చెల్లింపలేదు. ఈరెండేండ్లను గుమాస్తాలుచేసిన ద్రోహమునకు మితములేదు. దాదాపు ఐదారువేల రూప్యముల ఋణ మేర్పడియుండెను. రెండేండ్లు ఎట్లో అచ్చాఫీసును నిలుపుకొన వలయునని తాతగారు ప్రయత్నించిరిగాని సాధ్యము కాలేదు. తుదకు జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను విక్రయించివైచి ఆ ఋణములనెల్ల నిశ్శేషముగా తీర్చివైచిరి. వారికి మదరాసులోని యిల్లును తామదివరకు ముద్రించియుండిన పుస్తకముల కట్టలును మిగిలినవి. పుస్తకవిక్రయముచే నేర్పడిన ద్రవ్యముచే కుటుంబమును నిర్వహించుకొనుచు, కొంత మనశ్శాంతినంది, 1919 సం ము నుండి మరల గ్రంథరచనకు ప్రారంభించిరి.

అచ్చొపీసును విక్రయించుట కిష్టములేకపోయినను తప్పని సరియైనందున విక్రయించిరి. విక్రయించిన ప్రథమమున చింతాకులులై యుండిరి. కాని వెనుక కొంతమనశ్శాంతి చేకూరినది. జోడువర్షములకరిసి వెలిసినట్లైనది శృంగారనైషధము వెలువడినప్పుడే 'చేసెదనింకఁ దత్పరతసేవలు చూడికుడుత్తదేవికిఁ' అని వ్రాసియుండిరి. తాతగారు మరల నద్దానిని ప్రారంభించి కృషి సలుపసాగిరి. శ్రీ పిఠాపురము మహారాజావారు ఒక జాబులో నిట్లు వ్రాయించిరి—

About Amukta-Malyada the Rajah wants me to write to you to say that he would like to have it just like your విజయవిలాసం in size (if possible even a little smaller), type and get-up. If necessary he says it my be split up into two volumes Naishadha, he considers to be very ponderous and unwieldy. He would be glad to know your views.

తాతగారిట్లు వ్రాసినారు. "వ్యాఖ్య ఈపాటి విపులమగునని ఆదిలో నేను ఊహించుకొనలేదు. కొండొకవ్యాసములకు వ్రాసిచూడఁగాఁ బావిత్ర్యవ్యాఖ్యాచేతాళములు వెలువడినట్టులయినది. గ్రంథమునకెల్ల జీర్ణోద్ధారమే కావలసివచ్చినది. అందులకై సమగ్రసంస్కరణ — సాధుపాఠనిర్ధారణ — కువ్యాఖ్యావిషహరణ—సమంజసార్థావిష్కరణపూర్వక విపుల వ్యాఖ్యానమును వ్రాయ నుద్యమించితిని."

ఈ వ్యాఖ్య వ్రాయుచు నడుమ విశ్రాంతికై 'అధికమనో వ్యాపారము శక్యము కాని వేసవిదినములలో' విష్ణుచిత్తీయ టీకారచనను కొంత నిలిపి, కాలయాపనకొఱకు మాళవికాగ్ని మిత్ర ఉత్తరరామచరిత్రములను అనువదించిరి. పిదప రత్నావళీ విక్రమోర్వశీయములను ఆంధ్రీకరించిరి. వ్యాఖ్యారచన కష్టమని తోఁచినప్పుడు మధ్యమధ్య చిన్నపుస్తకములను వ్రాయుటయో ఉపన్యాసముల నిచ్చుటయో చేయుచుండిరి. ఈకాలమున రచించినవే తిక్కన సోమయాజివిజయమును విమర్శవినోదమును.

ఆముక్తమాల్యద వ్యాఖ్యారచన తేది 24-6-1920 నాఁడు ప్రారంభించి తేది 28-10-20 నాటికి పూర్తిగావించిరి. కొన్ని కొన్ని భాగములను ముద్రణవశమున వ్రాసికొనవచ్చును గదా యని వదలియుండిరి. నాలుగుపుటల వచనమునకు వ్యాఖ్య తర్వాత మదరాసులో 1926 సం. మున వ్రాసినవిషయము నేనెఱుఁగుదును. నేను నిరంతరము తాతగారిచెంతనే యుండువాఁడను, ఆగదిలోనే నిద్రించువాఁడను. ఎప్పుడైనను నేను నిద్రమేల్కొని చూచునప్పుడు తాతగారు వ్రాయుచునేయుండువారు. రాత్రి పదునొకండు గంటలకు, అర్ధరాత్రి, రెండు గంటలయప్పుడు, తెల్లవాఱుజామున, నెప్పుడుచూచినను వ్రాయుచునేయుండిరి. వారెప్పుడు నిదురబోవువారో తెలియదు. 'అవిదితగత యామా రాత్రి రేవ వ్యరంసీత్.' తాతగారి నాటి చర్య నాకు ఇప్పుడు ఆశ్చర్యకరముగానున్నది. 'ఆముక్తమాల్య

దకు వ్యాఖ్య వ్రాయుటకై కొన్నిసంవత్సరములు చదివితిని; వ్యాఖ్యనుమాత్రము ఆఱు నెలలలో వ్రాసితిని' అని నాకొక మాఱు చెప్పినారు. ఒకదినము నిదుర లేచినది మొదలు వ్రాయుచునేయుండి మధ్యాహ్నమున నిదురఁబోయి సాయంకాలము ఆఱుగంటలకు లేచి అప్పుడే తెల్లవాఱినదని తలంచి దంతధావనము చేసికొనుట కారంభించిరి. 'తాతగారూ, ఇప్పుడు సాయంకాలముగదా. ఇంక కొంతముసేపు చీకటిపడును' అని నేను హెచ్చరించితిని. చీకటిపడిన వెనుక వారికి బోధపడినది.

ఒకమాఱు పరధ్యానముగా పోవుచు వెనుకవచ్చుట్రాము కారును సైతము తెలిసికొనక ఆట్రాము తన్ను తాకునంతి దూరము వచ్చిన వెనుక నులికిపడి తప్పించుకొనిరి. ఆసమయమున వారేదో గ్రంథమును ధ్యానించుచుండిరి.

ఆ వెనుక సాహిత్యదర్పణము నాంధ్రీకరించుటకు 2-2-21 నాడు ప్రారంభించి 11-4-21 తారీఖున పూర్తిగావించిరి. ఈ కాలముననో లేక కొంతముందో శారదాకాంచిక, షష్ఠకింకిణి, ఆంధ్రవ్యాకరణసర్వస్వవిమర్శను వ్రాసినట్లు తోచుచున్నది. ఐదవకింకిణి యేదియో నాకు ఇంకను తెలియలేదు. బహుశః శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి మోచాకుసుమముపై వ్రాసిన 'మోచాకుసుమామోదవిచారము' అగునేమో. ఆంధ్రహితోపదేశచంపువను సయితము ఇప్పుడే వ్రాసిరి. నెల్లూరికేగిన వెనుక గ్రంథరచనచేయలేదు.

## ౨౨-ప్రకరణము.

## కొన్ని సత్కారములు.

౧౯౧౯ సం. మదరాసులో ఆంధ్రసారస్వతసభ జరిగినది. అందు సభ్యులు తాతగారికి 'మహోపాధ్యాయ' బిరుదము నొసంగుచు ౧౧౧౬ రూప్యములను సమర్పించిరి. గొప్ప సత్కారము జరిగినది. ఈసందర్భమున వారొక యుపన్యాసమొసంగిరి, అందలివాక్యములు కొన్ని—

"'యేనామ కేచిదిహ......' అని భవభూతి చెప్పుకొన్న తీరున—ఇన్నాళ్లకు నన్ను నేదిష్ఠనికటదూరదవిష్ఠ ప్రదేశములవారు మీరలు అభినందించితిరి.

"పూర్వము నవద్వీపమందు మహోపాధ్యాయ, మహామహోపాధ్యాయ బిరుదముల నొసంగు తెఱంగును పెద్ద లిట్లు చెప్పుదురు. పరీక్ష్యుండు ఏదేశమునుండియేని వచ్చును.... అది అభిజ్ఞమార్గము, అందు భీ గలదు. మదీయము భీ లేనిది, అజ్ఞమార్గము, వాగ్దేవతోపాసనారూపము.

"ఉపాసనయందును లఘు లఘీయో లఘిష్ఠ ప్రకారములు కలవు. అందు మదీయము లఘిష్ఠము. బాలోచిత కతిపయాల్పగ్రంథరచనా రూపము. మదీయజన్మాంతరపుణ్యవశంబున అంతపాటికే యుష్మద్రూపవాగ్దేవత వరమొసంగినది. మఱియు దేవతను ప్రసన్నయగువఱకు నుపాసింపవలయును

గాని త్వరపడినం బ్రయోజనమేమి. అట్లే నేను 40 సంవత్సరము లుపాసింపఁగా ఇప్పటికి మీ ప్రసాదము కలిగినది

“మదీయ భాషాభిమాన వివరము......

“మదీయవాగ్దేవతాపూజంలో—ఆవాహనము శ్రీ పునర్వాహాదుర్వాదనిర్వాపణము, ఆసనసమర్పణము కథాసరిత్సాగరము, అర్ఘ్యము ప్రతాపరుద్రీయనాటకము, పాద్యము మేఘసందేశాంధ్రటీక, అలంకారము ఆంధ్రప్రసన్నరాఘవనాటకాది విమర్శినికింకిణీగణశింజానశారదాకాంచిక, నైవేద్యము శృంగారనైషధసర్వంకష వ్యాఖ్య......”

ఆంధ్రసాహిత్యపరిషత్తువారి యష్టమ వార్షిక సమావేశమునకు తాతగారు అగ్రాసనాధిపతులుగానుండిరి.

నెల్లూరి వర్ధమానసమాజమువారు వీరిని ‘అభినవ మల్లినాథ’ బిరుదముతో గౌరవించిరి.

తిక్కన సోమయాజివిజయము ఉపన్యాసము. నెల్లూరి వర్ధమానసమాజమువారి కోరికమెయి తత్సమ్ముఖమున, పౌరసభలో 1919 సం, మే నెలలో పఠించిరి. ఇందు తిక్కనం గూర్చి పెక్కువిషయములం దెల్పిరి. అందు చమత్కారముగా నిట్లు చెప్పిరి.—“కారణవిశేషములచే కొందఱు గోదావరి జిల్లావారు ‘తిక్కన నెల్లూరి తెలుఁగువెట్టి భరతమును పాడు చేసినాఁడు.’ అని నిజమతిని మిత్రులతోఁ దెలుపుకొనుటయు, వారు దానిని నెల్లూరి యువరసికులమ్రోలం బలుకుటయు వీరు అందులకు కక్కసించుటయును సంభవించినది.

"అందులకుం బ్రతిమల్లముగా గుంటూరివారు తిక్కన గారు కృష్ణామండలమువాఁడనియు, భారతమునందు తమసీమ తెనుంగుంబెట్టి దానిని పుణ్యహృదాస్వాద్యమయిన సుధాతరంగిణిం గావించినాఁడనియు, వాదించుచున్నారు.—ఇప్పటికిని కృష్ణాపినాకినుల తెలుఁగులకు ఎక్కుడుభేద మగపడదు. సామ్యమే మెండు...తిక్కన నెల్లూరి తెనుంగునే భారతమునం బెట్టినమాట వాస్తవమేగాని పాడుచేసెననుట పాడిగాదు. పాడిచేసెనని కుడికట్టించుట ఇహపర సాధకము."

ఇట్లు కాలము గడచుచుండఁగా మదరాసునగరమునకు శ్రీ ఐదవజార్జిచక్రవర్తిగారి కుమారులు యువరాజుగా వేల్సు రాజకుమారులైనవారు (ఇప్పుడు విండ్సర్ ప్రభువు) 1922 సం. విచ్చేసిరి. ఆసందర్భమున మదరాసు విశ్వవిద్యాలయమువారి కోరికమేయి దక్షిణభారతదేశమందలి పండితులనెల్ల యువరాజుగారు సత్కరించిరి. శ్రీ తాతగారు ఆంధ్రపండితులలో ప్రథములుగా బంగారుతోడా, జోడుశాలువలచే సత్కరింపఁబడిరి.

నాఁటిదినచర్య కొంత వినోదముగా నుండును. ఆకాలమున నసహాయోద్యమము (N. C. O.) దేశమున ప్రవర్తిలుచుండెను. దేశమంతయు అట్టుడికినట్లుడికిపోవుచుండెను. ఆ దినము (జనవరి 13 తేది, 1922 సం.) ఊరిలో అల్లరులు హెచ్చుగా నుండినవి. జనులు ప్రాగ్రై ఆఫీసరులను, మోటారులలో పోవువారిని, ఆంగ్లవేషములవారిని పోనీయక ఆపుచు, వీథి

మారమత్తులకై పోసియుండినరాలను రువ్వుచు 'గంధికిజై, మహమ్మదాలీ షౌకతాలీకి జై' అని భీకరముగా నఱచుచుండిరి.

ఆదినము ద్వితీయాంధ్రపంక్తితులుగా సత్కారముం బొందవలసినవారు శ్రీ చదలవాడ సుందరరామశాస్త్రులవారు. వారు, ఈగుంపును తప్పించుకొని ఎట్లు యువరాజుగారి దర్శనమున కేగగలమను సంశయముతో, తమ ఉడుపులను మూటకట్టుకొని కొమారుని వెంటఁబెట్టుకొని చొక్కాయలేకయే, ఎవఁడో పౌరోహితునివలె మాయింటికి వచ్చిరి. తాతగారును భోజనము ముగించుకొని మోటారుకారుకై కాచుకొనియుండిరి. ఇంతలో నదియు రాఁగా వేషములను ధరించి బయలుదేరిరి. తంబుసెట్టి వీధిచివరకు పోకముందే అల్లరిమూఁక వీరిని అడ్డినది. గుంపంతయు చేత రాలుతీసికొనిరి. ఇఁక రువ్వవారే. బండిలోని వారి కందఱకును మతిపోయినది. భయపడసాగిరి. తాతగారు మాత్రము భయపడక డ్రైవరును పిలిచి 'గంధికిజై అని అరవరా' అనిచెప్పిరి. వెంటనే 'గంధికిజై' అని అతఁడనెను. గుంపు వెంటనే రాలురువ్వుటమాని వీరిని పోనిచ్చినది.

మెల్లగా నీయుపద్రవమును తప్పించుకొని సెనేటుహాలు సమీపమునకు పోఁగా పోలీసు సార్జంటు నివారించెను. అతఁడు ఆజానుబాహువు, గుఱ్ఱముమీఁదనున్నాఁడు. ఒకరిమాట విని పించుకొనుస్థితిలో లేఁడు కొన్నివందల మోటారుబండ్లు నిలిచి యుండినవి. మెల్లగా తాతగారే అతనిని పిలిచి తాము యువ

రాజుగారి దర్శనమునకు ఆహ్వానముచేత పోవుచున్నారమని తెలుపగా నాతఁడు పీఠబండిని మాత్రము పోనిచ్చెను.

లోనికిపోయినంతట వీరాసీనులైరి. మొదట తాతగారిని సంస్కృతమున కగ్రగణ్యులనుగా బహూకరించుట కేర్పాట్లు జరిగియుండినవి ఒకానొక ఆచార్యులవారికికూడ గౌరవము జరుగవలసియుండెను. ఒకవిశ్వవిద్యాలయోద్యోగస్థుఁడు తాతగారితో, వారు (తాతగారు) సంస్కృతాంధ్రములలో రెంటను ప్రధానస్థానమందగలవారనియు, ఆయాచార్యులు ఒక సంస్కృతమందే ప్రధానస్థానమునకు యోగ్యులుగాన, ఈయవకాశముపోయిన మరల వారికి అవకాశముదొరకదనియు, అందుచే తాతగారు ఆంధ్రపండితులలో ప్రధానస్థానము నందుట కంగీకరింపవలయు ననియు ప్రార్థించెను. తాతగారు తమ కియ్యది చాల గౌరవకరముని పలికి ఆంధ్రమందే బహుమతినందిరి.

ఎన్ని సత్కారములు జరిగినను, ఎంత ద్రవ్యము వచ్చినను సముద్రమునఁబడిన చక్కెరవలె కుటుంబభరణమునకును వైద్యములు చేయించుకొనుటకును వ్యయమై పోవుచుండెను. ముసలితనములో నిబ్బందులు పడలేక గదా ముద్రాక్షరశాలను విక్రయించిరి. కాని ఇబ్బందులు వారిని వదలలేదు. ఎన్నియవాంతరములు వచ్చినను తాతగారు ధైర్యము మానలేదు; దైన్యము వహింపలేదు. మరల నేదోయొకవిధముగా మంచికాలము రాక తప్పదనియే తలంచుచుండిరి.



## ౨3–ప్రకరణము

## నెల్లూరి కాపురము – ఋణము.

తాతగారికి అఱువదితొమ్మిది సంవత్సరము లైనవి. వృద్ధాప్యమువచ్చినది. అచ్చాఫీసు విక్రయించివేసిరి ఇక మదరాసులో నేలయుండవలయును. చేయుచున్నపని విద్యావిషయికము; గ్రంథములు వ్రాయుటయు ముద్రింపించుటయు. పోషకులు నెల్లూరనే యున్నారు; శిష్యులును అచటనేకలరు. జన్మభూమి. మరల నెల్లూరుచేరి తమశిష్యబృందము నడుమనుండి, తమనాటకములను వారిచే మునుపటికన్నను చక్కఁగా నాడించుచు, గ్రంథములు రచించి ప్రకటించుచు నెల్లూరనే కాలము గడపు కోర్కెజనించినది.

అనంతరము జరిగినవిషయములను మాకుటుంబమునకు మహోపకారముంగావించిన శ్రీ ఏనాదిరెడ్డిగారి మాటలలోనే ముద్రించెద. *"నెల్లూరు వర్ధమాన సమాజమువారి కోరికమేయి, వారి యాజమాన్యమున శాస్త్రులవారు కొన్ని యుపన్యాసములు గావించిరి. ఆముక్తమాల్యదనుగూర్చి యుపన్యసించునపుడు బ్ర. శ్రీ. మైదవోలు వెంగయ్యపంతులు, తూములూరు శివరామయ్యపంతులుగార్లు మొదలగు పెద్దలు శాస్త్రులవారింగూర్చి 'మీరు మాయూరి పండితవర్యులయ్యును మీవలన విశేషవిషయములం దెలిసికొనుట కందుబాటులేని మదరాసులో నివసించితిరి. నెల్లూర నివాస మేర్పఱచుకొని మాకు

---

* శ్రీ గునుపాటి ఏనాదిరెడ్డిగారిని వేదిక – వే. వేం. శాస్త్రి సహాయనిధి.

మంచివిషయములం దెలుపుచు మన్నాదరింపవలయు'నని కోరిరి. 'సరి మంచి కార్యమే, నాయూర, నాశిష్యుల, మిత్రుల మధ్యను నివసించుటకు నేనును సంతసించెదను. ప్రస్తుతము ఉద్యోగమును మానుకొంటిని. కుటుంబభారము నెక్కుడయినది. వృద్ధతయు ఋగ్ణతయు నధిగమించుచున్నవి. మదీయగ్రంథవిక్రయమునఁ గాలముఁ గడపుచుండు నేను వేలకొలఁది వ్యయించి యిల్లుగొనుట యెట్లుఘటిల్లును?' అని శాస్త్రులవారు సెలవిచ్చిరి. 'ద్రవ్యమునకై మీరాలోచింపవలదు. ఆభారము మాయందున్నది.' అని ఆ పెద్దలు వాక్రుచ్చిరి. 'అట్లైన నిల్లు గొనివెట్టుఁ' డని శాస్త్రులవా రిచట నివసించుట కంగీకరించిరి... శ్రీమాన్ నే. తిరువెంగడాచార్యులుగారు రంగనాయకుల పేటయందు రు 4500 ల కొకయింటి నేర్పాటుజేసి తెలియఁజేసిరి... విక్రయధనమునకుం దొందరకలిగి మొదట వాగ్దానమొనర్చిన మహనీయులకు తొందరచేయసాగితిని. ఈతొందరలోఁ జందాపద్ధతిని ధన మొడఁగూర్చుటకు వ్యవధిలేదు. ప్రస్తుత మేభ్యాంకిలోనైన నప్పుచేయించి చెల్లించి నెమ్మదిగ మనము ప్రముఖులసందర్శించి ధనము గడించి అప్పుతీర్చుట లెస్స' యని మైదవోలు చెంగయ్య పంతులవారు సలహానిచ్చిరి. అందరును సమ్మతించిరి.''

వెంటనే అయిదువేలరూప్యములకు ఈక్రొత్తయింటిని మామదరాసు ఇంటిని రెంటిని అడుమానముపెట్టించి తెచ్చిన పైకముతో ఆయింటిని కొనిరి. తాతగా రాయింట నివసింప

నారంభించిరి. ఆపెద్దలు ధనమువసూలుచేసి ఆయప్పును తీర్చుటకు ప్రయత్నించుచుండిరి. చూచితిరా! విధివిలాసము. అప్పను మాటలేక కాలము గడుపఁగోరి అచ్చాఫీసునే విక్రయించి నిశ్చింతఁగా కాలము గడుపుచుండిన బ్రాహ్మణునకి దైవము మరల ఋణమును అంటగట్టినది.

ఆసంవత్సరమే జూలై నెలలో తాతగారికి అఖండగౌరవము జరిగినది. పూర్వము వారికి క్రిశ్చియన్ కాలేజిలో శిష్యులుగానుండి అనంతరము సన్న్యసించి అప్పుడు జగద్గురువుగా శ్రీ శంకరాచార్యస్థాపిత శారదాపీఠము నధిష్ఠించిన భారతీకృష్ణ తీర్థస్వాములవారు (ఇప్పుడు పురిస్వాములవారు) తమపూర్వాశ్రమగురువులైన శాస్త్రులవారికి గొప్పసత్కారముచేసిరి. నెల్లూరిలో సర్వజనీనమగు నింపోలక మొకటి జరిపి అందు తాతగారికి ఆఱుబిరుదములను "మహామహోపాధ్యాయ, విద్యాదానవ్రతమహోదధి, పండితరాజ, వేదవేదాంగశాస్త్రజాల మహోదధి, సనాతనధర్మరత్నాకర, సర్వతంత్ర స్వతంత్ర" యనువానిని ఒసంగిరి. పైగా పుత్రపౌత్ర పారంపర్యముగా నెలకు నూటయేబది రూప్యములు తమ మఠమునుండి పంపుచుందున ట్లేర్పాటుగావించిరి. ఆసభకు దక్షిణభారత దేశమందలి ప్రముఖు లెందఱో వచ్చియుండిరి,

ఆసంవత్సరమే తాతగారికి చాలజబ్బుచేసినది. ఇంటిలో ప్రవేశించిన ముహూర్తమని కొందఱుతలంచిరి. శాస్త్రులవారు ఈదెబ్బలో చనిపోవుదురని యెల్లవారును భయపడిరి. కొన్ని

నెలలకు ఎట్లో ప్రాణసంశయదశనుండి తప్పించుకొనిరి. దీనిచే వారికేర్పడిన శరీరదౌర్బల్యముమాత్రముతగ్గలేదు. డెబ్బదిసంవత్సరములవయసు. పూర్వము మంచి యారోగ్యమునందుండిన వారగుట 'నాకుకూడా ముసలితనంవస్తుందని నేననుకోలేదురా' అని నాతోపలుమార్లు వచించువారు. కొన్నినెలలలో చాల ముసలివారైపోయిరి. పూర్వముండిన దార్ఢ్యముపోయినది. దౌర్బల్యమేర్పడినది. చరమదశ ప్రారంభమైనది. రానురాను మంచముమీదనే పరుండి యుండువారేగాని కుర్చీలోకూర్చుండి పని చేయుశక్తి తగ్గిపోసాగినది. కూర్చుండుటబద్ధకమై క్షౌరమే మాని వేయసాగిరి. గడ్డము పెరుగుటకు ఆరంభమైనది. పైగా నిరంతరము చదువుచునేయుండినందుచేతనో ఏమో కంట ఎల్లప్పుడును నీరుకారుటయు దృష్టి మందగించుటయు నేర్పడినవి.

ఈయుత్సవమైన కొన్నినెలలకు తాతగారికి గొప్ప దుఃఖము వాటిల్లినది. కలిమిలేములును సుఖదుఃఖములును కావడికుండలుగదా. వ్యాధిగ్రస్తులుగానుండిన మానాయన గారు, తాతగారికి ఏకైకసంతానము, 1922 సం డిసంబరు 14 తేది నెల్లూరి రంగనాయకులపేటలోని యింటిలో పరమపదించిరి. వార్ధక్యమున కలిగిన యీదుఃఖముచే తాతగారు క్రుంగి పోయిరి. మానాయనగారిని తాతగారు అచ్చాపీసుపనిలో నియోగించియుండిరి. చాలకాలము జ్యోతిష్మతీముద్రాక్షరశాలను వారునిర్వహించుచుండిరి. వారిది చక్కని అపరంజినిబోలిన శరీరచ్ఛాయ. వ్యాయామాదులలో చాలకుశలులు. బాల్య

ములలో లెక్కలేని ఆటపందెములలో ప్రసిద్ధినందిరి. సాండో పద్ధతి నవలంబించి శరీర వ్యాయామ మొనరించి మహాబలిష్ఠులు గాను బలవంతులుగానుండిరి. మదరాసులోనుండిన జెట్టీలును మల్లురును వీరికి దాసులు. గుఱ్ఱములపిచ్చియొకటి అధికముగా నుండెడిది. గుఱ్ఱపుస్వారి నేర్చుటయేగాక వానిని పందెములకు తయారుచేసిరి. ఏకకాలమున ఇంట మూడునాలుగు ఉత్తమాశ్వములను సిద్ధముగా నుంచుకొనియుండువారు. వీరపురుషోచితమైన జీవితమునుజరిపిరి. ఒకపాటి సంస్కృతాంధ్రములలో ప్రవేశముండినది. తాతగారి ఆముక్తమాల్యదావ్యాఖ్యకు, తాతగారు చిత్తుగా వ్రాసిన దానినంతయు మరల ముద్రణోచితముగా నకలు వ్రాయుచుండిరి. మొదటి నాలుగైదాశ్వాసములకు వీరు వ్రాసినదంతయు పదిలపరచియున్నాఁడను. తాతగారి వ్రాఁతకును వీరి వ్రాఁతకును తటాలున భేదముకని పట్టుట కష్టము. ఇంగ్లీషు వ్రాఁతయు నట్టిద. కాని వీరి వ్రాఁత తాతగారి వ్రాఁతకన్నను సుందరము. అరేబియన్ నైట్సు ఎంటర్టేన్ మెంట్సు కథలను సమగ్రముగా తెనుఁగులోనికి తర్జుమా చేసి ఏకారణముచేతనో వ్రాఁతప్రతిని చింపివేసిరి. కృష్ణలీలాతరంగిణి వీరికి గుడ్డిపాఠము. కంఠస్వరము అతిమనోహరము. ఏమైననేమి, కొంతకాలమైనతర్వాత, విశేష శరీరవ్యాయామ మొనరించువారికి అభ్యాసమగునట్టివి కొన్ని వీరికలవడినవి. క్రమముగా అభినియలవాటైనది. 'ఎల్లమందుల గెలుపొందు నల్లమందు.' తొలుత ఇది దేహదార్ఢ్యమున కుపకరించినను

క్రమముగా శరీరమును క్రుంగదీసినది. ఏపనిచేయుటకును ఇచ్ఛ లేకపోయినది. మఱపు అధికమైనది. తుదకు అచ్చాఫీసు వ్యవహారములయందు అశ్రద్ధ యెక్కువయైనది. తాతగారికి తుది దినములలో కుమారునిగూర్చిన చింతయొకటి యేర్పడినది. మానాయనగారికి క్రమముగ శరీరమందు దౌర్బల్యమేర్పడి తుదకు నెల్లూరి కేసు కాలమునకు ప్రాణాంతికమైనది.

తాతగారికి అనారోగ్యము వృద్ధికాజొచ్చినది పాదములు రెండును వాచినవి. ఈవాపుమాత్రము చనిపోవువరకు నుండినది. స్వాములవారు అసహాయోద్యమములో పాల్గొని జెయిలుకు పోయినందున వారిసహాయము నిలిచిపోయినది. అప్పు ఒకటి క్రొత్తగా నేర్పడినదిగదా యనుచింత హృదయశల్యమై బాధించుచుండెను. ఈకష్టపుదినములలో శ్రీ గునుపాటి ఏనాదిరెడ్డిగారు వారిఋణవిముక్తికి తాముపాటుపడగలమని చెప్పుచు అందులకై ప్రయత్నములు చేయుచు వారిని ఓదార్చుచుండిరి.

శ్రీ రెడ్డిగారు తమని వేదికయందిట్లువ్రాసియున్నారు. "ధనసంపాదనకై తొలుత వాగ్దానమొనర్చిన పెద్దలను పలుమార్లు సందర్శించి వారు నిర్ణయించు వాయిదాలకెల్ల హాజరగుచుంటిని. . .ధనసంపాదనము జరిగినదికాదు, దినదినమునకును వడ్డి పెరుగుచుండెను. ఋణప్రదాతలు త్వరపెట్టసాగిరి. తొలుతటి వాగ్దాతలకును మిత్రులకును శిష్యులకును శాస్త్రుల

వారు జాబులు వ్రాయసాగిరి. ప్రత్యుత్తరములు వ్రాసిన వారు కొందఱును వ్రాయనివారు కొందఱునుగ పరిణమించెను. స్వస్థలమున నివాసమేర్పఱచుకొంటిమని సంతసించుటకుబదులు శాస్త్రులవారికి ఋణశల్యమేర్పడెను.''

తాతగారి తుదిదినములు ఈవిధముగా పరిణమించినవి. ఏదైనను ద్రవ్యమువచ్చిన వెంటనే దానికి రెండింతలు ఖర్చు కాచుకొనియే యుండెడిది. ఎన్నడును జీవితమున సత్కారములకై నానారాజసందర్శనములకేగు వలవాటు బొత్తిగా లేని వారైనను శ్రీగద్వాల సంస్థానప్రభువులు శ్రీ సీతారామ భూపాలరావు బహద్దరు వారిని దర్శించుటకై 1924 సం. గద్వాలకుపోయిరి. అచ్చట మంచి సత్కారమే జరిగినది. ఆస్థాన పండితులు ఎక్కువగా నభినందించిరి. ఆపండితులు పిఠాపురాస్థాన వారితో ... విద్యావిషయములలో శాస్త్రులవారితో ప్రసంగించుచు దినదినమునకు శాస్త్రులవారిమీది భక్తి అధికమగుచుండఁగా నొకదినము వారు చెప్పినవిషయములకు ఆశ్చర్యపడి ''మేము ఎన్నడును స్మార్తులకు నమస్కరించినదిలేదు; ఇదుగో సరస్వత్యంశ సంభూతులకు తమకు నమస్కరించుచున్నాము'' అని పాదానతులైరి.

శ్రీ పుల్లగుమ్మి వేంకటాచార్యులవారు శాస్త్రులవారి వంటిపండితుని కనివిని యెఱుఁగమని యిట్లు శ్లోకమును వ్రాసిరి—

శ్లో. ఈదృగధీతీశాస్త్రే గ్రంథాన్ గ్రంథజాలేచ
అన్యత్ర గ్రంథేష్వితథా నహిదృష్టః శ్రుతచరోవాఽపి.

ఇంకను పలువురు శ్లోకములను పద్యములను వ్రాసి యున్నారు. శ్రీమహారాజావారు తాతగారిని తమ యాస్థానమునందు కొంతకాలముంచుకొని 600 రూప్యములును బంగారుతోడా జోడుశాలువలు నొసంగి మార్చి 26 తారీఖున వీడ్కొలిపిరి.

నెల్లూరిలో తాతగారికి శిష్యులు సంపాదించిన గృహము చాలపాతది. అందులో వారు చేరిన క్రొత్తలో తలుపులు లేవు. పైనదూలములు అడవికొయ్యలు. వానకాలమున బొత్తిగా నిలువనీయకుండదు. ఎంతమాత్రము నివాసయోగ్యముగా నుండలేదు. గద్వాలనుండి వచ్చినవెంటనే పైకప్పునెత్తిన పడకుండ ఇంటినికాపాడుకొనుటకు ఆడబ్బు ఖర్చైనది. ఇట్లే వచ్చిన ద్రవ్యమంతయు వ్యయమగుచుండినది. ఇట్టివానికి పోఁగా మిగిలినది ఇంటికి చెల్లుచుండినది.

## ౨౮-ప్రకరణము.

## ఆంధ్ర భాషాభిమాని సమాజము.

రంగనాయకులపేటలో నున్నంతకాలము తాతగారికి విద్యావినోదములచే కాలము జరుగుచుండెడిది. నిత్యము సాయంకాలములయందు శిష్యులువచ్చి వాకిటి తిన్నెపై సమావేశమై సంస్కృతాంధ్ర కావ్యనాటకములను వారికడ చదువుచుండిరి. ఆంధ్ర భాషాభిమాని సమాజము, నాడు, ౧౯౦౦ సంవత్సర ప్రాంతమున, స్థాపితమైనట్టిది, ఇంతకాలము నిరంతరాయముగా జరుగుచువచ్చినది.

కందాడై శ్రీనివాసన్ గారు (దొరసామయ్యంగారు), నేలటూరు తిరువేంగడాచార్యులు (బంగారయ్య)గారు, కొండగుంట వేంకటరమణశాస్త్రిగారు, గూటూరు శివకామయ్యగారు, నందగిరి హనుమంతరావుగారు, యగుశీపాటి వేంకటాచలము పంతులవారు, వారి సోదరులు య. గోపాలకృష్ణరావుగారు, (నేటిప్రసిద్ధ సినీమాదర్శక శిఖామణులలో నొకరగు వై. వి. రావుగారి తండ్రిగారు) ఇంకననేకులు మొదటమొదట తాతగారి శిష్యులై ప్రతాపరుద్రీయము, ఉష, శాకుంతలము, నాగానందము, లను నాటకములను నెల్లూరిలో ప్రదర్శించుచుండిరి. ఈ నటులందఱు బి. ఏ. లు. పైగా సంస్కృతాంధ్రములయందు మంచి ప్రవేశముగలవారు. కందాడై శ్రీనివాసన్ గారు, క్రైస్తవ కళాశాలలో తాతగారి శిష్యులై యుండిన వారు, సమాజమున మొదటినుండియు నాయకుని వేషమును

ధరించుచుండిరి. ప్రతాపలో ప్రతాపుఁడుగాను, శాకుంతలములో దుష్యంతుఁడుగాను కీర్తిగాంచినవారు వీరు. తాతగారు దొరస్వామియని పేర్కొనుటకుబదులు వీరిని 'మాదుష్యంతుఁడు' అని ప్రియముగాఁబిలుచువారు. వీరి మధురగానము, సుందరరూపము, ఆదర్శప్రాయమగు నభినయమును నెల్లూరి వారికి నేఁటికిని కన్నులయెదుట నున్నట్లున్నవి. వీరి దుష్యంత పాత్రనుచూచి జటప్రోలు ప్రభువులు 'రాజంటేవాడే రాజురా, మిగిలినరాజులేమి గాజులు తరాజులు' అని వచించిరఁట. నాఁటి శ్రీ వేంకటగిరి మహారాజావారు సూటుపదార్థ సమూజము వారికి పారితోషిక మొసంగిరి. అట్లే వీరి ప్రతాపరుద్రుని పాత్రయు, అనిరుద్ధునిపాత్రయు చూచినవారిది భాగ్యము. బంగారయ్యగారి యుగంధరపాత్ర శాస్త్రులవారి మనసుకు నచ్చినది. కొండగుంట వేంకటరమణశాస్త్రిగారు (బి ఏ.) పేరిగాఁడుగా నద్వితీయులై కీర్తిపడసిరి. వీరికే ఏనాదిశాస్త్రి యని నామాంతరము. వేషమును, ఉచ్చారణయు, అభినయమును వీరిది పరమావధిఁబొందియుండెడిది. హనుమంతరావుగారు ఉప మొదలైన నాయికాపాత్రలను చక్కఁగ నిర్వహించువారు. గుంటూరు శివకామయ్యగారి చిత్రరేఖాభినయము శాస్త్రుల వారి మెప్పునుపడసినది. తాతగారి పద్యములను వారి యభిప్రాయము శ్రోతలకు తెలియునట్లు మనోహరగానముతో చదివినవారిలో వీర గ్రగణ్యులు. యరగుడిపాటి సోదరులు బాణాసురాదిపాత్రలను ధరించుచుండెడివారు.

వీనియందంతయు ప్రతిబింబించునది శాస్త్రులవారి మూర్తి. అక్షరమక్షరమును వారిశిక్షయే. నటునిచూడఁగానే ఫలాని పాత్రకీతఁడుతగునని వారికి తోఁచును. వారేపాత్రయొసంగిన ఆపాత్రనే నటులు ధరింపవలయునుగాని అన్యథా వర్తించుటకు అవకాశముండెడిదికాదు. పైగా వారిచ్చినపాత్రను ధరించిన వారికే ఆపాత్రయందు కీర్తివచ్చెడిది. మఱియొకపాత్రను ధరించిన చెడిపోవుచుండెడిది. ఇదియే డైరెక్టరుల కుండవలసిన లక్షణము. తాతగారిని ఒకరు ఈవిధముగా ప్రశ్నించిరఁట 'శాస్త్రులవారూ, తాముసటులనుచూచి వారికె తగిననాటకములను వ్రాసితిరా? లేక నాటకములకు తగిననటులు, అదృష్టవశమున, మంచివారు, దొరకినారా? లేకున్న అంతచక్కఁగా ఆపాత్రలకు ఈ నటులు కుదిరిపోయినారేమండీ!' అని. పాత్రకు సరియైన నటుని గ్రహించినవారు శాస్త్రులవారు. భారతాభారత రూపక మర్యాదలను వ్యాసములో నిట్లు వ్రాసియున్నారు.—

"నటులంగూర్చియు ఒకమాట చెప్పవలయును. నటునికి వాగ్మిత, దిట్టతనము, అనుకరణానైపుణి, సమగ్రనిజపాత్యపరిజ్ఞానమే కాక సమగ్రనాటకపరిజ్ఞానమును, ప్రజ్ఞయు వలయును.

"నటులను అర్హతంబట్టి పాత్రములకు నియమించినచో ఒజ్జలకు ప్రయాసముండదు. ప్రయోగము శోభిల్లును.

"పాఠ్యములో నటునికి ఒజ్జ ప్రతిశబ్దమును (ప్రతియక్షరమనియుం జెప్పనొప్పును) నేర్పవలయును. ఒద్దికలో నటులు గడి

దేరినపిమ్మటనే ప్రయోగము కావింపవలయును. ఒండుచో నటులు నానావిధముల కవికిని, ఒజ్జకును అవమానముం దెత్తురు.''

చెరుముకిపాత్రను ధరించుటకు ప్రయత్నించుచు శిక్ష నందుచుండిన శ్రీ కాళహస్తి సుబ్బయ్యశాస్త్రిగారికి తాతగారొకమారిట్లు వ్రాసియుండిరి. The play will not be staged unless the actors are made to be thorough with their parts in every way. You should keep sound health. If necessary Cod-liver oil will strengthen the voice. అని నటుల యారోగ్యాదివిషయములలో గూడ తాతగారు శ్రద్ధవహించుచుండిరి.

ఒద్దికలుకుదిరినవని తెలిసిన వెనుక నాటక ప్రదర్శనమునకు ముందు ఒకమారు వేషము వేసి ఒద్దికలుజరుపువారు. తమ డైరిలో నొకమారు డ్రెస్సురిహార్సలులేనందున నాటకము చక్కగా శోభిల్ల లేదని వ్రాసికొనిరి.

1916 సం మున బొబ్బిలి యుద్ధనాటకమును క్రొత్తగా శాస్త్రులవారు రచించిరి. శాస్త్రులవారి నాటకములనేగాని ఇతరులనాటకములను ప్రదర్శింపని ఈనట సమాజమునకు శాస్త్రులవారి క్రొత్తరచన అభిలషణీయమైనది. ఈకాలమునకు సమాజములో కొంత మార్పుకలిగినది. దొరస్వామయ్యంగారు చీలిపోయి ప్రత్యేకముగా నొక సమాజమును నిర్మించుకొనిరి. ఏవేవోనాటకములను ప్రదర్శించుకొనసాగిరి. ఆంధ్రభాషాభిమాని సమాజమునకు ఈనూతన నాటకమునకు నాయకపాత్ర

ధారి లేకపోయెను. ఐననేమి, ఎవరినైనను తయారుచేయగలి గిన తాతగారు వెంటనే దొరసామయ్యంగారి మేనల్లుఁడు శ్రీ సుందరరాజయ్యంగారిని ఆపాత్రకు సిద్ధముచేసిరి. రంగారాయ పాత్రకు సుందరరాజయ్యంగారు కుదిరినట్లు ఎవరును తర్వాత కుదురలేదు ఆ వెలమబీరమును వీరియందే చూడవలయును. వీరిని రంగమందు చూచువారికి ప్రాచీనరాజపుత్రవీరులు జ్ఞప్తికి వత్తురు. తర్వాత నాయకపాత్రలనుధరించి ప్రసిద్ధికివచ్చిన వారు బెంగళూరు రంగస్వామయ్యంగారు. తొలుత నాయికా పాత్రములను ధరించుచుండిరి. ముమ్మడమ్మ వేషము మొదలు యుగంధరపాత్రమువరకును అన్నిపాత్రలను వీరుధరించిరి. వీరి యుగంధరాభినయము చాలశ్లాఘనీయమైనది.

ఈవిధముగా నిరంతరము శిష్యులచే నాటకము లాడించుచు తాతగారు 1925 సం వరకు నెల్లూరిలో నుండిరి. సమాజమున తొలుత నుండిన శిష్యులు కొందఱు గతించిరి; కొందఱు రోగులైరి. శ్రీ దొరసామయ్యంగారు అసహాయోద్యమమున పాల్గొని జైలునుండి విడుదలయైవచ్చిన యనంతరము జబ్బులో పడిరి. శాస్త్రులవారి సమాజమునుండి వేఱుపోయినను గురువర్యులపై భక్తి వీడలేదు. మరల తొలుతటి సమాజమునకు రావలయుననియే వారియాశయము. ఆసహాయోద్యమమున పాల్గొని జైలుకుపోయినవెంటనే తాతగారికి జాబువ్రాయుచు నాటకమున ఖైదుచేయఁబడినది అబద్ధమనియు, తాము ఖైదై వాస్తవముగానే ప్రతాపరుద్రుఁడనుభవించినదశ ననుభవించు

చున్నామని వ్రాసిరి. జైలునుండి విడుదలయై వచ్చినదినము సమాజమువారుపోయి వారిని ఊరేగింపుగా ఊరిలోనికి కొని వచ్చిరి. రంగనాయకులపేటలో మాయింటివాకిట నిలిచి దొర సామయ్యంగారు లోనికివచ్చి తాతగారికి సాష్టాంగముగా నమస్కరించి 'శ్రీదయితుంగు దాసవులజెండి' అనుపద్యము, ప్రతాపరుద్రుడు విడుదలయైన వెంటనే యుగంధరుని పాదముల వ్రాలి చెప్పునట్లు చెప్పి కన్నీరుకాలువలుగా నేడ్చిరి. తాత గారును ఏడ్చిరి. అప్పటికే దుర్బలులుగా నుండినవారగుట దొరసామయ్యంగారిని చెంతనున్నవారు పట్టుకొని లేపవలసి వచ్చినది. తాతగారు ఆశీర్వదించి పంపిరి. ఆతర్వాత చాల కాలము తాము బ్రదుకజాలమని దొరసామయ్యంగారికి తోచి నది. ఒకమారు మరల దుష్యంత ప్రతాపరుద్రపాత్రల నభిన యించి ఆవెనుక చనిపోవలయునని తమ యాశయమని తాత గారికి తెలుపఁగా వెంటనే తాతగారు వారిని మరల సమాజ ములో చేర్చుకొనిరి. ఆవెనుక కొన్నినాటకములు నెల్లూరిలో ప్రదర్శింపఁబడినవి. 1925 సం॥ వచ్చుసరికి దొరస్వామయ్యం గారు, బంగారయ్యగారు, యరగుడిపాటి సోదరులు ఇంకను పలువురుగతించిరి సమాజమునుండికొందఱు లేచిపోయి ఆంధ్ర సభలోచేరిరి. అంతట ఎక్కువకాలము సమాజము జరుగదని తలంచి తాతగారు రత్నావళీనాటికను ప్రదర్శింపించి, సమా జమునకు 25 సంవత్సరములు నిండుటచే రజత మహోత్సవ మునుజరిపిరి. ఆవెనుక సమాజము అంతరించినది.



## ౨౫-ప్రకరణము

## కళాప్రపూర్ణనికడపటిదినములు. ఆముక్తప్రకాశనము.

1925 సం. మున, నాలుగేండ్లక్రింద తాతగారికి సన్న్యాసముచేసిన స్వాములవారు, భారతీకృష్ణతీర్థులు శారదాపీఠమున తమశిష్యులనుంచి తాము పురీజగన్నాథమునందు శంకరపీఠమునకు జగద్గురువులై వచ్చిరి. వచ్చిన వెంటనే తాతగారిని పురీజగన్నాథమునకు రప్పించిరి. తాతగారు, తమఋణము స్వాములవారి సాయముచే తీరుననియు, కుటుంబస్థితి బాగుపడుననియుం దలంచి 1925 సం, అక్టోబరులో బయలుదేరిపోయి కొంతకాలము స్వాములవారితో నుండిరి. ఆసమయమున స్వాములవారి మఠము కొన్ని వ్యాజ్యపుచిక్కులలో నుండినందున వెంటనే వారికి వారు తలంచినసాయము చేయలేకపోయిరి. తాతగారికి అనారోగ్యము హెచ్చయినందునను, ఆముక్తమాల్యదను ముద్రింపవలసియుండినందునను 1926 సంవత్సరారంభమున బయలుదేరి మదరాసుకే వచ్చిచేరిరి. నెల్లూరి కాపురమును చాలించుకొనిరి. పురీ-జగన్నాథమున నుండిన కాలముననే తాతగారు ఆంధ్రభారతమునంతయు పఠించి సవరించి ముద్రణోచితముం జేసినారు.

ఆముక్తమాల్యద 1927 సం జూలై నెలలో ప్రకటింపఁబడినది. ఈవ్యాఖ్యను వ్రాయుటకు తొలుత తాతగారిని ప్రోత్సహించినవారు శ్రీ పీఠికాపుర మండలేశ్వరులు శ్రీ రావు వేంకటకుమారమహీపతి సుర్యారావు బహద్దరువారు. తాతగారు

ఆముక్తమాల్యద ఉపోద్ఘాతమున వ్రాసియున్నారు. శ్రీ మహారాజావారు తాతగారికి పారితోషికముగా రు. 1200 పూర్వ యుద్ధమునకుముందొసంగిరి. తర్వాత వెలలు యుద్ధముచే హెచ్చినందున 'మహారాజావారొసంగినధనము ఆముక్తప్రాతప్రతులను విలుచుటకును, ఓరియంటల్ లైబ్రరీలో గ్రంథశోధనలు సేయించుటకును వ్యయమైనది'...శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారి ప్రేరణచే శ్రీయుత అల్లాడి కృష్ణస్వామయ్యగారు వేయిరూప్యములకొసంగిరి. తాతగారు 'జీవికయు ఆయతియులేక పెద్దగ్రంథముద్రణభారముక్రింద క్రుంగిపోవుచున్న' దినములవి ఈకాలమున ననేకులు వారికి 'శతాధిక రూప్యములనిచ్చి కష్టములను తొలగించుచుండిరి.' తాతగారిట్లు వ్రాసియున్నారు. 'ఇట్లు కొందఱు వదాన్యులు ధనమిచ్చినను, ఒకప్పటికి కూడినధనము ముద్రణాదికృత్యములకు పర్యాప్తముగాకయుండినది. ఆంధ్రగీర్వాణగ్రంథములనేరచూరమి రు 900 లకు కొనవలసివచ్చినది. దుర్దైవవశమున మందదృష్టినైతిని. దానంజేసి కార్యసహాయులకై రు 1500 ఎక్కుడుగానే వ్యయమయినది. ఆసమయమున, నేను రిక్తుఁడను రుగ్ణుఁడను, నిరాయతిని బహుకుటుంబిని, ఉక్తకారణములచేత బహువ్యయుండనుంగాన, ముద్రణమునకు తక్కువపడిన ధనమును వ్యయించుటకు స్వశక్తి లేకయునుంటిని. దానినెఱింగి యీ గ్రంథము తప్పకముద్రితమగుఁగాకయని నెల్లూరుజిల్లా కావలి

తాలూకా ఇందుపూరుగ్రామ్యవాస్తవ్యులు, భూస్వాములు శ్రీయుతులు ఎఱ్ఱబ్రోలు రామచంద్రారెడ్డిగారు......నాకు ఏతద్గ్రంథ ముద్రణపూర్తికై అప్పుడప్పుడు రు 2500 ల పరిమితిం జెందునటుకు విరాళ మొసంగిరి.’ ఈవిధముగా నీగ్రంథము 1927 సం జులయి నెలలో వెలువడినది. ‘చేసెదనింకఁదత్పరత సేవలుచూడికుడుత్త దేవికిఁ’ అని 1913 సం కావించిన ప్రతిజ్ఞను ఇన్నాళ్లకు చెల్లించుకొని ‘చేసితినిప్డు తత్పరత సేవలు చూడికుడుత్తదేవికిఁ’ అని ముద్రించినారు. ఆముక్తమాల్యద ముద్రితమై వెలువడినప్పుడు వారిహర్షమునకు మేర లేదు.

‘ఇన్నికడగండ్లపాలయి యిప్పుడీని
నచ్చుఁబొత్తంబుగాఁగంటిహర్ష మొసఁగ’ అని వ్రాసినారు.

1926 సం మున కంటికి ఆపరేషను జరిగినదికాని దృష్టి చక్కఁగా కుదుర లేదు. అట్లే ఆముక్తమాల్యదకు ప్రూపులు దిద్దిరి. లెక్కలేని అచ్చుఁ దప్పులుపడినవి. వానిని చాలవరకు సవరించిరి; మిగిలినవి చదువరులకే వదలిరి.

ఆముక్తమాల్యద ప్రకటితమైన సంవత్సరాంతమున ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు తాతగారికి కళాప్రపూర్ణ బిరుదము నొసంగి సత్కరించిరి. ఆనాఁడే బెజవాడ పురపాలక సంఘమువారు, వీరికి తమపురమున సర్వస్వాతంత్ర్యములను (Freedom of the city of Bezwada) ఇచ్చి గౌరవించిరి. ఇట్టి గౌరవములనందిన ప్రథమాంధ్రకవిపండితులు వీరే.

ఆముక్తమాల్యదా ముద్రణానంతరము తాతగారు గ్రంథములు వ్రాయలేదు; ఎప్పుడును మంచముననేపరుండి ఏదో చదువుచును వ్రాయుచు ధ్యానించుచునుండువారు. ఋణ మొకటియున్నది. అది తీరుట యెట్లని నిరంతరము చింతించు చుండువారు. రానురాను వారికి దిగులు వృద్ధి కాఁజొచ్చినది. శ్రీ గునుపాటి ఏనాదిరెడ్డిగారికి జాబులువ్రాయుచుండువారు. *“నాపేర వారమునకు రెండు జాబులు వ్రాయుటయేగాక అపుడపుడు ఋణవాతలు వ్రాయు జాబులను సైతము పంపుచుండిరి. నేనును ఇట్టి చందాలకుఁదిరుగు వాడుకలేనివాఁడ నగుటను తొల్లింటిపెద్దలు కలిసి రానందునను శ్రీవారి ఋణశల్యము నాహృదయశల్యమాయెను. 'మీరు ప్రయత్నించిన సర్వముఁ జక్కవడును' అని శాస్త్రుల వారాశీర్వదించుచుండిరి. 'ఇంత పెద్ద మొత్త మెట్లు సమకూర్పగలనాయని భయపడుచు, నావలన నేమికాగలదు. శ్రీవారి ప్రతిభయె సమకూర్చు' నను ధైర్యము వహించి, నామిత్రులును శాస్త్రులవారియందభిమానాదర ప్రపత్తులుగలవారును ప్రస్తుతము (ఇది వ్రాసినదినములలో) శాసనసభాధ్యక్షులుగనుండు శ్రీయుతులు బెజవాడ రామచంద్రారెడ్డిగారితో నీవిషయము విన్నవించితిని. వారు విని 'ఈయప్పు శాస్త్రులవారు తీర్పవలసినది కాదు. మనము చేసిన యప్పుగాభావించి తీర్చవలసిన బాధ్యత మనయందును ముఖ్యముగ మనరెడ్డి సంఘమునందేయున్న'దని పలికి 'మీరు

---

*శ్రీ ఏనాదిరెడ్డిగారు ప్రకటించిన నివేదికనుండి.

మనయూరికిరండు. మీరు శ్రీయుతులు బెజవాడ చంద్రశేఖర రెడ్డిగారితోఁగలిసి మాటలాడి ప్రయత్నింతు' మనిరి. అంతకు బూర్వమే యీవిషయము చంద్రశేఖరరెడ్డిగారితో నించుక సూచించియుంటిని గాన ఒక తేది నిర్ణయించుకొని బుచ్చిరెడ్డి పాళెమునకుపోయి నేనును రామచంద్రారెడ్డిగారును చంద్రశేఖరరెడ్డిగారివద్దకుంజని ఈవిషయము వారికి విశదపరచి ఒక సుముహూర్తము నిశ్చయించుకొని ఆ తేది మఱువ్వారము బుచ్చిరెడ్డిపాళియమునకేగి సి రామచంద్రరెడ్డిగారిచేత రు 500 లును చంద్రశేఖరరెడ్డిగారిచేత రు 500 లును చందాపట్టికయందు వ్రాయించి మామువ్వురము నెల్లూరికివచ్చి వయస్సున పిన్న లయ్యును వదాన్యతయందు పెద్దలగు శ్రీయుతులు రేబాల పట్టాభిరామరెడ్డిగారిచేత రు 1000 లను చందా వేయించి ఈ ప్రయత్నమంతయు వారికి విశదపరచి వారిని ఒడంబరుచుకొని మానలువురమొకసంఘముగజేరి ముఖ్యులగు రెడ్డిసోదరులచే కొన్ని వేలు చందాలు వేయించితిమి. పిమ్మట పట్టాభిరామరెడ్డి గారును నేనును కొంతధనమును, రామచంద్రరెడ్డిగారును నేనును మదరాసులో కొంతధనమును చందాలు వేయించితిమి. ప్రత్యేకముగా రామచంద్రారెడ్డిగారు శ్రీ వేంకటగిరికుమార రాజాసాహేబుగారివద్ద (ప్రస్తుతము రాజాసాహేబుగారు) వేయిరూప్యములందెచ్చియిచ్చిరి. రావుసాహేబు పొణకా వీరా రెడ్డిగారును నేనును కొందఱినిదర్శించి కొంతధనము చందాలు వేయించితిమి. నేను స్వయముగానే కొంతమంది ప్రముఖులను

సందర్శించి కొన్ని చందాలు వేయించితిని. మిగత చందాలు వేయించుటకును చందాధనము వసూలుంజేసి మానవలుపురము నిర్ణయించుకొనిన కోశాధ్యక్షునివద్దనుంచి శాస్త్రులవారి ఋణముందీర్చి మిగతధనమును శాస్త్రులవారి కుటుంబమునకు వినియోగింపవలసినబాధ్యత నాయందే యుంచిరి. ఈరామ చంద్రారెడ్డి, చంద్రశేఖరరెడ్డి, పట్టాభిరామరెడ్డి, వీరారెడ్డిగార్లు ఆజన్మము ఇచ్చుట యెఱింగినవారేగాని అడుగుట లెఱుఁగని వారలయ్యును శాస్త్రులవారియందలి ఆదరప్రపత్తులచే గొప్ప మొత్తములను విరాళములనిచ్చియు నన్ను వెంటనిడికొని అనేక స్థలములకుతిరిగి గొప్పసహాయ మొనర్చిరి. ఈసత్పురుషులకు నలు పురకు నేనాజన్మము కృతజ్ఞుఁడను. మేము వసూలుచేసిన మొత్త మును తనవద్ద భద్రపఱచి శాస్త్రులవారిఖర్చులకు నేను తెలియఁ జేసిన అనుక్షణమున నే వారికింబంపుచు నాకండదండ్వడుటయే గాక అపుడపుడు తనవద్ద నిలువయున్న మొత్తములకు వడ్డి సయితమొసంగిన కోశాధ్యక్షులును శాస్త్రులవారియందలి మిక్కిలిభక్తి ప్రపత్తులుకలవారునగు శ్రీయుతులు దొడ్ల రామ రెడ్డిగారికెంతయు కృతజ్ఞుఁడను. అంతట దాదాపు పదునొకండు వేల పరిమితము చందాలు వేయించి వసూలుప్రారంభించి చెన్న పురికిఁబోయి ఆడుమానద స్తవైజు లెక్కచూడఁగా అసలు ఫాయిదాలు రు 7500 అయినందుకు శ్రీమాన్ శఠగోపరామా నుజాచార్యులవారు (మొదట అప్పిచ్చినవారు) ఏడువేలు మాత్రము పుచ్చుకొని మిగత సంతోషముగ త్రోచివైచిరి.’’

ఇదంతయు తాతగారు చనిపోవుటకు కొన్ని నెలలు ముందు జరిగినది. అప్పటికి వారితల్లిగారు ఇంకనుం జీవించి యుండిరి. లక్ష్మమ్మగారు ఉడాలి యశ్వత్థసూర్యనారాయణ సోమయాజులవారి ప్రథమపుత్రిక. నూటరెండేండ్లు జీవించి యుండిరి కడపటివరకు దంతపటుత్వలోపముగాని దృష్టిలోపము గాని లేదు. తుదిదినములలో కొంత అస్వస్థముగానుండిరి. తాతగారికి తల్లిగారియందు చాలభక్త్యనురాగము లుండెడివి. నెల్లూరిలో ఏసన్మానముజరిగినను, సన్మానము జరిగిన వెంటనే వచ్చి తల్లిగారిని దర్శించి పూలమాలలతో తల్లిగారిపాదము లలో వ్రాలి ఆ వెనుక అలంకరణములనుతీయువారు. తాతగారు చనిపోవుటకు దాదాపు ఆఱునెలలుముందు వీరుగతించిరి. వార్ధక్యమున, లేవలేని స్థితిలో తల్లిగారికి క్రతువులు చేయవలసి వచ్చినది. సోదరులు చేయుచుండఁగా తాతగారు చెంతకూర్చుండి యుండువారేగాని అంతకన్న నేమియు చేయలేకయుండిరి. డెబ్బదియైదవయేట తాతగారు తల్లినికోల్పోయిరి.

1928 సంవత్సరము డిసెంబరు నెల ఆఖరులో గావలయు శ్రీ ఏనాదిరెడ్డిగారు తాతగారిని దర్శించి 'తమఋణమును తీర్చి వేసితిమి' అని చెప్పినప్పుడు ఆయనకుపుర సంతోషమునకు మేర లేదు. నెల్లూరిశిష్యులచే తమ కేర్పడినఋణము తమ చిరకాల మిత్రులసాయముచే తీరెనుగదాయని తాతగారు పరమానం దముం జెందిరి. సంతోషముచే కొన్నినిమిషములు ఏడ్చుచుండిరి.

ఋణముతీరినది. ఆతర్వాత ఆఱునెలలు మాత్రమే జీవించియుండిరి. ఆదినములలో వారిహృదయము నీటికన్నను పలుచగా కరఁగిపోవుచుండెను. దేనిని చూచినను జాలికలుగు చుండెను. శిశువువలె నైపోయిరి ఒక్కొక్కయప్పుడు ఒడలు తెలియని సంతోషము, ఒక్కొక్కప్పుడు చాలదుఃఖమును వారికి కలుగుచుండినవి. ఆ యాఱుమాసములు వారి గుండెనవిధము వర్ణింపతరముగాదు. ఎవరేదియడిగినను 'ఇచ్చివేయి' అను వారు, 'మనకు దేవుడిస్తాడురా' అనువారు ఏమియుందోచక పోయిన ఏనాదిరెడ్డిగారికి జాబువ్రాసి జవాబున కెదురుచూచు వారు. లేక కాగితము కలముంగొని తోఁచినదివ్రాసి చింపి వేయుచుండువారు. మరల ఏగ్రంథము వ్రాయవచ్చును, దేనికి వ్యాఖ్య, ఏకథను నాటకముచేయవచ్చును, రెడ్డి మహనీయులు చేసిన ఈ యుపకారమునకు తగిన ప్రత్యుపకారమేమిచేయ వచ్చును, అని ఆలోచించుచు నిరంతరము మంచముమీఁద పరుండి చుట్టును పుస్తకములనుంచుకొని కాలముగడపుచుం డిరి. వయసు డెబ్బదియైదు.

శ్రీ ఏనాదిరెడ్డిగారు తాము వసూలుచేసిన ద్రవ్యము నుండి ఋణమునకుపోను మిగిలినదానితో మఱికొంత వసూలు చేసి, మహాకవిపూజగా కనకాభిషేకము సేయించి, నిండు సభలో నెల్లూరి పౌరసాధమున తాతగారిని సత్కరింపదలంచి ప్రయత్నించుచుండిరి. తాతగారు పూర్వము ఋణమునుగూర్చి ప్రస్తావము వచ్చినపుడంతయు 'నేను ప్రాణంతో ఉండగా

కావలెనుగదా' అనియు 'అంతకాలం నాకు భగవంతుడు ఆయుస్సీవలెనుగదా' అనియు చెప్పుచుండెడివారు. ఎట్లో శ్రీ రెడ్డిగారిప్రయత్నమువలన తాతగారుండఁగనే ఋణనివృత్తియైనది. కనకాభిషేకముం గూర్చి శ్రీ రెడ్డిగారి సంకల్పము నెఱవేరకమునుపే చనిపోవుదు మేమోయనియు తలంచుచుండిరి. వేసవిదినములు మే నెలలో 'నేను భగవద్గీతకు ఆంధ్రానువాదమును రచించి నూ ఏనాదిరెడ్డిగారికి అంకితమిచ్చెదను' అని పలికిరి. పదిపన్నెండుదినములు అది పనిగా భగవద్గీతపై తమ భాండాగారమునందలి గ్రంథముల నన్నిటిని ఒకసారి చదివి 'ఇక నారంభించెదను' అనిరి. ఆదినము సాయంకాలమే జ్వరముతగిలెను. కాలిమీఁద నొకచిన్నపుండేర్పడినది. జ్వరము వృద్ధియైనది. అంతకు నెలదినములుముందు నా పెద తమ్మునికి ఉపనయనమునకు ఏర్పాటుచేసియుంటిమి. మధ్యలో తాతగారికి జ్వరమువచ్చినను దానిని నిలుపలేదు. ఉపనయనమునాఁటికి వారికి జ్వరమువచ్చి పదునొకండుదినములు. తాతగారికి కష్టముగానుండునని మేళములు మొదలైనవాద్యములను పూర్తిగా నిలిపివేయించితిమి. ఉపనయనము కేవలము మంత్రములతోనే జరిగెను. తాతగారు నాటి ఉదయము ఏమిరా, చప్పుడులేదు, వాద్యములులేవు. ఉపనయనము నిలిపివేసినారా యేమి?' అని అడిగిరి. 'లేదండీ. తమకు శబ్దము కష్టముగా ఉంటుందని వాద్యాలునిలిపినాము. మంత్రాలతోనే జరుపుతాము' అని నేనుచెప్పితిని 'ఆ. ఆ. మంచిపని.' అని సంతో

పించినారు. ప్రతిదినమును ప్రొద్దున నొకటి రెండుగంటలు శరీరముపై స్వస్థతయుండెడిది. తర్వాత జ్వరమువచ్చెడిది. ఒడలు తెలియని స్థితి. గంజిఆహారము ఉపనయనానంతరము నేను చెంతకుపోయితిని. 'మీకు, ఒంట్లో ఎట్లున్నదండీ?' అని యడిగితిని. 'పరమపదం, పరమపదం' అనిమాత్రము చాలకష్టముతో చెప్పగల్గిరి. ఆవెనుక వారికి చైతన్యములేదు. మరల తెల్లవారులోపల ౧౯౨౯ సం (1929) జూను నెల 18 తేది మంగళవారము వేకువను 5-45 గంటలకు పరమపదించిరి.



## ఉపసంహారము.

### వేంకటరాయశాస్త్రులవారి సారస్వతమూర్తి

తాతగారి యవతారము సమాప్తిమైనది. వారిజీవితము తిన్నగా నడువలేదు. మిట్టపల్లములు, చీఁకటివెలుఁగులు,-ఒకటి వెనుక నొకటి వారిని జీవితములో ననుగమించుచునే యుండినవి. కొంతకాలము సంతోషము కొంతకాలము దుఃఖము, మరల సంతోషము, మరల విషాదము- ఇట్లొకదాని తర్వాత నొకటి; తుదకు అంతయు సమసిపోయినది. బాల్యములో నెంత యుత్సాహముతో నుండిరి! ఆధునికులలో నవ్యకవులనుమించిన యుత్సాహముతో, తెనుఁగునుడికారమును ఆంధ్రజాతీయతను ప్రతిబింబింపఁజేయు జానపదవాఙ్మయరసమును తనివితీర నాస్వాదించిరి. కృష్ణా గోదావరీ పినాకినీ తీరములు వారి బాల్యవిహారభూములు సంస్కృతాంధ్రములలో నిష్ణాతులైన వెనుక, విధవావివాహవాదముల దినములలోను, కవిపండితసంఘమును 'మదరాసులో రూపుమాపిన' దినములలోను మేరువును తృణముగా భావించినారు. 'నాకుకూడా ముసలితనంవస్తుందని నేను అనుకోలేదు' అని ఒకానొకప్పుడు నాతో వేడుకగా వచించినారనఁగా ఎంతటి యారోగ్యవంతులుగా నుండిరో యూహింపవచ్చును. శరీరమందారోగ్యము, తమ ప్రజ్ఞయందు సంపూర్ణవిశ్వాసము, వాఙ్మయవిషయములలో గట్టిపట్టు, తాము పూనిన కార్యమును సాధించుదీక్ష, నిరంతరము సారస్వతపరిశ్రమ. ఏసభలోనైనను ఏవిషయమునందైనను ప్రతివాది నెన్నఁడును గెలిచి పోనీయ

లేదు. వారితో నెదురువాదమునకొప్పి నెగ్గినవారు లేరు. ప్రతి పక్షులు ఎదురుదెబ్బకొట్టలేక డొంకతిరుగుడుగావచ్చి తాక వలసినదే. పండితులెల్ల నొక్కటిగ తమపాత్రోచితభాష నరి కట్టంబూనినప్పుడు అందఱను ఎదిర్చి కేవలము తమ వాగ్ఝరి చేతనే తమసిద్ధాంతమును నెలకొల్పినారు. గ్రామ్యమును విశ్వ విద్యాలయమునకు రానీయక అడ్డినారు. పెక్కువిషయములలో పరమసిద్ధాంతములను వచించియున్నారు. వారేపద్ధతిననుస రించినను అయ్యది శాస్త్రీయముగను, ఆదర్శప్రాయముగునట్టి దిగా నుండుటయేగాక లోకవ్యవహారమున నెఱవేరదగినదిగా నుండును. గ్రామ్యమునకుగాని వ్యావహారికమునకుగాని వాఙ్మ యములో స్థానమున్నదని నిరూపించినారు గాని వాఙ్మయమం తయు వ్యావహారికమయ మగుటకు వారొప్పలేదు. ఆయావిష యములకు తగినశైలియు భాషయు నుండవలయునని వారి యాశయము. వారును, పాత్రోచితభాషయని చెప్పినను, ఒక విధమున వ్యావహారికమును నాటకములలో వ్రాసియున్నా రనియే చెప్పవలయును. రసగ్రహణపారీణులైనందున, పడవ వాండ్రు, చాకళ్లు, మంగళ్లు మొదలైనవారిపాటలును మాట లును రసవంతములై, ఎట్లెట్లు లోకమున నుచ్చరింపఁబడు చున్నవో ఆయావిధమునకుండినగాని స్వారస్యములేదని తలం చిరి. అది గదా భావోద్రేకమునకు కారణము వానినెల్లను గ్రంథస్థములఁజేసి వానికి శాస్త్రీయమైన స్థానమును ఆంధ్ర వాఙ్మయమున నొసంగుటకై పోరాడినవారు వీరు. జంగాల

పాటలను చదివి, విని, ఆనందించి ఆఫక్కికనే తమనాటకము లలో నవలంబించినవారు వీరు తప్ప ఇంకొకరు కానరారు. వ్యావహారికమున కథలు వ్రాయవచ్చునా కూడదా యను విషయమునకు సమాధానముగా, 'గ్రామ్య ముచ్చరింపరానిచో 'పుల్సు' కథ నెట్లుచెప్పగలము' అని వ్రాసినారు. అనఁగా నట్టి కథలు వానికి తగినభాషలోనే వ్రాయవలయుననిగాని 'వీర గ్రాంథికము'న వ్రాయవలయుననికాదు. సమయోచితముగా మెలఁగవలయునని వారి యభిప్రాయము.

ఉద్యోగదశలో తమధర్మమును తాముచక్కఁగా నిర్వహించినారు. అధికారులు మర్యాదకు వెలితిగా ప్రవర్తించిన విసరికొట్టినారు. విద్యార్థులను లాలించినారు; వారివారి చిత్తవృత్తుల కనుగుణముగ బోధించినారు; తమయందు విద్యార్థులకు గౌరవ ప్రపత్తు లేర్పడునట్లు మెలఁగినారు. స్వాతంత్ర్యమునకు భంగకరమైనపనులను తత్క్షణమే త్యజించుచుండినారు. ఎచటనైనను తమకుద్యోగము లభించుననియు తమ ప్రజ్ఞకు అడ్డు లేదనియు నెఱింగినారు. ఆదినములట్టియుండినవి. 'విమతులకు పులి విశ్వాసభాజనులకు చెలి.' వారికి 'నిండుమనంబు నవ్యనవ నీతసమానము; పల్కుదారుణాఖండల శస్త్రతుల్యము.' ఈరహస్యము నెఱింగినవారు గుమాస్తాలుగాను శిష్యులుగానుచేరి పలువగల ద్రోహముచేసి 'ఏదయినా సత్తావుంటే గ్రహించి,' పిదప పాదములపైఁబడఁగా మన్నించి మరల తమకడ చేర్చుకొని యున్నారు. తమ హితశత్రువులను విశ్వసించి, వారు శత్రువులను

విషయము గ్రహింపక, వారు చెప్పినట్టి తియ్యని మాటలను నమ్మి పలువిషయములలో మోసపోయిరి. కావుననే కొందఱు వారి నిజస్వరూపమును తెలిసికొనక వారిని దూషించుటయు తెలిసికొనినవారు చెంతచేరి వారిసర్వస్వమును భక్షించుటయు జరుగుచుండినది. తన్నాశ్రయించినవారికి ఎన్నడును లేదని చెప్పి యెఱుఁగరు. వారి హృదయము మైత్రీకోమలము.

ఉద్యోగమును వదలినతర్వాత విరామములేక భాషా విషయమై పరిశ్రమించిరి. అచ్చాపీసు ప్రారంభించిరిగాని, 1910 సం, ముననే దాదాపు ఇరువదిగ్రంథములను ముద్రింపగల్గిన వారు, ఆతర్వాత శృంగారనైషధమునకు వ్యాఖ్య వ్రాయు చుండినందువలన అన్నిగ్రంథములు ముద్రింపలేకపోయిరి. శృంగారనైషధ వ్యాఖ్యారచనానంతరము వచ్చిన చిక్కుల చేతను, నెల్లూరు మదరాసు రాకపోకలచేతను, నిఘంటువుకై పడిన వృథాప్రయాసచేతను, విశేషగ్రంథరచనకును ప్రకటనకును సాధ్యముకాకపోయినది. సంస్కృతాంధ్ర వాఙ్మయముల లోని గ్రంథములనెల్ల చక్కని వివరణాదికములతో ముద్రింప వలయునను గొప్పసంకల్పముతో నుండిరి గాని పరిస్థితులు సరిగా నేర్పడలేదు. నిరంతరము కుడిచేతకలము, ఎడమచేత పుస్తకమును గ్రహించి తమకుఁదోచిన యమూల్యవిషయములను గ్రంథ కరండములలో పదిలపరచుచునేయుండిరి. ముద్రణ క్రమమున తాతగారు ఆంగ్లపద్ధతుల ననుకరించిరి. పదములను విడదీయుటలోగాని, సులువుగా నర్థమగునటుల కామాలు,

సెమికోలనులు మొదలైనవానినుంచి పద్యములను ముద్రించుటలోగాని, వారి పద్ధతులనుచూచి మనము నేర్చుకొనదగిన విషయములు పెక్కులుగలవు. శృంగారనైషధముద్రణ మొక కళగా నెఱనేర్చిరి.

కూర్చుండినచోటినుండి కదలక గ్రంథావలోకమునందే రేయుంబవలు కాలముగడపువారికి క్రమముగా కొన్ని వాడుకలేర్పడుట సహజము. తాతగారికి దినమునకు లెక్కలేని పర్యాయములు కాఫీత్రాగుట యలవాటైనది. అదిలేనిదే వ్రాఁత జరుగదు. తాము చదువుకొనుగదిలో నొకమూల కాఫీకై ప్రత్యేకమొకబల్లయు, దానిపై నింగ్లీషుదొరలపద్ధతిని కాఫీ పరికరములన్నియు నుండెడివి. తోఁచినప్పుడంతయు కాపీచేసికొని త్రాగుచు చదువుకొనుచునుండెడువారు. వారి కాఫీరుచి అత్యాద్భుతముగా నుండెడిది. కొందఱు మిత్రులు కేవలము ఆకాఫీని రుచిచూచుటకొఱకే వారికడకు ఏదోమిష పెట్టి వచ్చుచుండువారు. వారి యధికమనోవ్యాపారమునకు ఇట్టిదిలేనిచో అంత పని సాధ్యమైయుండెడిదిగాదు. ఆహారవిషయములలో ఎంత మాత్రము శరీరమును కృశింపఁజేసికొనలేదు. బీరువలో ఎప్పుడును బిసకత్తులును, గొల్లభామమార్కు డబ్బాపాలు, 'కాడ్లివరాయిలు' మొదలైనవస్తువులుండెడివి. ఒక్కనిమిషమైనను తమ జీవితమున వ్యర్థపఱుపలేదు. హోటలుకు పోయి వచ్చినను, ఇంట ఫలహారముచేయించుకొని భుజించినను కాలహరణమగునని వారిభయము. విస్తరికడ నాలుగునిమిషములు

కూడ కూర్చుండువారు కారు. తమతో వ్యర్థముగా మాట లాడవచ్చువారిని వెంటనే పంపివేయువారు.

కాలహరణమగుననియే ద్రవ్యవిషయములలో కూడ ఎక్కువపట్టింపు వారికుండినదికాదు. తాతగారిని 'తాము సంపాదించినదానిలో, సరిగా లెక్కలుచూచుకొనుచు జాగ్రతగా నుండిన, చాలధనము మిగిలియుండునుగదా' అని యొకరనఁగా తాతగారు 'నాకు ధనము మిగిలియుండును గాని ఆముక్త మాల్యదా శృంగారనైషధములకు వ్యాఖ్యలు వ్రాసియుండ లేనుగదా' అనిరి. వారికి కావలసినది కీర్తిగాని ద్రవ్యముగాదు.

ధర్మశాస్త్రవిషయములలోను సాంఘికవిషయములయందును తాతగారు కేవలము పూర్వాచారపరాయణులుగారు. మత సాంఘిక విషయములలో మార్పుండవలయునను నభిప్రాయముకలవారేయైనను ఆమార్పు క్రమముగా నేర్పడవలయునేగాని బలాత్కారముగా తటాలున అన్నిటిని తల క్రిందులు చేయునదిగా నుండరాదనువారు. బ్రాహ్మణులలో లెక్కలేని శాఖాభేదము లనవసరములనియు ఆంధ్రులుగాని ద్రావిడులుగాని, నియోగులుగాని వైదికులుగాని పరస్పర సంబంధములు చేయుటలో తప్పులేదని వారియభిప్రాయము. అట్లే పలువురకు సలహాలనిచ్చియున్నారు.

ఆంధ్రదేశమందలి సమకాలికపండితులలో మహోన్నత స్థానమునందినారు. బాల్యములో తరగతులలో వారి తావు తప్పింపనేరులతరము కానట్లే ఆంధ్రపండితులలో వారితావు

తప్పింపఁగలవారు వారికిముందును లేరు తర్వాతయునుండఁబోరు. ఏవిషయమును గుఱించియైనను వారు వ్రాయఁబోవుచున్నారనఁగనే ఇతరు లాయుద్యమమును త్యజింపవలసినదే. వారు కావించిన పని ఒక్కొక్కటియు కొందఱు పండితులు జన్మమంతయుం కూర్చుండి చేయఁదగినవి కాని ఒకరు చేయఁగలిగినవి కావు. వారి యుపన్యాసములను గొప్పగొప్పపండితులే ఒకరి నొకరు త్రోసి కొనివచ్చి వినువారు. వానిలో విషయము సమగ్రము; దుర్బోధమైన వ్యాకరణవిషయమైనను వారి హాస్యధోరణిలో నుపన్యస్తమైన సుబోధమగును. విసంధివివేకముంగూర్చి వారియుపన్యాసమును వినినశ్రోతలు కడుపులు చెక్కలగునట్లు నవ్విరనఁగా నిక వేఱుగా చెప్పనక్కరలేదు. సమకాలికపండితులలో వారికి విమతులై ద్వేషించిన యేకొలఁదిమంది పండితుల దోషములను కొన్ని ప్రబలకారణములచే వెల్లడిగావించినారేగాని తదితరులయందు ఆదరాభిమానములు చూపినారు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు (మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు) తాతగారి శిష్యులే. కింకవీంద్రఘటాపంచాననులు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తాతగారి ప్రశిష్యులే. ఈవిషయమును శ్రీయుత అల్లాడి కృష్ణస్వామయ్యగారియింట జరిగిన యొక సమావేశమున శ్రీ వేంకటశాస్త్రిగారే తమ యుపన్యాసమున నొక్కి చెప్పియున్నారు. ఇరువురయందును తాతగారికి చాల ఆదరముండెడిది. శ్రీ గురుజాడ అప్పారావుగారు, వారితో నభిప్రాయభేదముండియు, వారియెడ నెట్టి

గౌరవప్రపత్తులు గలిగియుండిరో వారిజాబులచేతనే తెలియుచున్నది. శ్రీ వఝల చినసీతారామశాస్త్రులవారు వారికి తాతగారిచ్చిన యభిప్రాయములను ప్రాణప్రదములనుగా దలంచి పదిలపరచుకొనియున్నారు. వారి వసుచరిత్ర విమర్శను తాతగారెంతయో కొనియాడియున్నారు. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారికి ఆంధ్రవిమర్శకులలో నత్యుత్తమస్థానమీయదగునని తమపుస్తకములో 'మార్జినలు నోట్సు'గా వ్రాసికొనియున్నారు. ఇట్టివారు పలువురుగలరు. గుణమున్నచోట పొగడినారు; లేనిచోట నిజమును తెలిపినారు.

1929 సం, జూను 23 తేది వెలువడిన యుగంధరపత్రిక ఇట్లు నుడువుచున్నది.

"స్వతంత్రమూర్తి, స్వాధీనుఁడు. వైలక్షణ్యముసహజము. ఆయన వాక్యరచనయందు, ఆయనప్రసంగమునందు, ఆయనవ్యాఖ్యానాది టీకలయందు ఆయనబోధయందు, పద్యకవనమునందు—ఒకదానిలోగాదు తత్కృతులలో నొక్కొకదానియందు ఆయనస్వతంత్రత, స్వాధీనత, విలక్షణత ముద్రితములై యుండుట కన్నుగలవారుచూడఁగలరు. శిష్యవత్సలుఁడు. చలపట్టెనా ప్రత్యర్థి నిపట్టి పల్లార్పవలసినదే. శరణమిచ్చెనా సమర్థించి రక్షింపవలసినదే. నిరంకుశుఁడు. నీతిపరుఁడు. భాషాప్రపంచమున సర్వతంత్రస్వతంత్రుఁడే. సర్వాధికారి. ప్రామాణికుఁడు పరిపూర్ణుఁడు. ఆసమయస్ఫూర్తి, ఆసందర్భశుద్ధి, ఆ మేధాశక్తి, ఆప్రతిభ, ఆప్రజ్ఞ, ఆప్రయోగకౌశలము, ఆహాస్యవిలాసము, ఆచలోక్తి, నిరుపమానములు. కనివినినవారిదే భాగ్యము.

"ప్రతివాదినెన్నడు గెలిచి పోనీయలేదు. ఆత్మకుప్రియముగ గ్రంథముల రచించెనేగాని అర్థమునకై యాశించి పామరాభిరుచికై ప్రాకులాడలేదు. అడిగినసందేహము తత్క్షణముతీర్పవలసినదే......

"దూరమునుండి చూచువారికి భయంకరుఁడు. సన్నిధి సేసినవారి కభయంకరుఁడు. ఈయన స్వవిరచితగ్రంథములునట్లే. పైపైఁజూచువారికి పాషాణకఠినములు నీరసములు. చొరబడి చదివినవాఁడు ద్రాక్షాదికదళీపాకములు రుచిగొనగలఁడు. కవిత్వమునందలి బింకము, శబ్దప్రయోజనము, సందర్భోచితి అచ్చునబోసినట్లుండును. ఇంతేల రసపుష్టి, శబ్దపుష్టి.

"ఇక ధార్మికవిషయము తెలిసినవాఁడు. పూర్వాచారముల యెడ విశ్వాసములేదు. నవీనాచారములయెడ వ్యామోహము లేదు. సమయానుకూలముగ సంచరించు నేర్పరి. నిస్పృహతో లాంపట్యముకలదు. కోపము క్షణికము. పంతమధికము. తుష్టి లేనితృష్ణ. కలిమిలేములీయనకుఁ గావడికుండలు. దరిద్రదేవతతోఁ బోరాడని గడియయుండదు."

తుదకు జీవితము తిన్నగా నడువలేదు. తలంచినపనులు సరిగా రాలేదు. కుమారుఁడు లేతవయసులో చనిపోయెను. అచ్చాఫీసు విక్రయింపవలసివచ్చెను. ఆంధ్రభాషాభిమానిసమాజము అంతరించెను. శరీరమందనారోగ్యము అధికమాయెను. కుటుంబభారము ఎక్కువయైనది. చదువుకొనవలసినవారము మేము నలువురము (ముగ్గురము మనుమలమును ఒక్క మనుమరాలును) ఏర్పడితిమి. తలవని తలంపుగా కొంత ఋణమేర్పడినది. ఆర్జన బొత్తిగా లేకపోయినది. ఈవిధముగా తుదిదినములలో తాతగారు తమవశము కాకపోయిరి. కాని శ్రీ యేనాదిరెడ్డి గారియు వారి రెడ్డిసంఘమువారియొక్కయు సాయముచే ఋణనివర్తియైన సంతసమును మాత్ర మనుభవించిరి. ఇక నిన్నిగ్రంథములను రచించి తమరెడ్డిమిత్రుల నామాంకితము గావింపవలయు ననెడు ఆసయుండినదిగాని అయ్యది నెఱవేర్చుకొనలేకయే కాలగతిం జెందిరి.

ఐననేమి చిరస్థాయియైన కీర్తినిగడించిరి. సంస్కృతాంధ్ర వాఙ్మయములందు కూలంకషప్రజ్ఞావంతులని ప్రసిద్ధి నందిరి. కవి, వ్యాఖ్యాత, ఉపాధ్యాయుఁడు, మహావక్త, సభారంజకుఁడు – అన్నిగుణములును వీరియందు మూర్తీభవించి యుండినవి. తాతగారిరూపము నేత్రపర్వము. ఐదడుగులయెత్తు, గట్టిశరీరము, ఎక్కువస్థూలము కాకపోయినను మంచిపుష్టి; కొంతపొట్టివారివలె దవ్వునకు కనఁబడువారు. కాలేజీదినములలో నొక్కొకప్పుడు సూటుధరించువారు. సైకిలుపై నేఁగుచుండిరి. ఆదినములలో వారిరూపమును శృంగారనైషధమందలి చిత్రముచే నెఱుంగవచ్చును. తర్వాతిరూపము మనమెఱిఁగినదే. శరీరము లేతయెఱుపుదిరిగిన బంగారువర్ణము. వారి యుత్తుంగనాసావంశము, స్ఫుటమైన అవయవసౌందర్యము, ఆ తేజోవంతమైన ముఖము విశాలఫాలభాగము ప్రాచీన భారతీయ ఋషిపుంగవుల జ్ఞప్తికిఁదెచ్చుచుండును. స్నేహితులతోను శిష్యులతోను ఆయా విషయములను మాటలాడునప్పుడు ఆనేత్రములకాంతియు, ఆదరహాసమును, స్పష్టమును గాంభీర్య మాధుర్యపూరితమైన యాకంఠస్వరమును కనివినినవారిదే భాగ్యము.

ఆంధ్రవాఙ్మయమున ఆదినుండి నేటివఱకును చూడఁగా కొందఱు భాషానుశాసకులైరి, కొందఱు కవులైరి, కొందఱు కేవలము అనువాదకులైరి, కొందఱు నాటకరచయితలైరి, కొందఱు నవలలుమాత్రమే వ్రాసిరి, కొందఱు విమర్శకులుగా

వెలింగిరి. ఇన్ని గుణములును ఒకరియందే పరిపూర్ణతం గాంచుట శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారియందే గాంచితిమి. భాషారాధకులలో నిట్లు సర్వతోముఖ పాండిత్యముగలవారరుదు. ఆదర్శప్రాయులగు శ్రీ శాస్త్రులవారే ఆంధ్రవాఙ్మయమున నాధునికయుగకర్త లనఁజెల్లుదురు. అన్నిటను నూతన మతావలంబకులు పరమపదించినను ఆంధ్రసీమయందు గ్రంథములరూపమున నున్నారు. అక్షరరూపమునందినారు. ఆంధ్రులకు చిరస్మరణీయులైనారు. వీరిశిష్యులును ప్రశిష్యులును నేఁడు ఆంధ్రభాషారాధకులలో మహోన్నతస్థానము నంది యున్నారు. ఇట్టి భాషాసమ్రాట్టును పడసిన యాంధ్రమాతదే భాగ్యము

# కాలానుక్రమణిక

సంవత్స. విషయము

1853 డిసంబరు 21 తేది వేంకటరాయశాస్త్రులవారి జననము

1860 జూలై 14 ,, పూండ్ల రామకృష్ణయ్యగారి జననము

1869 శాస్త్రులవారు మెట్రిక్యులేషను పరీక్షయగుట

1862 చిన్నయసూరిగారి నిర్యాణము.

1875 శాస్త్రులవారు ఎఫ్. ఏ. అగుట.

1879 ఆగస్టు 3, వీరేశలింగము పంతులవారు విధవావివాహమునుగురించి చేసినయుపన్యాసముమీఁద శాస్త్రులవారు రాజమండ్రినుండియే ఖండనోపన్యాసముంగావించిరి. [వీ. లిం. స్వీయచరిత్ర—పు 140]

1883 స్త్రీపునర్వివాహదుర్వాదనిర్వాపణ గ్రంథము ప్రకటితము.

1885 శబ్దరత్నాకర ప్రథమముద్రణము.

అముద్రితగ్రంథచింతామణి ప్రారంభము.

1886 జూలై 25 శాస్త్రులవారికుమారులు వేంకటరమణయ్య (రాజన్న) గారి జననము.

ప్రక్రియాఛందస్సు, అలంకారసారసంగ్రహముల రచన

భోజ విక్రమార్కచరిత్రములు తెనుఁగుటీకలతో ముద్రించుట

నవంబరు క్రిశ్చియన్కాలేజీ సంస్కృతపండితపదవినందుట

1887 బి. ఏ. పరీక్షకుపోవుట.

1888 ప్రతాపరుద్రీయకథను జనవినోదినిలో ప్రకటించుట

1890 జ్యోతిష్మతీముద్రాక్షరశాలను ప్రారంభించుట

1891 కథాసరిత్సాగర ప్రథమముద్రణము

మార్చి, 20 శుక్రవారము సాయంకాలము శ్రీ బ. సీతారామాచార్యులవారి నిర్యాణము.

సంవత్స. విషయము.

జనవినోదినీ సంపాదకత్వమును మానుకొనుట (?)

నాగానందనాటకప్రకటనము. ప్రాచీనభాషాప్రారంభము.

1894 కొక్కొండ వేంకటరత్నముపంతులవారి బిల్వేశ్వరీయమును పూండ్ల రామకృష్ణయ్యగారు విమర్శించుట.

1895 ధ. రా. గారి చిత్రనళీయప్రకటనము.

1896 శాస్త్రులవారి ఆంధ్రాభిజ్ఞాన శాకుంతల నాటక ప్రకటనము

1897 ప్రతాపరుద్రీయ నాటక ప్రకటనము

అప్పారావుగారి కన్యాశుల్క ప్రకటనము.

ఏప్రిలు—ఆంధ్రకవిపండితసంఘము. ప్రథమసమావేశము.

1898 జక్కనవిక్రమార్కచరిత్రము ప్రణవిమర్శనము. శారదాకాంచిక ప్రథమకింకిణి. ఆంధ్రప్రసన్నరాఘవనాటక విమర్శనము. శా. కా. ద్వితీయకింకిణి.

1899 జనవరి 1 తేది. ఆంధ్రకవిపండితసంఘ ద్వితీయసమావేశము.

ఏప్రిలు 31 తేది. ఆంధ్రభాషాభిమానిసమాజప్రారంభము నెల్లూరు.

1900 కాళహస్తిమాహాత్మ్య ముద్రణవిమర్శనము. శా. కా. 3 కింకిణి.

వేంకటరమణశాస్త్రులవారి నిర్యాణము.

1901 గ్రామ్యభాషాప్రయోగనిబంధనము. శా. కా. 4 కింకిణి.

మోచాకుసుమామోదవిచారము శా. కా. 5 కింకిణి (?)

మార్చి—శేషగిరిశాస్త్రులవారి నిర్యాణము.

ఉషానాటకప్రకటనము.

1902 మేఘసందేశము పదప్రయోజనిక

1904 సెప్టెంబరు 1 తేది పూండ్ల రామకృష్ణయ్యగారి నిర్యాణము.

అముద్రితగ్రంథచింతామణి నిలిచిపోవుట.

1908 అక్టోబరు. జ్యోతిష్మతీముద్రాక్షరశాలను మరల నెలకొల్పుట.

| సంవత్స. | విషయము. |
|---|---|
| 1909 | పుష్పబాణవిలాసము. తెనుఁగుటీక. |
| 1910 | క్రిశ్చియన్కాలేజినుండి విరామము. గ్రంథముద్రణ కార్యములు |
| | రఘువంశము 6 సర్గలు తెనుఁగుటీక. |
| | కుమారసంభవము. 6 సర్గలు ,, |
| | అమరుకావ్యము. తెనుఁగుటీక |
| | రసమంజరి. ,, |
| | భర్తృహరిశతకత్రయము. సంపూర్ణాంధ్రవ్యాఖ్యతోను తెనుఁగు పద్యములతోను ముద్రితము. |
| | పంచతంత్రము మూలముమాత్రము |
| | చేమకూర—సారంగధరచరిత్ర. లఘుటీక |
| | ,, —విజయవిలాసము ,, |
| | గౌరన—హరిశ్చంద్రద్విపద ,, |
| | మడికిసింగన—జ్ఞానవాసిష్ఠరామాయణము |
| | బాణాలశంభుదాసు—సారంగధరద్విపద |
| | విన్నకోటపెద్దన—కావ్యాలంకారచూడామణి |
| | ముక్కుతిమ్మన—పారిజాతాపహరణము, |
| | ప్రియదర్శికానాటిక—శ్రీహర్షకృతి-సంస్కృతటిప్పణము, తెనుఁగు సంపూర్ణటిక, గద్యపద్యములుగా ఆంధ్రీకరణము. |
| | హితోపదేశము—తెనుఁగుతర్జుమాతో. |
| | దశకుమారచరితము— ,, |
| | బేతాళపంచవింశతిక—తెనుఁగువచనము |
| | విక్రమార్కునియద్భుతకథలు— ,, |
| 1912 | గ్రామ్యదేశనిరసనము—ఉపన్యాసము |
| 1913 | శృంగారనైషధము—సర్వంకషవ్యాఖ్య. |

| సంవత్స. | విషయము. |
|---|---|
| 1914 | నవంబరు 18 తారీఖు—నెల్లూరు, మూలపేటలో నివాసము |
| 1915 | డిసంబరు—సూర్యరాయాంధ్ర నిఘంటుసంపాదకత్వ ప్రారంభము. |
| | అందులకై మదరాసుకాపురము |
| 1916 | బొబ్బిలియుద్ధనాటకప్రకటనము. |
| | శ్రీ వేంకటగిరిమహారాజా గోపాలకృష్ణయాచేంద్రులవారి మరణము |
| 1918 | ఫిబ్రవరి—నిఘంటువుతో సంబంధము వీడిపోవుట |
| 1919 | జ్యోతిష్మతీవిక్రయము |
| | మాళవికాగ్నిమిత్రనాటకము. |
| | మహోపాధ్యాయబిరుదము, రు 1116 బహుమానము |
| | ఆంధ్రసాహిత్యపరిషదధ్యక్షత్వము. |
| 1920 | విమర్శవినోదప్రకటనము |
| | తిక్కనసోమయాజివిజయము—తిక్కనవర్ధంత్యుపన్యాసము. |
| | ఉత్తరరామచరిత్రనాటకాంధ్రీకరణము. |
| | ఆముక్తమాల్యదవ్యాఖ్య తే 24-6-1920 నాఁడు ప్రారంభించి తే 28-10-1920 నాటికి పూర్తిగావించిరి. |
| 1921 | విక్రమోర్వశీయము |
| | రత్నావళీనాటిక |
| | సాహిత్యదర్పణమును ఆంధ్రీకరించుటకు ఫిబ్రవరి 2 తారీఖున ప్రారంభించి ఏప్రిలునెల 11 తారీఖునాటికి పూర్తిగావించిరి. |
| | ఆంధ్రహితోపదేశచంపువు |
| 1922 | జనవరి—నేటివిండ్సరుప్రభువు, వేల్సుయువరాజుగా మనదేశమునకు వచ్చినప్పుడు మదరాసులో సన్మానము చేయుట. |
| | మరల నెల్లూరకాపురము |

| సంవత్స. | విషయము. |
| --- | --- |
| | జూలై - స్వాములవారి సత్కారము-మహామహోపాధ్యాయ, సర్వతంత్రస్వతంత్రేత్యాది బిరుదప్రదానము. |
| | నవంబరు-14 తేది శాస్త్రులవారికుమారులు వేంకటరమణయ్యగారి నిర్యాణము. |
| 1923 | ఆంధ్రమహాసభాధ్యక్షత్వము-చిత్తూరు |
| 1924 | గద్వాలు ప్రయాణము. |
| 1925 | ఆంధ్రభాషాభిమానిసమాజము. రజతోత్సవము. మరల మదరాసుకాపురము. |
| 1926 | కంటిఆపరేషను. ఆముక్తముద్రణము. |
| 1927 | ఆముక్తప్రకాశనము. కళాప్రపూర్ణ బిరుదము. బెజవాడ పురపాలకసంఘమువారు 'నగర స్వాతంత్ర్యగౌరవము' నొసంగుట |
| 1928 | డిసంబరు. శాస్త్రిగారి తల్లిగారు గతించుట-ఏనాదిరెడ్డిగారు ఋణమును తీర్చివేయుట |
| 1929 | జూను, 18 తేది ఉదయము 5-45 గంటలకు శాస్త్రిగారి నిర్యాణము. |
| 1931 | నవంబరు 12 తేది వారిసోదరులు వేంకటాచలయ్యగారి నిర్యాణము. |
| 1932 | ఆంధ్రహితోపదేశచంపూముద్రణము |
| 1935 | ఆంధ్రసాహిత్యదర్పణ ముద్రణము. |

చంద్రికాప్రెస్, మదరాసు:—1-11-1949

## వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4. మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీథి, జి. టి మదరాసు.

ఆర్డరుతోకూడ సగముసొమ్ము అడ్వాన్సు పంపవలెను.

(తపాలుచార్జి ప్రత్యేకము.)

### సంస్కృత గ్రంథములు.

| | | |
|---|---|---|
| మేఘసందేశము, మల్లినాథ వ్యాఖ్య - తెనుఁగున ప్రతిపద టీకాతాత్పర్యపదప్రయోజనచర్చ-ఆక్షేపసమాధానములు. రు. | 2 | 8 |
| రఘువంశము మల్లినాథవ్యాఖ్య - తెనుఁగు టీకాతాత్పర్యములు. మొదటి 6 సర్గలు | 3 | 0 |
| కుమారసంభవము, మొదటి 6 సర్గలు. పైదానివలెనే టీక. | 3 | 0 |
| అమరుకావ్యము శృంగారలక్ష్యము. వేమభూపాల సంస్కృత వ్యాఖ్య. సంపూర్ణాంధ్రటీకయు. అచ్చగుచున్నది. | 1 | 8 |
| పుష్పబాణవిలాసము. సంస్కృతవ్యాఖ్య. తెనుఁగు పూర్ణటీక. | 0 | 12 |
| హితోపదేశము, మూలముమాత్రము | 1 | 0 |
| పంచతంత్రము ,, | 1 | 8 |
| దశకుమారచరిత్రము ,, | 1 | 0 |
| వ్రతకల్పవల్లి (6 వ్రతములు) | 0 | 12 |
| బిల్హణచరిత్రము, తెనుఁగు పూర్ణటీక. | (అచ్చగుచున్నది) | |
| రసమంజరి, శృంగార రస స్వరూపవిస్తరము, సటీక. ,, | 1 | 8 |
| ప్రియదర్శికా నాటిక, శ్రీహర్ష కృతి సంస్కృతటిప్పణము గద్య పద్యములుగా ఆంధ్రీకరణము సయితము | 1 | 0 |
| శబ్దమంజరీ సమాసకుసుమావళీ తిజంతమంజరులు, పాతప్రతి | 0 | 4 |

### ఆంధ్ర గ్రంథములు.

#### పద్యకావ్యములు.

| | | |
|---|---|---|
| ఆముక్తమాల్యద సంజీవనీవ్యాఖ్య. | 12 | 0 |
| శృంగారనైషధము సర్వంకషావ్యాఖ్య . | (అచ్చగుచున్నది) | |

| | | |
|---|---|---|
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి. టీకాసహితము. క్రొత్తయచ్చు | 3 | 0 |
| సారంగధరచరిత్రము,, ,, | (అచ్చులో) | |
| జ్ఞానవాసిష్ఠరామాయణము, వేదాంతము, మడికిసింగనకృతి | 1 | 8 |
| ఆంధ్రబిల్హణీయము, నిర్దోషము | 0 | 8 |
| పారిజాతాపహరణము, మూలము | 0 | 8 |
| సారంగధరచరిత్ర, ద్విపద (కవి విశ్వకర్మమతస్థుఁడు) | 0 | 8 |
| హరిశ్చంద్ర, ద్విపద, గౌరనమంత్రి ప్రణీతము | 1 | 0 |

## నాటకములు.

| | | |
|---|---|---|
| ప్రతాపరుద్రీయనాటకము, సటిప్పణము, క్రౌనుసైజు | 2 | 0 |
| బొబ్బిలియుద్ధనాటకము | 1 | 8 |
| ఉషానాటకము, సటిప్పణము, క్రౌనుసైజు | 1 | 8 |
| శాకుంతలనాటకము, కాళిదాసీయమునకు తెనుఁగు | 1 | 0 |
| విక్రమోర్వశీయనాటకము, Inter Text నోట్సుతో | 2 | 0 |
| మాళవికాగ్నిమిత్రనాటకము | 0 | 12 |
| నాగానంద నాటకము (అచ్చగుచున్నది) | | |
| రత్నావళీనాటిక, శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారివ్యాఖ్యతో | 1 | 4 |
| ప్రియదర్శికానాటిక | 0 | 8 |
| ఉత్తరరామచరిత్రనాటకము—విపులమగుపీఠికతో పునర్ముద్రితము | 2 | 0 |

## సులభ వచనగ్రంథములు.

| | | |
|---|---|---|
| హితోపదేశకథలు, నీతిబోధకములు, (అచ్చగుచున్నది) | 0 | 8 |
| భోజ కాళిదాసకథలు, రసభరితములు. | 0 | 12 |
| బేతాళపంచవింశతిక ,, | 0 | 12 |
| విక్రమార్కుని యద్భుతకథలు, గుణముకలిగించునవి. పునర్ముద్రితము | 0 | 12 |
| కథాసరిత్సాగరము, అద్భుతనీతి వ్యవహారకథలు, ఆఱుభాగములు | 12 | 0 |
| ఒక్కొక భాగము ప్రత్యేకముగా | 2 | 8 |
| ఆంధ్రదశకుమారచరిత్రము, మూలమునకు సరియైనయాంధ్రీకరణము | 1 | 0 |

## లక్షణగ్రంథములు.

ఆంధ్రసాహిత్యదర్పణము, ఉదాహరణశ్లోకములతో 5 0

కావ్యాలంకారచూడామణి తొమ్మిది ఉల్లాసములు 1 8

అలంకారసారసంగ్రహము, సటీకాతాత్పర్యము 0 12

ఛందస్సు, విద్యార్థుల కుపయోగము, సంగ్రహము 0 4

## శారదాకాంచికలు–విమర్శలు–ఉపన్యాసములు.

జక్కన విక్రమార్క–చరిత్ర ముద్రణవిమర్శనము 1 కింకిణి (అచ్చగుచున్నది)

ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శ 2 కింకిణి ,,

కాళహస్తిమాహాత్మ్య ముద్రణవిమర్శనము 3 కింకిణి ,,

గ్రామ్యభాషాప్రయోగనిబంధనము, (శాస్త్రోచిత భాషను గుఱించినది) 4 కింకిణి 0 12

మోచాకుసుమామోదవిచారము 5 కింకిణి ,,

ఆంధ్రవ్యాకరణసర్వస్వ విమర్శనము 6 కింకిణి ,,

విమర్శవినోదము, సంస్కృతాంధ్ర కావ్యనాటకాది విషయకము 0 12

తిక్కన సోమయాజివిజయము 0 8. విసంధివివేకము 0 2

భారతాభారతరూపకమర్యాదలు, (నాట్యకళాచరిత్రము) 0 6

ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము 0 6

గ్రామ్యాదేశనిరసనము, కడుపుబ్బనవ్వించు విమర్శ 0 6

స్త్రీపునర్వివాహగ్రంథము 1 0

ఆంధ్ర హితోపదేశచంపువు, గద్యపద్యాత్మకము 1 4

ఆంధ్ర భాషాసర్వస్వార్థ నియామకతిపయములు (నిఘంటురచనావిధి) 0 4

## క్రొత్తగా వెలువడిన గ్రంథములు.

కుమారదేవపండితీయము, ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య. తాళ్లూరివారిది 2 8

పద్యకథాలహరి For Comprehension Test అప్రూవుడు 0 12

ఉదయనచరితము, శ్రీ శాస్త్రిగారి కథాసరిత్సాగరమునుండి పాఠశాలలకొఱకు సంగ్రహింపఁబడినది. వచనము అప్రూవుడు 0 12